దేశ విఖ్యాతిగాంచిన విమల్ చీరల్లో సరిక్రొత్త శ్రేణికై
విచ్చేయండి నేడే మంగళ్ దీప్ కి.




**మంగళ్‌దీప్**

కోఠీ, హైదరాబాద్
ఫోన్: 45786

**మంగళ్‌దీప్**

దాస్‌పల్లా కాంప్లెక్స్, 8.జగదాంబ సెంటర్
విశాఖపట్నం

## కోకిలస్వామి దివిచేరెనా ఏమి !

భావకవితా భానుడస్తమించేడా !
నవ్యయుగ వైతాళికుడు దివ్యుడైనాడా !
కవికోకిలస్వామి దివికెగిరినాడా !
అమలిన శృంగారారామ — 'తోటమాలి'
ఆషాఢ ప్రథమ దివసాన అమరుడైనాడా !
'సెలవమ్మ దేశమా, సెలవిమ్మ కడసారి
దేశమా, నా జీవితాశా ప్రకాశమా' అంటూ
శాంతినికేతన్‌లాంటి కుటీరంలో విశ్రాంతి
కొంటూ
'రాయప్రోలు' ప్రశాంత పయనంలో
'సురరాయ'ప్రోలు చేరేడా !

అయలసోమయాజుల గోపాలరావు,
విజయనగరం

## వెలుగులప్రోవు రాయప్రోలు

ఏ లోకమేగితో ! ఎందుకాలిడితొ !
వెలుగుల నీవెంటకొని పోకుమయ్యా !
చీకట్లలో క్రమ్మి చిందులాటల క్రుక్కు
కృతక కవిమన్యులకు సుంత
దారిచూపెడి వెలుగు నీ వెంట
కొనిపోకుమా ! నీవు కొనిపోకుమయ్యా !
అలనాటి శ్రీనాథు తుదినుడి వోలె
దివిజ కవిపుంగవుల్ దిగులు గుబాళింప
స్వాగతింతురు నిన్ను సంభ్రమాందోళనల
నీ జాతి గౌరవం బచట వెలార్ప
నింగియే ప్రీదివి వర్షించు భూమిపై
అమృతాంశువుల జల్లులై కురిసి
నీ కవిత నిత్యవాహినియై నిలువ

డా చల్లా రామచంద్రశాస్త్రి,
పిఠాపురం

## " ప్రతిజ్ఞ చేస్తున్నా "

ఓ రాయప్రోలూ !
సాహితీ భవన ప్రాంగణంలో
నువ్వు చల్లిన విత్తులు
మొలకెత్తాయ్ !
ఎన్నో కొమ్మలు, రెమ్మలతో
సాహిత్యాన్ని సృష్టించాయ్ !
నిద్రాణమై వున్న
సాహితీ పుర వీధుల్ని
తట్టి లేపాయ్ !
భూమి భారతిని మాకందించాయ్ !
నీవు వేసిన బాటలో,
నీవు నేర్పిన స్ఫూర్తితో
నవ నవోన్మేషణంగా
సాహిత్య సుందరాంగిని
అలరిస్తాం — అలంకరిస్తాం !

కోలపల్లి ఈశ్వరరావు, నెల్లూరు

ఉత్తరాలు

## సీరియల్స్

''ఉదయసంధ్య'', ''జీవితం మైనస్ సెంటిమెంట్'' సీరియల్స్ చాల బావున్నాయి మంధా వెంకట రమణారావుగారికి, యర్రంశెట్టి శాయిగార్కి నా అభినందనలు ''అద్భుత వ్యక్తులు'' శీర్షిక చాల అద్భుతంగా వున్నది ఇలాంటి శీర్షికలు మీ(మా) ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురించు చున్నందుకు, నా ధన్యవాదాలు

యస్ కాలేషా, అల్‌ఫీహా, కువైట్

## ప్రముఖ వ్యంగ్య చిత్రకారుడు ఊమెన్ మృతి

ఆంధ్ర సచిత్ర వారపత్రిక, ఆంధ్రపత్రిక పాఠకులని దాదాపు మూడు దశాబ్దాలుగా తమ రాజకీయ వ్యంగ్య చిత్రాల ద్వారా అలరించిన సుప్రసిద్ధ వ్యంగ్య చిత్రకారుడు శ్రీ పి జి ఊమెన్ జూలై 18న మదరాసులోని ఆయన నివాసంలో మరణించారు ఆయన వయస్సు 70 సంవత్సరాలు భార్య, కుమార్తె ఉన్నారు

శ్రీ ఊమెన్ కేరళకి చెందిన కాథలిక్ క్రైస్తవుడు ఆయన రాజకీయ వ్యంగ్య చిత్రకారుడిగా ఎన్నో పత్రికలకి పనిచేశారు

రాజకీయాలలో ఎప్పటికప్పుడు ఏర్పడే పరిణామాలని, వాస్తవ విషయ పరిజ్ఞానంతో కూడిన సునిశితమైన సద్విమర్శతో, ప్రతిభావంతంగా తమ కార్టూన్‌లలో ప్రతిబింబింపచేయడంలో ఆయనది అందెవేసిన చెయ్యి

తమ వ్యంగ్య చిత్రాలలో ప్రముఖ రాజకీయవాదుల రూపురేఖా విలాసాలనేకాక వారి అంతర్గత మనోభావాలనికూడా విశ్లేషించి చదువరుల కళ్లకి కట్టినట్లు చిత్రించడం ఆయన ప్రత్యేకత

జాతీయ, అంతర్జాతీయ సంఘటనలని ఆయన తన కార్టూన్‌ల ద్వారా పాఠకులకి కరతలామలకం చేసేవారు

సహృదయుడు, సౌమ్యుడు, స్నేహశీలి అయిన శ్రీ ఊమెన్ మృతి పాఠకలోకానికి తీరని వెలితి


# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938-1972)

శుక్రవారం 10-8-'84
శ్రీ రక్తాక్షినామ సం శ్రావణ శు చతుర్దశి

సంపుటము 76 : సంచిక 48

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు 1-80 |
| ఆరు మాసాల చందా | రు 46-80 |
| పోస్టులో ఏడాది చందా | రు 101-40 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

# శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య కాలధర్మం

ప్రముఖ స్వాతంత్ర్య సమర యోధుడు, అసలైన గాంధేయ వాది, నిస్వార్ధ సేవా పరాయణుడు, రైతు బాంధవుడు, ఆంధ్ర రాజకీయాలలో కురు వృద్ధుడు, నమ్మిన విలువలకు కట్టుబడి ఉన్న పాత కాలపు జాతీయోద్యమ నాయకులలో ఒకరు అయిన శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య (86) జూలై 19వ తేదీన విజయవాడలో కాల ధర్మం చెందారు ఆయన కొంత కాలంగా అస్వస్థులుగా ఉన్నారు

కృష్ణా జిల్లాలోని ఘంటసాల శ్రీ బ్రహ్మయ్యగారి స్వగ్రామం మెట్రిక్యులేషన్ వరకు విద్యనభ్యసించి, పిన్న వయస్సులోనే రాజకీయ రంగ ప్రవేశం చేసారు 1917లోనే శ్రీ బ్రహ్మయ్య గ్రంధాలయోద్యమంలో పాల్గొని వయోజన విద్యా ప్రచారం ప్రారంభించారు దేశోద్ధారక శ్రీ కాశీనాధుని నాగేశ్వర రావు పంతులు, టంగుటూరు ప్రకాశం పంతులు, శ్రీ బులుసు సాంబమూర్తి మొదలయిన వారి సాహచర్యంతో స్వాతంత్ర్యోద్యమంలో అవిరామ కృషి చేసారు క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు ఆంధ్రలో సైమన్ కమిషన్‌ను బహిష్కరించారు బ్రహ్మయ్యగారు ఆలయాలలో హరిజనుల ప్రవేశం కోసం పోరాడారు స్వాతంత్ర్యోద్యమ కాలంలో శ్రీ బ్రహ్మయ్య అయిదున్నర సంవత్సరాల పైగా జైలు శిక్షను అనుభవించారు సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొని మాతృ దేశానికి నిస్వార్ధమైన కృషి చేశారు

శ్రీ గొట్టిపాటి వారు కృష్ణా జిల్లా కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులుగా పని చేశారు ఆంధ్రలో రైతు ఉద్యమానికి నాయకత్వం వహించారు ఆంధ్ర ప్రాంతీయ కాంగ్రెసు కమిటీ ప్రధాన కార్యదర్శిగా పని చేసారు శాసన మండలి సభ్యుడిగా, శాసన మండలి అధ్యక్షుడిగా ఉండి ఆ పదవులకి వన్నె తెచ్చే విధంగా సమర్ధవంతంగా వ్యవహరించారు గ్రామ సమస్యల పట్ల శ్రద్ధ వహించారు అనంతరామన్ కమిటీకి సలహాలిచ్చి గ్రామాధికార్ల సమస్యల పరిష్కారానికి ఎంతగానో తోడ్పడ్డారు

శ్రీ బ్రహ్మయ్యగారికి రాజకీయ రంగంలోనే గాకుండా సాహిత్య రంగంలోకూడా ప్రవేశం ఉంది నా 'జీవన నౌక' (ఆత్మ కధ), 'కాల చక్రం', 'జాతి వెలుగులు' వీరి రచనలు



కూచిపూడిలో 'కూచిపూడి కళాక్షేత్రం వ్యవస్థాపక అధ్యక్షులుగా కూచిపూడి నాట్యాభివృద్ధికి ఆయన ఎంతో దోహదం చేసారు

శ్రీ బ్రహ్మయ్యగారికి 1982లో భారత ప్రభుత్వం పద్మ భూషణ్ ఇచ్చి సత్కరించింది ఆంధ్ర విశ్వ విద్యాలయం నుంచి 1978లో కళాప్రపూర్ణ అందుకున్నారు

శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారి అస్తమయం వల్ల దేశం ఒక నిస్వార్ధ ప్రజాసేవకుడిని పోగొట్టుకున్నది

జూలై 20వ తేదీన ఆయన భౌతిక కాయానికి ప్రభుత్వ లాంఛనాలతో అంత్యక్రియలు జరిగాయి శ్రీ బ్రహ్మయ్యగారి ఏకైక కుమారుడు శ్రీ జి వి రాఘవేంద్రరావు చితికి నిప్పు అంటించారు పలువురు అధికార, అనధికార ప్రముఖులు అంత్యక్రియలకి హాజరై ఆ మహా నాయకునికి జోహార్లు అర్పించారు

## సీరియల్స్

''ఉదయసంధ్య'', ''జీవితం మైనస్ సెంటిమెంట్'' సీరియల్స్ చాల బావున్నాయి మంధా వెంకట రమణారావుగారికి, యర్రంశెట్టి శాయిగార్కి నా అభినందనలు ''అద్భుత వ్యక్తులు'' శీర్షిక చాల అద్భుతంగా వున్నది ఇలాంటి శీర్షికలు మీ(మా) ఆంధ్ర సచిత్ర వార పత్రికలో ప్రచురించుచున్నందుకు, నా ధన్యవాదాలు

యస్ కాలేషా, అల్‌ఫీహా, కువైట్

## కర్మ యోగి

ఆధ్యాత్మిక కెరటాలపై అనంతంగా సాగిపోతున్న ''కర్మయోగి'' గొప్పగా వుంది కృష్ణ తత్వాన్ని బాగా జీర్ణించుకున్న డా కె వి కృష్ణకుమారిగారు ఈ నవలా రచనతో తన జన్మను చరితార్ధం చేసుకున్నారని అనకతప్పదు ఆసక్తితో చదువుతున్న జిజ్ఞాసాపరులైన వారి కెందరికో ఎన్నో తెలియని విషయాల్ని, తెలిసినా సరిగా అర్ధంకాని విషయాల్ని, లలితలలితంగా వివరించి సరైన అవగాహనను కలిగించిన రచయిత్రికి ధన్యవాదాలు కనీసం ఇటువంటి నవలల ద్వారానైనా మరుగున పడుతున్న మన ఆధ్యాత్మికత కాస్త వెలుగు చూడగలదని ఆశించవచ్చా ?!

ఆవుల రమణారెడ్డి, జమ్మలమడుగు

## ఉదయ సంధ్య

''ఉదయసంధ్య'' సీరియల్ చాలా ఆసక్తికరముగఉంది ఇందులో ప్రవేశపెట్టినకొన్నిపేర్లు (ఉ॥ పాలకోడేటి మాష్టారు, ఎర్రా మేష్టారు, హనుమంతరావు హెడ్మాష్టారు, బులుసువారు, ప్లీడరు సీతారామయ్య మొ॥), వారిలో కొందరి మనస్తత్వాల వర్ణన చదువుతూ ఉంటే నా చిన్ననాటి 'జయపురం' నివాసము, అప్పటి అక్కడ వాతావరణము, వారాలబ్బాయిలు ఇవన్నీ కూడా మళ్లీ నా స్మృతిపథంలోకి వచ్చి, ఆ రోజులు జ్ఞప్తికి వచ్చేయి

కె వి కామేశ్వరరావు, కటక్



# విదేశంలో దుబాషీ

# కమ్యూనిస్టు సముద్రంలో ఒక పాశ్చాత్య ద్వీపం

## బెర్లిన్

హిట్లర్ రాజధానిగా ఉన్నప్పుడు ఈ నగరం ఎలాగ ఉండేదో? ఇప్పుడు ఇది ఒక నగరం అనటం కన్నా ఒక ద్వీపం అంటే బాగా ఉంటుందేమో! ఒక కమ్యూనిస్టు సముద్రం మధ్య ఉన్న స్వేచ్ఛా దీపం స్వేచ్ఛా ద్వీపమే కాదు సంపన్న ద్వీపం కూడా ఒక విధంగా చూస్తే బెర్లిన్ ఒక పాత కాలపు బస్తీ లాంటిది తన అందాన్ని కోల్పోతున్న విధవ వనితని తలపింప చేస్తుంది! అయితే జర్మనులు ఈ నగరానికి ఎంతో విలువ కడతారు దీనిమీద ఎంతో శ్రద్ధ చూపిస్తారు అసలు ఒక బెర్లిన్ ఏమిటి రెండు ఉన్నాయి–పశ్చిమ బెర్లిన్ (వాడకంలో పశ్చిమ' అనే మాటని తీసేస్తారు!) తూర్పు బెర్లిన్ వీటి మధ్య ఒక పెద్ద గోడ ఉంటుంది ఇది చాలా వికారమయిన గోడ కమ్యూనిస్టు రాజ్యానికి తగిన గోడ నేను బెర్లిన్ చేరుకోగానే ఈ కుడ్యాన్ని చూడటానికి వెళ్ళాను దగ్గిరే హిట్లర్ కాలంలో కాలిపోయిన పాత 'రెయిక్ స్టాగ్ భవనం ఉంది దీనిని నాజీలే తగలబెట్టారంటారు అంద వికారంలో గోడా కాలిపోయిన భవనం ఒక దానితో ఒకటి పోటీ పడుతూ ఉంటాయి ఈ సందర్భంలో ఒక సంగతి గుర్తు చేసుకోవాలి అదేమిటంటే, ఒకప్పుడు (అంటే హిట్లరు రష్యా మీద దాడి చెయ్యటానికి ముందు) హిట్లరూ, స్టాలినూ ఒక ఒప్పందం చేసుకున్నారు ఫాసిజమూ, కమ్యూనిజమూ ఒక దానికి ఒకటి పోలి ఉంటాయి ఎన్నో విధాలుగా అందుకనే రెయిక్ స్టాగ్, బెర్లిన్ గోడల మధ్య ఈ పోటీ! బెర్లిన్ గోడ ఇవతల సందడిగా ఉంటుంది అవతల అంత సందడిగా ఉండదు అటు వయిపుకి చూసిన నాకు ఒక వింత దృశ్యం కనపడింది బెర్లిన్ గోడ ఒకచోట హిట్లరు బంకర్ '(భూమికింద కట్టిన స్థావరం) మీదుగా వెడుతుంది దానిమీద కొందరు తూర్పు జర్మనీ సెయినికులు తుపాకులు పట్టుకుని కూర్చుని ఉన్నారు ఆ బంకర్‌లోనే హిట్లర్ తన ప్రియురాలయిన ఇవా బ్రవున్‌తో కలిసి ఆత్మహత్య చేసుకున్నాడంటారు రెండు బెర్లిన్‌ల మధ్య ఉన్న ఎవరిదీ కాని స్థలం మీదుగా రైలు మార్గం ఒకటి వెడుతుంది దానిమీద రైలు బండి ఏదీ కనపడలేదు నాకు ఈ చోటు దగ్గిరే నుంచుని జాన్ ఎఫ్ కెన్నెడీ జర్మనీ భాషలో "నేను ఒక బెర్లినీ వాడిని!" అన్నారు ఈ సంఘటన నేడు చరిత్రాత్మకమయిపోయింది అక్కడ ఇంకా కెన్నెడీ బొమ్మలూ వగయిరాలు అమ్ముతూ ఉంటారు

★ ★ ★

బెర్లిన్‌కీ, పశ్చిమ జర్మనీకీ మధ్య సంబంధాలు తెగకోసి ఉన్నట్లు తోచవచ్చు కాని వీటిమధ్య ఎన్నో రైలు బళ్ళు తిరుగుతూ ఉంటాయి బెర్లిన్ నగరంనుంచి రోజుకి 60 విమానం సర్వీసులు వచ్చి వెడుతూ ఉంటాయి నేడు కూడా పశ్చిమ బెర్లిన్ పశ్చిమ జర్మనీలోని పారిశ్రామిక నగరాలలో రెండవదిగా గణించబడుతోంది పశ్చిమ బెర్లిన్‌లోని షాపులనిండుగుతు కనపడుతుంది అవి చాలావరకు బయట ఊళ్ళలో తయారయి వస్తున్నాయని అనుకోవాలి ఈ మహా నగరంలో నిరుద్యోగ సమస్య లేకపోలేదు కాని పక్కనే ఉన్న తూర్పు బెర్లిన్‌నుంచి వచ్చే వాళ్ళమీద ఆంక్షలు లేవనే అనాలి దీనంతటినిబట్టి రెండు బెర్లిన్‌ల మధ్య నా స్నేహ భావాలు కొనసాగుతున్నాయనే అనుకోవాలి జర్మనీ దేశస్థులు తమ దేశం మళ్ళీ ఏకమవుతుందన్న కలలు ఇంకా ఇటూనే ఉన్నారు వారి కలలు ఎప్పటికి (అసలు నిజమయితే) అవుతాయో

★ ★ ★

ఇంతలో పశ్చిమ జర్మనీ తాత్కాలిక రాజధాని బోన్ దెబ్బ తింటోంది అమెరికా సంయుక్త రాష్ట్రాలూ, జపాన్ దేశాల తర్వాత ఎక్కువ సంపన్న మయిన దేశం పశ్చిమ జర్మనీయు "ఇలాంటి దేశానికి బోన్ ఒక రాజధాని నగరమా?" అనిపిస్తుంది ఎవరికయినా ఈ ఊరు జనాభా సుమారుగా 2,40 000 అంతా ఇరుకు అనిపిస్తుంది నేను బెర్లిన్‌నుంచి బోన్‌కి రైలు బండిలో వచ్చాను రాజధాని స్టేషనుని చూసి "ఇదేమి స్టేషను?" అనుకున్నాను అది వారంనాడు బొంబాయి చర్చి గేటు స్టేషనులాగాకనపడింది నాకు బోన్‌లో ఉన్న పశ్చిమ జర్మనీ అధ్యక్షుడు లేదా ఛాన్సలర్ భవనం చాలాసాదాగా కనపడుతుంది మన రాష్ట్రపతి భవనంలాగా గొప్పగా కనిపించదు పశ్చిమ జర్మనీ పార్లమెంటు ఒకప్పుడు ఒక టీచరుల కాలేజి ఈ దేశం రాజధానిలో ప్రభుత్వం అతిథి గృహం ఏదీ లేదుట

★ ★ ★

పశ్చిమ యూరోపులో ప్రభుత్వం వారు వాణిజ్యంలో అంతగా పెత్తనం చెయ్యరు అందుచేత ప్రతి దానికీ ప్రభుత్వం కార్యాలయాలకి పరిగెత్తుకుని వెళ్ళే అవసరం ఈ దేశంలో ఉండదు పశ్చిమ జర్మనీలోని ముఖ్య నగరాలు ఫ్రాంక్‌ఫర్ట్ హాంబర్గ్ డుస్సెల్‌డోర్ఫ్‌లు వాణిజ్యవేత్తలూ వ్యాపారులూ ఎక్కువగా ఈ నగరాలకి వెళ్ళి వస్తూ ఉంటారు ఇక్కడ పరిశ్రమలు పెట్టాలంటే భారతదేశంలోలాగ లైసెన్సులు అక్కరలేదు ప్రభుత్వం వాటినిగురించి అంతగాపట్టించుకోదు పశ్చిమ యూరోపు అంతా ఇలాగే ఉంటుంది బోన్‌లో ఎక్కువగాకనపడేవారు రాజకీయవాదులూ విదేశాల రాయబారికార్యాలయాలవారూనూ

★ ★ ★

పశ్చిమ జర్మనీలో పారిశ్రామిక మాంద్యం ఉంది కాని జర్మనీ దేశంవారు సుసంపన్నులుగానే కనపడుతారు వారి తలసరి ఆదాయం మన (భారతదేశం) తలసరి ఆదాయం కన్నా 50 రెట్లు ఎక్కువ పశ్చిమ జర్మనీలో ఎక్కడ చూసినా ఈ సంపద కళ్ళకి కొట్టినట్లు కనపడుతుంది పశ్చిమ యూరోపు హోటళ్ళలో పొద్దున ఇచ్చే "బ్రెక్‌ఫాస్ట్ చాలా సుష్టుగా ఉంటుంది విందు భోజనాన్ని మించి పోతూ ఉంటుంది పాలూ పళ్ళూ ద్రాక్షలోనుంచి తీసే మాదక పానీయాలూ ఉండితీరవలసిందే! జర్మనీలో పొద్దున భోజనమే రోజుకి ప్రధాన భోజనం అని విన్నాను "అయినా కూడాఇంత తిండా? అనిపిస్తుంది

జర్మనీలో ఎప్పుడూ చలిగాఉంటుంది 60 డిగ్రీల ఫారన్‌హయిట్‌ని దాటదు ఇంత చలిలోనూ వాళ్ళ చురుకుతనాన్నిచూస్తే ఆశ్చర్యం కలుగవచ్చునేమో కాని నిజానికి చలిలోనే చురుకుదనం ఎక్కువగా ఉంటుంది భారతదేశంలో చలి మరింత ఎక్కువగా ఉంటే మన చరిత్రే వేరుగా ఉండేదేమో! వేరుగా ఉండి ఉండవచ్చు కాని భారతదేశం మాత్రంఅయి ఉండేది కాదు

— డా. జయ్‌దుబాషీ.



# ఆంధ్ర సచిత్ర వార పత్రిక

## 1984 దీపావళి కథల పోటీ

## మొత్తం రు.6,600ల బహుమతులు

ఎప్పటిలాగే ఈసారి కూడా దీపావళికి కథానికల పోటీ పెడుతున్నాము.......... పోయినేడాదిలాగే యీసారి కూడా సంపాదకుని ఎన్నికలో ఉత్తమంగా వచ్చిన ఆరు కథలను 'ఆంధ్ర సచిత్ర వార పత్రిక' దీపావళి సంచికలో, ఆ తరువాతి సంచికలలో వేస్తాము. అటు తరువాత పాఠకుల బాలట్ నిర్వహిస్తాము.

## ముగింపు తేదీ:→ 20-8-'84 సోమవారం

పోటీలో ఎన్నికైన ఆరు కథలకు ఒక్కొక్కదానికి రు. 650/- లు చొప్పున బహుమతులు ఇస్తాము. అటు తరువాత బాలట్‌లో ప్రథమ, ద్వితీయ, తృతీయ స్థానాలలో వచ్చిన మూడు కథలకు రు. 700/-, రు. 600/-, రు. 500/- ల వంతున అదనపు బహుమతులు యివ్వడమేగాక మిగిలిన మూడు కథలకు రు. 300/- ల చొప్పున మూడు కన్సొలేషన్ బహుమతులు అందజేస్తాము.

### నిబంధనలు

- 'కథానిక' ఆంధ్ర సచిత్ర వార పత్రికలో నాలుగు పేజీలు మించకుండా ఉండాలి. 12 అరఠావులు దాటకుండా రాస్తే చాలు. సిరాతో లేక బాల్ పెన్‌తో రాయవచ్చు. నిడివి ఎక్కువ అయిన కథలకు బహుమతి రాగల అవకాశాలు చాలా తక్కువ అని గమనించాలి.
- కథావస్తువు తెలుగు వారి సామాజిక జీవితానికి సంబంధించి వుండాలి.
- అనువాదం, అనుసరణ, అనుకరణ, కాపీ కథలు పంపకూడదు. ప్రసారమైన, ప్రచురణ అయిన లేదా ఇతర పత్రికలకు పంపబడి పరిశీలనలో వున్న కథలు అసలే పంపకూడదు.
- పై అంశాల మేరకు హామీ పత్రం ప్రతి కథతోపాటు విధిగా వుండి తీరాలి. కలం పేరు వాడినా అసలు పేరు, యింటి పేరు సహా పూర్తిగా విడిగా స్పష్టంగా పూర్తి చిరునామాతో పాటు అందిన కథలనే పరిశీలించ వీలవుతుంది.
- కథలతోపాటు రచయితల పేర్లు పడవు. బ్యాలట్ తరువాత వారి పరిచయంతోనే వేస్తాము.
- రచనలపై పేచీలు వస్తే రచయితలే బాధ్యత వహించవలసి వుంటుంది.
- పోటీలో నెగ్గిన కథల రచయితలు తమ ఫొటో, జీవిత విశేషాలు మొదలైన వాటిని పంపి వాటి ప్రచురణకు అంగీకరించాలి.
- ముగింపు తేదీ దాటిన తరువాత అందిన కథలను మామూలు ప్రచురణకు వీలు వెంబడి పరిశీలిస్తాము. పోటీకి పంపిన కథలను ఎట్టి పరిస్థితులలోను త్రిప్పి పంపలేము. కాబట్టి రచనలతోపాటు స్వంత చిరునామా కల స్టాంపులు అతికించిన కవరు పంపనవసరం లేదు.

—సం॥

Kasi..

# వారఫలం

## 10-8-1984 శుక్రవారం మొదలు 16-8-1984 గురువారం వరకు

★ **మేషం**. ఇటీవల ఎంత ప్రయత్నించినా నెరవేరని ఒకానొక కార్యం వారాంతంలో సులువుగా నెరవేరుతుంది అనవసరంగాప్రత్యర్థులతో తగాదా తంటాలుండగలవు పరాయి వారి పనులు పైన వేసుకొని యిబ్బంది పడరాదు స్త్రీలకు నూతనాంశాలు గ్రహిస్తారు వృత్తియందు పెంపు చేకూరుతుంది

★ **వృషభం**: ఆదాయమున్నది అవసరాలు సుగమంగా తీరిపోతాయి వృత్తి ఆశాజనకంగా ఉంటుంది రాజకీయ రంగాన సదవకాశం లభిస్తుంది వ్యాపారం లాబదాయకం కావటంలో ఆక్షేపణ లేదు స్త్రీలకు చాల మందికి వృత్తియందు పెంపు నూతనోత్సాహతకు అవకాశం ఏర్పడనున్న వారం

★ **మిధునం**· రాజకీయ వాదులకు ఉత్సాహ జనకమైన వారం చాల కాలంగా ఒక దారికి రాని వ్యవహారాలు సుకరంగా నెరవేరుతాయి ఇల్లు కొనుగోలు చేయగలరు నూతనాంశాలు గ్రహింపగలుగుతారు స్త్రీలకు ఉద్యోగ వృత్తులందు మీకు అదిక సంతోషదాయకమైన పరిస్థితి ఏర్పడుతుంది గ్రహించి శ్రమించండి

★ **కర్కాటకం**. సులభంగా ఒకానొక వ్యవహారం పరిష్కరింపబడుతుంది కుటుంబానందం ఏర్పడనున్నది వ్యాపారం యధాతధం ఆరోగ్యం విషయంలో జాగ్రత్తగా ఉండాలి వయసు మీరిన వారు మరీ జాగ్రత్త పడాలి జాయింటు' వ్యాపారమయితే అధిక లాబదాయకం స్త్రీలకు వస్తు సేకరణకు, వ్యవహార పరిష్కారానికి, ఆదాయాభివృద్ధికి అవకాశం గల వారం

★ **సింహం**: నూతనాంశాలు గ్రహిస్తారు నూతన మిత్ర సంపర్కం ఏర్పడుతుంది కుటుంబానందానికి లోటు లేదు ప్రచారంగంలో ప్రసిద్ధి ఏర్పడుతుంది సుఖ శాంతులకు అవకాశం గల వారం స్త్రీలకు నూతనోద్యోగాలు ఫలవంతం కాగలవు

★ **కన్య**: ఆరోగ్య విషయంలో హెచ్చరిక, వాహనం కొనుగోలు చేయట చాల మంది విషయంలో చెప్ప వచ్చు రాజకీయ రంగానుభవం గల వారికి మేలున్నది స్త్రీలకు చాలా కాలంగా అందని ఇంక్రిమెంటు ఈ వారం అందగలదు కుటుంబానందానికి కొరత ఏర్పడదు గ్రహించాలి

★ **తుల**. పరాజయమన్నది ఎరుగని మీకు అపజయం ఏర్పడుట నిశ్చయం ఆదాయం అంతంత మాత్రమే ఉత్సాహ జనకంగా మెలగాలనుకున్నా ప్రశాంతత చిక్కదు రాజకీయంగా నిరుత్సాహత ఏర్పడుతుంది స్త్రీలకు ఆశించినట్లు కళాశాల ప్రవేశం ఆదాయం వృత్తియందభివృద్ధి

★ **వృశ్చికం**: రాజకీయరంగానుబవం గల వారికి శుబ దినాలు ఆరోగ్య లోపం ఉన్న వారికి క్రమాభివృద్ధి కనిపిస్తుంది వ్యాపార వ్యవహారాలు విజయవంతంగా సాగిపోతాయి స్త్రీలకు నూతనాంశాలు గ్రహించుటకు నూతన మిత్ర సంపర్కానికి అవకాశం గల వారం

★ **ధనుస్సు**: అధికాదాయం ఆశింపవచ్చు కొందరకు అప్రయత్నాదాయం లబింపవచ్చు కొందరకు ఉద్యోగ రీత్యా చేసే ప్రయత్నాలు ఫలవంతం కావటంలో ఆక్షేపణ లేదు స్త్రీలకు అనవసరంగా తగాదా తంటాలుండగలవు ప్రశాంతి లోపింపవచ్చు గ్రహించి మెలగాలి

★ **మకరం**: శని గ్రహ సహాయం అంగారక గ్రహ సహాయం ఆశింపవచ్చు వృత్తియందు పెంపు కనిపిస్తుంది వ్యాపారంలో నూత్నోత్సాహం లబ్యం కాగలదు యత్న కార్య సిద్ధి రాజకీయ రంగాన ప్రసిద్ధి ఏర్పడుతుంది స్త్రీలకు నాలుగు విధాలా ఉత్సాహజనకమైన వారం

★ **కుంభం**: రాజకీయ రంగాన అబివృద్ధి, ఆశించిన విధంగా పదవి లభ్యం కాగలదు ఎలాగో డబ్బు సేకరించుకొని యిల్లు గాని, భూమి గాని కొనుగోలు చేయగల్గుట కొందరి విషయంలో చెప్పదగిన ముఖ్యాంశం స్త్రీలకు కుటుంబానందం, కించిత్తు ఆదాయం గల వారం

★ **మీనం**: అనవసరంగా యితరులతో ఘర్షణ గాని పేచీలు గాని రాగల అవకాశాలున్నాయి ఇరుగు పొరుగు వారితో జాగ్రత్తగా సంచరించదగిన వారం అధిక లాభార్జన ఉన్నా అత్యధికంగా వ్యయం కూడా చెప్ప దగిన సమయం స్త్రీలకు ఆనందం ఆదాయం వృత్తియందు పెంపు, శుభ కార్యాలో చనలకు అవకాశం గల వారం

—విద్వాన్ కోట సత్య రంగయ్య శాస్త్రి

# వ్యక్తిగతం



జులై 5వ తేదీన 255 మంది ప్రయాణీకుతో శ్రీనగర్ నించి కొత్త డిల్లీ వస్తున్న ఇండియన్ ఎయిర్ లైన్స్ విమానాన్ని దారి మళ్లించి లాహోర్ తీసుకు వెళ్లి ప్రయాణీకులని, సిబ్బందిని, దాదాపు 20 గంటలపాటు నిర్బందించి చివరికి తమంతట తామే లొంగిపోయిన తొమ్మిది మంది సిక్కు హైజాకర్లలో 8 మందిని చిత్రంలో చూడవచ్చు (ఫోటో పాకిస్తాన్ టైమ్స్ నించి)

# శ్రీ బుగ్గ రామలింగేశ్వరస్వామి ఆలయం



బుగ్గ రామలింగేశ్వరస్వామి ఆలయ ముఖద్వారంపైగల ఏకశిలా శిల్పాలు

"రాయలేలుసీమ రతనాల సీమ" అనేది జగద్విఖ్యాత నానుడి అయితే, ఆరతనాల సీమలో నేడు రతనాలు దొరికినా, దొరకకున్నా రతనాలవంటి శిల్పకళా చాతుర్యము, సుందర ప్రకృతీదృశ్యాల నడుమ దేవాలయాలు, ఏ మూలకు వెళ్లినా కన్నులపండుగ చేస్తాయి రాయలసీమలో చాలా సీమ రాళ్ళసీమేమైనా, నాటి రోజుల్లో ఏ మాత్రం నిరుత్సాహపడకుండా, వాటినే సుందర శిల్పాలుగా మలిచి, తమ కళాతృష్ణను "నభూతో న భవిష్యత్"గా, చిరస్మరణీయంగా సువర్ణాక్షరాలలో లిఖించుకున్న మన పూర్వులు, శ్రీకృష్ణదేవరాయులు ధన్యజీవులు

రాయలసీమలోగల పెక్కు రమణీయ దృశ్యాలలో, అనంతపురంజిల్లాలోని తాడిపత్రి గ్రామంలోగల శ్రీ బుగ్గ రామలింగేశ్వరస్వామి ఆలయము, శ్రీ చింతల రాయలు ఆలయములు కూడా తప్పకుండా చోటు చేసుకుంటాయి

నేటి విజ్ఞానశాస్త్రానికి సవాలుగా, దైవత్వానికి ప్రేరణగా నిలిచిన బుగ్గ రామలింగేశ్వరస్వామి ఆలయం సుందర ప్రకృతీ దృశ్యాల నడుమ, నీలాద్రిగుట్టపై పెన్నానది ఒడ్డున నిర్మించబడినది సుమారు ఏభై అడుగుల ఎత్తున్న మూడు ప్రవేశద్వారములతో, ఎత్తయిన ప్రాకారములతో విశాలమైన ఆవరణములో నిర్మింపబడిన ఈ ఆలయంలో బుగ్గ రామలింగేశ్వర [illegible] నవగ్రహ ములు, ఏకశిలా స్తంభాలుతో నిర్మింపబడిన కళ్యాణ మంటపములు నెలకొల్పబడినవి ఆలయ ముఖద్వారములు, ప్రాకారములు, గుడివెలుపల, కళ్యాణ మంటపంపైగల సుందర శిల్పాలు, మన పూర్వీకుల శిల్పకళా చాతుర్యము, వారి ప్రతిభను ప్రతిబింబిస్తాయి సుమారు ముప్పై, ఇరవై అడుగుల ఏకశిలలుపై చెక్కిన నిలువెత్తు శిల్పములు, ఎత్తయిన ముఖద్వారములు మీదకు అంతటి బరువైన శిలలనుచేర్చి వాటిని శిల్పాలుగా మలిచిన తీరు అద్భుతమైన మన పూర్వీకుల ప్రతిభకు నిదర్శనం

ఇకపోతే, దైవమహిమకు నిదర్శనంగా నిలుస్తుంది శ్రీ బుగ్గ రామలింగేశ్వరస్వామి లింగాకృతి "బుగ్గ" అంటే నీటి గుంట అని అర్థం 'స్వామివారి పాదముల చెంతనే నా బ్రతుకు, నా జీవిత పరమార్థం' అంటూ గంగాదేవి ఉబికి వస్తున్నదా అన్నట్లు లింగాకృతి పానవట్టం దగ్గర ఎప్పుడూ నీరు ఊరుతునే వుంటుంది పూజారులు ఎప్పటికప్పుడు నీటిని తీసివేసినా, మళ్లీ క్షణంలో నీరు ఊరుతుంది ఆ నీటినే తీర్థంగా భక్తులకు ఇస్తారు లింగం దగ్గర ఎప్పుడూ నీరు ఉద్భవిస్తుంటుంది కనుక, ఆ స్వామికి బుగ్గ రామలింగేశ్వరస్వామి అని పేరు వచ్చింది

పోతరాజు కుమారుడు శ్రీ ఎల్లమ్మరాజుచే, శ్రీకృష్ణదేవరాయలు సారథ్యంలో నిర్మింపబడిన ఈ ఆలయంలోగల శిల్పకళకు శ్రీ చిన వీరయ్య, పెద్ద వీరయ్య, రామలింగాచారి అనే శిల్పులు శ్రమించేరని, అక్కడగల శిలా ఫలకాలు వెల్లడి చేస్తున్నాయి మహమ్మదీయుల దండయాత్ర

చింతరాయలు ఆలయంపైగల శిల్పకళ



వల్ల కొంత నాశనం జరిగిన, ఇప్పటికీ శిల్పకళా ప్రతిభ చెక్కుచెదరకుండా రమ్యముగానే కన్పిస్తోంది

తర్వాత, ప్రక్కనే కిలో మీటరు దూరంలో, నగరం మధ్యనున్న చింతల రాయలు వారి ఆలయం కూడా, ఈ ఆలయానికి ఏ మాత్రం తీసిపోదు ఇక్కడి శిల్పకళకూడా, పై బుగ్గన ప్రతిభే ఎల్లమరాజుకు శ్రీ వెంకటేశ్వరస్వామి కలలో కన్పించి 'చింతచెట్టు తొర్రలో నెలిసిన తనకు ఆలయమేర్పరచమని' శాసింపగా, మరునాడు రాజు నిజంగా చింతచెట్టు తొర్రలో విగ్రహం కనుగొని, కృష్ణదేవరాయలు ఆశీస్సులతో ఆలయ నిర్మాణం గావించెనని ఇక్కడి పెద్దలు చెప్తారు శ్రీశైలం, మహానంది, మంత్రాలయం,

బుగ్గ రామలింగేశ్వరస్వామి ఆలయంలో గల ఏకశిలా స్తంభాల కళ్యాణ మంటపం



పుట్టపర్తి చూడవచ్చిన భక్తులు, కళాహృదయులు, దగ్గరలోనేవున్న ఈ ఆలయాలనుకూడా దర్శించగలిగితే, వీరి కళాహృదయాలకు మంచి ఆహ్లాదం కలుగుతుందంటే, అతిశయోక్తి కాదేమో

ఏటా శివరాత్రికి జరిగే ఏడు రోజుల ఉత్సవానికి, లక్షల సంఖ్యలో భక్తులు వచ్చి దర్శనం చేసుకుంటారు కార్తీక మాసంలో ఈ దేవాలయం కలకలలాడుతూ వుంటుంది శివరాత్రి ఉత్సవాలకు జరిగే ఎడ్లపందేలుకూడా ప్రత్యేక ఆకర్షణే

— నిడమర్తి ఆదిలక్ష్మీ ప్రసాద్

## కొత్త సీరియల్ ప్రారంభం!

# దాగుడుమూతలు

### కప్పగంతుల మల్లికార్జునరావు

**అది వేసవికాలం. అయినా ఆకాశంలో మబ్బులు పట్టాయి. చల్లగాలి వీస్తోంది.**

**పంట కాలవలూ, కొబ్బరిచెట్లూ ఆభరణాలుగా గల సంపన్న గ్రామం అది. ఆ గ్రామానికి మధ్యగా గల రామాలయంలో ధ్వజస్తంభంపై చిరుగంటలు గాలికి మెల్లగా వూగుతూ మధుర నాదాన్ని విన్పిస్తున్నాయి.**

**'చల్లటి మనిషి జనార్ధనం బాబుగారు. వారింట్లో పెళ్లనేసరికి వాతావరణమూ చల్లబడింది' గర్భగుడి నుంచి బయటకొచ్చి ఆకాశంవైపు చూచి అనుకొన్నాడు ఆలయ పూజారి నారాయణాచార్యులు.**

ఇంతలో మంగళ వాద్యాలు విన్పించాయి.

'మంగళ స్నానాలకు కూర్చుంటున్నట్లుంది స్నానాలయ్యేసరికి ప్రసాదం తీసికెళ్లి యివ్వాలి' అనుకొని గర్భగుళ్లోకి వెళ్లేడు ఆచార్లవారు మళ్లీ.

నిన్నటివరకు వేడిగా వున్న వాతావరణం పెళ్లి వాళ్లు వచ్చేసరికి చల్లబడి ప్రకృతి ప్రశాంతంగా ఆహ్లాదకరంగా వున్న మాట నిజమే

కానీ ఆ ప్రశాంతతే జనార్ధనంగారికి భయహేతువయింది.

'హొరేయ్ సూరన్నా, చినుకులు పడవుకదా ?'' ఆకాశం వంక చూస్తూ ఆయన అలా అనటం యిది ఆరోసారి

ఆయన కూతురు పెళ్లికి విస్తృతమైన ఏర్పాట్లు చేసేడు ఇంత చేస్తే వర్షం వచ్చి అంతా అభాసుపాలవుతుందేమోనని ఆయన భయం అయినా పిలవని పేరంటంగా వేసవికాలంలో వర్షాలేమిటి ?

'ఏమో బాబయ్యా చెప్పలేం అయినా నాలుగు జల్లులు పడ్డేమాత్తరం ముంచుకుపోయిందేటుంది ? పందిళ్లు దిట్టంగానే ఏసేం గదా ?'

పందిర్లు కురవవు వసతికి లోపం వుండదు పెళ్లి జరిగిపోతుంది పెళ్లివారికి, పెళ్లికి వచ్చినవారికి ఏ లోపం జరుగదు ఆ ఏర్పాట్లన్నీ తను చేసేడు అదికాదాయన భయం.

అసలు ఆ కాలంలో ప్రకృతి ధర్మానికి విరుద్ధంగా యీ వాన ఏమిటి ? మబ్బులేమిటి ? యిలా ఎందుకు జరుగుతోంది ?

తను ఎన్ని ఏర్పాట్లు చేసినా యీ వర్షంవల్ల పెళ్లివేళకి వద్దామనుకొన్న కొందరు రాలేకపోవచ్చుగా ?

'అన్నయ్యా నువ్వేం దిగులుపడకు చిన్న విషయానికి వూరికే వర్రీ అవుతావేం ? వర్షం కురవదు నేను చెప్తున్నాగా ?'

'నువ్వు అంత ఖచ్చితంగా ఎలా చెప్పగలవురా ?' తమ్ముడివైపు చూస్తూ ప్రశ్నించాడు జనార్ధనం. అతని తమ్ముడిపేరు సోమసుందరం

'నేను యిప్పుడే రేడియో వినివస్తున్నానన్నయ్యా మన ప్రాంతంలో విస్తృతంగా వర్షం కురుస్తుందన్నారు రేడియోవాళ్లు అలా చెప్పేరంటే యిక కురిసే వర్షంకూడా వెనక్కి పోతుంది చస్తే కురవదు నేను హామీపత్రం రాసిస్తాను '

సోమసుందరం జోక్కి నవ్వలేదు జనార్ధనం

'వదిన నిన్ను పిలుస్తున్నదన్నయ్యా విడిది యింటినుంచి మళ్ళీ ఏదో మెసేజ్ వచ్చినట్లుంది '

జనార్ధనం తమ్ముడితో లోపలికెళ్లేడు

'ఏమండీ. వియ్యపురాలిగారికి యీ పట్టుచీరెలు నచ్చలేదుటండీ వాళ్ళు అసలు సిసలు కంచి పట్టుచీరెలు తప్ప మరోటి కట్టరుట అసు ముట్టనే ముట్టరట యిదిగో యీ పదిహేను చీరెల్ని మార్పించి తెమ్మని కబురుచేసేరు '

జనార్ధనం భార్యవైపు అదోవిధంగా చూచాడు

'క్షమించండి మీరు చెప్పిన మాట నేను అప్పుడే విన్నట్లయితే యిప్పుడు యీ చిక్కు వచ్చివుండేదికాదు నేను వాళ్లు మరీ యింత పేచీకోరు మనుష్యులనుకోలేదు' అందామె తల వంచుకొని

ఆ చీరెల సెలక్షన్ జనార్ధనం భార్య లలితాంబదే

'సోమసుందరం, నువ్వు నీ భార్యను తీసుకొని విడిదింటికి వెళ



వియ్యపురాలినో, మరెవరినో తీసుకొని కారులో టౌన్‌వెళ్లి వాళ్లకు నచ్చిన చీరెలు కొనుక్కొని వో గంటలో రా '

'అమ్మబాబోయ్ చీరెల సెలక్షనే నాకు భయంబాబూ !'

జనార్దనం తమ్ముడివైపు వొక్క చూపు చూశాడు

'సరే అన్నయ్యా అలాగే వెళ్లొస్తాను '

సోమసుందరం మెల్లగా అని పిల్లిలా జారుకొన్నాడు

'బావగారూ పెళ్లికొడుకు స్నేహితుల్నించి మళ్లీ చీటీ వచ్చింది' అన్నాడు జనార్దనం బావమర్ది రఘురావ్ హడావుడిగా వచ్చి-

రఘురావ్ పెళ్లివాళ్లలో మగవారి ఆతిధ్యానికి ఇన్‌ఛార్జ్

బావమర్ది అందించిన కాగితం విప్పి చదువుకొన్నాడు జనార్దనం

విడిది- కేంప్ నెంబరు- ట,

మెమో నెంబరు 9

పెళ్లికొడుకు మిత్ర బృందం.

అయ్యా పెళ్లికూతురు తండ్రిగారూ,

మీరు ఏర్పాటు చేసిన కాఫీ టిఫిన్ల క్వాలిటీ బాగానే వున్నదని చెప్పటకు సంతసించుచున్నాము. కాని వెరైటీని, ఫ్రీక్వెన్సీని మీరు మెయిన్‌టెయిన్ చెయ్యటం అవసరం కాదా ? మే మిక్కడ పెళ్లికొడుకు శ్రేయస్సు కోసం, పెళ్లికూతురు సౌభాగ్యం కోసం, చతుర్ముఖులమై పారాయణం చేస్తున్నాము గంట గంటకూ అవసర నైవేద్యం పడ్తుంటే కాని ఘూత శాంతి జరుగదు. యిప్పటికి అవసర నైవేదం అంది గంటన్నర అయింది ! పారాయణం మీద ఏకాగ్రత చెడులోంది. ఇడ్లీ- వుప్మా, గారె- బూంది- ఇలా ఇంతవరకు ఐటెమ్స్‌ను మార్చేరు కానీ యీసారి అవసర నైవేద్యంగా యిక్కడికి నేతితో చేసిన పెసరట్లు సేమ్యా వుప్మాతో- పంపటం అవసరం. అలాగే యీసారి కాఫీ బదులు ఏమన్నా కూల్‌డ్రింక్స్- అందుతోపాటు నాలుగు కింగ్‌సైజ్ గోల్డ్ ఫ్లాక్ పెట్టెలు రెండు

# శ్రావణ లక్ష్మి

నయనంబుల చంద్రజ్యోత్స్న మెఱయగా
దరహాసంబుల మేలిముత్తెములు దొరలగా
లలాట తిలకంబున రవికాంతులు విరియగా
గమనంబున రీవిగ రాయంచలు కదలగా
అలినీలాల తురిమిన విరిసరము నుండి కాఱుసుమంబులు
కారుజలదంబుపై వరుణానుగ్రహంబై భాసింప
ఇలా తలంబుపై ఘల్లుఘల్లున అడుగిడె నదిగో శ్రావణలక్ష్మి
ఇల ఇంతులకెల్ల శుభంబు లీయగా

**— ఇసుకపల్లి సుజాత**

# దాగుడు మూతలు

చదవటం ఆపి చిరాగ్గా బావమర్దివైపు చూచాడు జనార్దనం

'దీనికి నా దగ్గరకు రావటం దేనికి ? వాళ్ళు అడిగింది ఏర్పాటు చేయమన్నాను గదా ?' అన్నాడు కించిత్తు చిరాకుతో

'యిది గొమ్మిదో చీటీ బావగారూ వాళ్ళు అడిగింది అడగగానే సప్లై చేస్తే ముందు ముందు యింకా ఎలాంటివి అడుగుతారోనని భయంగా వుంది బావగారూ ఆకతాయి పనులకు కూడా హద్దూ పద్దూ వుండాలిగా ? గొంతెమ్మ కోరికలు కోరుతుంటే ఎలా ?'

'రఘూ వాళ్ళ అవన్నీ వాళ్ళకి లేక యిక్కడికి రాలేదు వాళ్ళిక్కడ వుండేది వొక్క రోజు ఆ వొక్క రోజు వాళ్ళ సర్దాలు తీర్చితే మనకు రాబోయే నష్టం ఏమీ లేదు. యిందులో మనం తక్కువయినట్లు బాధ పడాల్సిందేమీ లేదు దిస్ యీజ్ ఎ గేమ్ లెట్ అజ్ ప్లేయిట్ సక్సెస్‌ఫుల్లీ '

'అయ్యా మీరింక మంగళ స్నానాలకి పీటల మీద కూర్చోవాలి' అన్నాడు పురోహితుడు ఆయన వద్దకొచ్చి

'అలాగే, వస్తున్నాను—పదండి'

జనార్దనం అక్కడినుంచి కదలబోతుంటే వాకిట్లో నుంచి ఎవరో కుర్రవాడు పరుగెత్తుకొంటూ వచ్చాడు

'మామయ్యా మామయ్యా, సన్నగా జల్లు పడ్తోంది మీ వూరు యిప్పుడు అచ్చం వూటీలాగా వుందనుకో'

మంగళ వాద్యాలు వుచ్చస్వరంతో విన్పిస్తూనే వున్నాయి !

* * *

'పెళ్లి కొడుకును పిల్చుకు రమ్మని పంపిస్తే యీ ఏబ్రాసి వెధవ అలాగే పత్తాలేకుండా పోయాడు చూశారా ?'

పేపరు చదువుకొంటూన్న పెళ్లికొడుకు తండ్రి పరబ్రహ్మ మూర్తి భార్య గొంతు వినగానే రప్పున పేపరు ముడిచేసి ఎటెంటిక్ అయ్యాడు భార్య గొంతు అతనికి మిలటరీ కమేండ్ లాంటిది

'ఏబ్రాసి వెధవ ! అంటే ఎవడు? నేనిక్కడే వున్నానుగా ?'

'మీరో బుద్ధావతారం మీ సంగతి కాదు నేను చెప్తూన్నది మీ 'మే'నల్లుడు—వెంకన్న బాబుగాడు స్నేహితులో వాళ్ల విడిదిలో వున్న రమేశ్‌ను పిల్చుకు రమ్మని యిప్పటికి ఆ వెధవను మూడుసార్లు పంపేను రెండుసార్లు వొట్టి చేతులో వచ్చాడు మూడోసారి— పోయి అరగంట అయింది యీసారి అయిపు లేడింకా అవతల మంగళ స్నానాలకు కూర్చోవాలి స్నాతక వ్రతం చేసుకోవాలి యిప్పటికి మన జనం టిఫిన్‌లు పూర్తయ్యాయి పట్టు చీరెలు పెడ్తామని కోతలు కోసేడా ఆ పెద్దమనిషి? ఎలాంటి పట్టు చీరెలు కొన్నాడో చూచారుగా? మాకు అసలు సిసలు కంచివి పెడ్తే తప్ప ముట్టమని కబురు చేసేను అన్నిటికీ— మగవనీ ఆడవనీ—అన్నీ వొక్కదాన్ని యీదుకురాలేక చస్తున్నా మీకేమో ఏమీ పట్టవు అయితే చుట్ట—కాకపోతే పేపరు అస్తమానం ఆ పేపర్లో ఏం వుంటాయేటో? కాస్త ఆ రెండో విడిదిదాకా వెళ్ళి అబ్బాయిని కేకేసుకు రాకూడదూ?'

కాళికాంబ స్వభావమే అంత కాస్తంత వుంటే గంపంతచేస్తుంది తను హైరానపడి యితరులని హైరాన పెడ్తుంది

ఆమెకు అతిశయం జాస్తి తన్నంతా గొప్పది అని అనుకోవాలన్న దుగ్ధ జాస్తి

ఆమె అతిశయం, హడావుడి, గంద్రగోళం చూచిన వారికి ఆమె గయ్యాళిగంపలా కన్పిస్తుంది కానీ నిజానికి ఆమె మనసు మంచిది కుత్సితం లేదు అల్ప సంతోషి కాస్తంత పొగిడితే గంపంత గుండె చేసుకొంటుంది

కానీ పరబ్రహ్మమూర్తి అందుకు పూర్తిగా విరుద్ధం

మనిషిని చూస్తే అతి సౌమ్యుడిగా— అమాయకుడిలా కన్పిస్తాడు కానీ కడుపునిండా ఆలోచనలే బుర్ర నిండా ప్రణాళికలే నవ్వుతూనే గొంతులు కోసేయగల సామర్ధ్యం కలవాడు ఏ గాలికి ఆ పాట పాడుతాడు చాప క్రింద నీరులా యితరులని ముంచేయగలడు

యీ లక్షణాలన్నీ వుండబట్టే ఆయన దశనందుడై మాట్లాడుతూ, సహస్రబాహువై సంపాదించాడు మంచివాడని, సాత్వికుడనీ పేరు పొందేడు కూడా

రమేశ్ ఆయన వొక్కగానొక్క కొడుకు కాదు పెద్ద కొడుకు ఆయనకింకా పిల్లలున్నారు.

జనార్ధనంగారు రమేశ్‌కు తన కూతుర్నిస్తానంటూ రావటం ఆయనకు ఆశ్చర్యాన్ని కలిగించింది— మొదట్లో

జనార్దనంగారిది మంచి పేరు ప్రఖ్యాతులున్న కుటుంబం మంచి స్థితిమంతులు — వొకప్పుడు యిప్పుడేదో కాస్త వారి పరిస్థితి చితికి పోయిందని చెప్పకొంటారు కాని ఎంత శుష్కించినా ఏనుగు ఏనుగేగా ? పైగా జనార్దనంగారు చేతికి ఎముకలేని మనిషి !

అమాయకత్వం నటిస్తూనే కట్నకానుకల బేరసారాలు చేసేడు అంతా భార్య యిష్టమని అంటూనే తననుకొన్నవన్నీ జనార్దనంగారి చేత అవుననిపించుకొన్నాడు

ముట్టాల్సిన డబ్బంతా ముందే రాబట్టుకొన్నాడు పెట్టుపోతల విషయంలో జనార్ధనంగారేం లోటు చెయ్యరని నమ్మకమే ! వొకవేళ చేసినా అలాంటి విషయాలు చూచుకోటానికి భార్య వుండనే వుందాయె ! పైనుంచి అంతా కనిపెడ్తూ అవసరమయితే 'కీ' యివ్వటమే తన పని

అంచేత పరబ్రహ్మమూర్తి నిశ్చలంగా పేపరు చదువుకొంటూ కూర్చోక చేసేదేముంది ?

'అయితే నన్ను వెళ్లి అబ్బాయిని పిల్చుకురమ్మంటావ్? అంతేనా? అలాగే వెళ్తాను కానీ యిదేమిటి? పెళ్లివారి వూళ్లోకి వచ్చి, విడిదింట్లో కూడా నీకు పనులు పురమాయించటానికి నేను తప్ప మరొకరు దొరకలేదా ? ఎంత అప్రదిష్ట నీకు ? జనార్దనంగారు విడిది గృహాల వద్ద ప్రత్యేకంగా తన మనుష్యుల్ని మన పనులు చేసిపెట్టటానికి పురమాయిస్తే మన్నారే ? ''

''పురమాయించారు. ఆయన తప్పేంలేదు ఎన్ని పనులు నాకు ? కనుక నేను వారికి తలా వక పని పురమాయించి పంపేను యీ పని ఏమంత పెద్దది ? పదిళ్ల అవతల వున్న రమేశ్‌ను పిల్చుకు రావటమే కదా? అందుకని ఆ ఏబ్రాసి వెధవను ఆ పనికి పురమాయించాను ''

ఏబ్రాసి వెధవని ఆమె ముద్దుగా పిలిచే వెంకన్నబాబు పదేళ్ల కుర్రవాడు మూగవాడు ఎనిమిదేళ్ల క్రితం— అతను రెండేళ్ల బిడ్డగా

# సంపూర్ణ పోషకాహారంలో అన్ని పోషక పదార్థాలు సరియైన పాళ్లలో వుండాలి...



ప్రొటీనులు
పెరుగుదలకి ముఖ్యం
పిండి పదార్థాలు మరియు క్రొవ్వు పదార్థాలు
శక్తికి
విటమిన్ ఎ
కళ్ళలో కాంతులకి
విటమిన్‌లు బి గ్రూప్
అన్ని ఇతర పోషక పదార్థాలని జీర్ణించుకోడానికి
విటమిన్ సి
రోగ నిరోధక శక్తి పెంపొందించడానికి
విటమిన్ డి
కాల్షియం మరియు ఫాస్పరస్‌లని గ్రహించేటట్లు చేయడానికి
ఐరన్
ఆరోగ్యవంతమైన రక్తానికి
కాల్షియమ్ మరియు ఫాస్పరస్
దృఢమైన ఎముకలు మరియు పండ్ల కోసం

# సిరిలాక్ సంపూర్ణ పోషకాహారాన్ని రుచికరమైన విధంగా అందజేస్తుంది

సిరిలాక్‌లో అయిదు రకాల పోషకాలు అన్నీ వున్నాయి—ప్రోటీన్లు, క్రొవ్వు పదార్థాలు, పిండి పదార్థాలు, ఖనిజాలు మరియు విటమిన్లు మీ పాపకి ప్రతి పర్యాయమూ సిరిలాక్‌తో తయారు చేసిన ఆహారం మీరు యిచ్చినప్పుడు ఈ పోషకాలన్నీ సరియైన పాళ్ళలో చేరి వుంటాయి.




కలసికట్టుగా పని చేయడం వలన ఈ పోషకాలన్నీ హెచ్చు తగ్గులు లేకుండా ముఖ్యమైనవే. అందుకే అన్ని పోషకాలు 'సంపూర్ణం'గా వున్న సిరియల్ ఆహారం మీ పాప ఆరోగ్యానికి అత్యవసరం. ప్రతి సిరిలాక్ ఆహారం మీ పాపకి ఒక రోజుకి కావలసిన పోషక పదార్థాలలో నాల్గవ వంతుని అందచేస్తుంది. ఈ ఆహారం యిస్తున్నప్పుడు పోషక పదార్థాల కోసం మరొకటి మీరు యివ్వవలసిన అవసరం లేదు.

మీ పాపకి చనుపాలే తగినవి. అయితే పాపకి నాలుగు నెలలు వచ్చి ఘన పదార్థాలు తినుకోడానికి సిద్ధంగా వున్నప్పుడు, మీ డాక్టర్‌ని సంప్రదించి సిరిలాక్ యివ్వడం ప్రారంభించండి.

## సిరిలాక్®
పాలు వుండనే వున్నాయి



సిరిలాక్ తయారు చేయడం ఎంతో సులభం. దీనిని ముందుగా మరగ బెట్టిన, గోరు వెచ్చటి నీటికి చేర్చండి కలపండి. వడ్డించండి

**ఉచితం!** సిరిలాక్ పిల్లల పెరుగుదల చార్ట్
ఇందులో బరువు చార్టు, రోగనిరోధక మందుల రికార్డు, గట్టిగా ఉండే ఆహారం అలవాటు చేసేందుకు సూచనలు, యింకా ఎన్నో విషయాలు ఉంటాయి
మీ కాపీ కోసం ఈ చిరునామాకు వ్రాయండి
సిరిలాక్
పోస్ట్ బాక్స్ నం 3 న్యూ ఢిల్లీ-110 008

SAA/FSL/C/3151 TEL

NESTLÉ.

# దాగుడు మూతలు

న్నప్పుడు—అతడి తలిదండ్రులు మొక్కు తీర్చుకోటానికి తిరుపతికి బయలుదేరేరు బస్సులో. దిగువ తిరుపతి నుంచి కొండమీదికి వెళ్తున్న బస్సు బోల్తా కొట్టింది. అతడి తలిదండ్రు లిద్దరూ చచ్చిపోయారు. రెండేళ్ళ వెంకన్నబాబు మాత్రం చెక్కు చెదరకుండా నవ్వుతూ వో చెట్టు కొమ్మల మధ్య వుండటం చూచారంతా. బస్సు లోయలోకి పడితే యీ కుర్రాడు చెట్టు మీదికి చేరటం ఏమిటి ? ప్రయాణీకు లంతా చనిపోతే యీ వొక్క కుర్రాడు బతకటమేమిటి ?

ఆ రోజుల్లో ఆ వుదంతాన్ని కథలు కథలుగా చెప్పుకున్నారు. అంత పెద్ద ప్రమాదం జరుగటానికి దేముడిని తప్పు పట్ట లేదు జనం. వెంకన్నబాబు బతకటం మాత్రం సాక్షాత్తు ఆ వేంకటేశ్వరస్వామి మహాత్యమే అన్నారు. పత్రికలలో బొమ్మలు వేసేరు.

వెంకన్నబాబుకి ఆస్తికేం కొదవలేదు. అతని తండ్రి మంచి ఆస్తిపరుడు. పరబ్రహ్మ మూర్తికి స్వయంగా బావగారతను.

అవన్నీ ఆలోచించే పరబ్రహ్మమూర్తి ఎన్నో నటనలు చేసి రెండేళ్ల వెంకన్నబాబుని తన వెంట తీసుకొచ్చాడు. కాళికాంబే అతడిని పెంచింది. ఎన్నన్నా కాళికాంబకు వాడంటే మనసులో ప్రేమే. మాటలు కూడా రాని మూగవాడని జాలి వుంది. పరబ్రహ్మమూర్తికి మాత్రం మనసులో వెంకన్నబాబు మీద కంటే అతడి వెనక వున్న ఆస్తి మీదనే ప్రేమ జాస్తి.

"సరే, నీకు పెళ్లికొడుక్కి కబురు చేయటానికి ఆ మూగవాడే చిక్కేడా ? యిందాకే నాకు చెప్పకపోయావా ? యిప్పుడేం మునిగి పోయిందిలే. యిక్కడున్నట్లు వెళ్లి రమేశ్‌ను వెంట పెట్టుకొని రానూ ? "

పరబ్రహ్మమూర్తి పై పంచ దులిపి భుజం మీద వేసుకొని లేచాడు. వాకిట్లోకి వచ్చాడు. సన్నటి తుప్పర పడ్తోంది.

"వర్షం కూడా పడుతున్నదే ! ఎండాకాలంలో వర్షం ఏమిటో ? పాపం. పెళ్లి వాళ్ళు గొడుగుల అవసరం వస్తుందని వూహించి వుండరు. ఆ ఏర్పాటు చేసేరో లేదో— నువ్వు గొడుగుల కోసం పురమా యించవే కాళీ."

కాళికాంబ గొడుగుల కోసం కబురు పెట్టటానికి మనుష్యుల కోసం వెతుకుతుండగా సోమసుందరం ఆమె కళ్ల బడ్డాడు !

* * *

ఇటీవల బి. హెచ్. ఇ. ఎల్. (హైదరాబాదు) కి చెందిన "ఇంటర్నేషనల్ క్లబ్" వారు "ధ్వన్యనుకరణ" కార్యక్రమం ఏర్పాటు చేసిన సందర్భంగా బి.హెచ్.ఇ.ఎల్. జనరల్ మేనేజరు శ్రీ ఎస్.ఎల్.ఎన్. రెడ్డి మిమిక్రీ కళాకారుడు సిల్వర్‌స్టార్‌ను అభినందిస్తున్న దృశ్యం. సాంస్కృతిక సంస్థ కార్యదర్శి శ్రీ వై. ఎస్. రావుగారినికూడా చిత్రంలో చూడవచ్చు.



వెంకన్నబాబు తుప్పర్లుపడ్డ తలను చొక్కాతో తుడుచుకొన్నాడు. తన నెవరైనా చూచి పలకరిస్తారేమో నన్న ఆశతో అలాగే వాళ్లవైపు చూస్తూ నిలబడ్డాడు.

వాళ్లెవరూ అతడిని పట్టించుకొనే స్థితిలో లేరు.

కొందరు పేకాటలో మునిగి వున్నారు. మరో యిద్దరు చెస్ బోర్డులో గళ్లవైపు ఏకాగ్రతగా చూస్తూ కూర్చున్నారు. ఒకతను కిటికీలోనుంచి వాకిట్లోకి చూస్తూ కూర్చున్నాడు.

'షో' అన్నాడు రమేశ్.

'అమ్మబాబోయ్. అపుడే షోనా ? అయితే మా హేండ్స్ అన్నీ పుల్ కౌంట్' అన్నాడు నిరంజనరావు నీరసంగా— ముక్కలు కింద పడేస్తూ. అందరూ అలాగే ముక్కల్ని బోర్లించారు.

నిరంజన్‌రావు వూహించినట్లు మూడు హేండ్సూ ఫుల్‌కౌంటే!

'యిదేం బాగాలేదు రమేష్. పెళ్లికి పిల్చి పేకాటలో కూర్చో పెట్టి మమ్మల్ని దోచేద్దామని ప్లాన్ వేసేవా ఏమిటి ? వర్సగా నువ్వు 'షో'లుచేసే కాడికి మేం ఆడటం ఎందుకోయ్ ?' భీమసేన్ అన్నాడు.

'ఏదో పెళ్లి చేసుకోబోతున్నావ్— మిత్ర బృందం ప్రేమగా వచ్చారని— ఆటలు వోడిపోయి మాకు ఋణమో పణమో ముట్టచెప్పటం పోనిచ్చి మా దగ్గర యీ నిలువు దోపిడీ చేయటం అన్యాయం బ్రదర్' నిరంజన్‌రావు అన్నాడు.

'నాయనలారా. ఎక్కడైనా 'బావా' అనండి కానీ వంగ చెట్టు దగ్గర 'బావా' అనొద్దన్నది— వెనకటికి వో సామెత. అలా మనవాడికి పేకాటలో 'మన, తన' భేదం తెలియదు. మనవాడు పేకాటలో కూర్చుంటే పెళ్లాన్ని కూడా మర్చిపోతాడు. యిప్పుడు పెళ్లినే మర్చిపోయి మన దగ్గర కూర్చుండిపోలేదూ ?'

రమేశ్ మిత్రుల వైపు చూచి నవ్వేడు.

'నిజమే. మీకు తెల్సుగా ? నేను పేకాట దగ్గర మొహ మాటాలు పెట్టుకోను. 'అప్పు ఆటలు ఆడవద్దు. మొహమాటాలు పెట్టుకోవద్దు. ఆటలో ఏకాగ్రతే ప్రధానం' అని మా గురువుగారు పేక ముక్కలు చేతిలో పెట్టి అక్షరాభ్యాసం చేస్తూ చెప్పిన మూడు సూత్రాల రహస్యాన్ని నేనెప్పటికీ మర్చిపోను. నిజానికి మా గురువుగారికి ఆయన మాటల్ని ఎప్పటికీ మర్చిపోనని ప్రమాణం చేసేను. కనుక కలేజావుంటే పేకాటలో గెలుచుకోండి— అంతేకాని డబ్బు పోయిందని ఏడుస్తారేమిటి? దయ చూపమని యాచిస్తారేమిటి ? కమాన్— రండి. పేకముక్కలు కలపండి.'

'అంటే— పేకాటలో నువ్వొక్కడివే మొగాడివని నీ భావమా ? ఒరేయ్ రమేశ్. గుర్తు లేదా నీకు ? నీ గురువెవరో నాకు తెలీదు కాని, నీకు పేకాటలో ట్రయినింగ్ యిచ్చి 'పేకాట కళాప్రపూర్ణుడి'ని చేసిం దెవరు ? నేను కాదూ ? నువ్వింతలో యింత కృతఘ్నుడివి అవుతా వనుకోలేదురా నాయనా. గురువుని మించిన శిష్యుడివయ్యావని ఆనందిద్దా మనుకొన్నాను. కానీ నీలాంటి కృతఘ్నుడిని శిష్యుడిగా చెప్పుకోటానికి యిప్పుడు సిగ్గుపడుతున్నాను' సుబ్బారావు అన్నాడు.

సుబ్బారావు ఆ మిత్రబృందంలోకల్లా సీనియర్ హేండ్ పేకాటలో.

'ఒరేయ్, వాడు పెళ్లికొడుకు. యివాళ వాడిని తిట్టే వీలుకూడా లేదు మనకు. కానీ పేకాట సంగతి ఎవరికి తెలీదురా ? అదృష్టంకల్సి ముక్క ఎక్కితే అందరూ ప్రతిభావంతులే. యీవేళ నాకు ముక్కెక్కటం లేదు అసలు. రమేశ్‌గాడికి తేలువిషంలా ముక్క జరజర ఎక్కుతోంది. కారణం ఏమంటావ్ ?' నిరంజనం అన్నాడు ఆలోచనగా.

'సీట్లు మార్చుకొందాంరా — పోనీ' రమేశ్ అన్నాడు.

'సీట్లలోలేదురా గురూ. నువ్వు మీ కాబోయే మామగారితో లాలూచీపడి మేము కోరినవి సప్లయికాకుండాచేసి మా మూడ్ చెడగొడు న్నావ్. అవునా ?' నిరంజన్ కూపీ లాగినట్లు అన్నాడు.

'ఒరేయ్ నిరంజన్. నీ అనుమానం నిజంలాగే కన్పిస్తున్నదిరా.







లేకపోతే చూడు. పెళ్ళివాళ్ళమా ? పెళ్ళికొడుకు మనదగ్గరే వున్నాడా ? అయినా మన తొమ్మిదో నెంబరు సమ్మన్‌కు యింతవరకు రెస్పాన్స్‌లేదు. నాకు పెసరట్టు పడందే మూడ్ రాదింక' భీమసేన్ మరం వేసుకొన్నాడు

'ఒరేయ్, సిగరెట్ పేకెట్లు కూడా రాసేం కదురా ? రాలేదు యిదేదో పెళ్ళికొడుకు, వాడిమామ, కల్సి మనల్ని నిలువుదోపిడీ చేయటానికి పన్నిన కుట్రే. పేర్ద — వీడేమో పేకాటలో పద్మవిభూషణు డయినట్లు పోజ్ పెడ్తున్నాడు.' సుబ్బారావు ఎగతాళి చేసేడు.

'నాయనా ! నీ కుట్ర మాకు అర్ధమయిపోయింది కానీ యింత వరకు మానుంచి దోచుకొన్న డబ్బు ముందక్కడ పెట్టు. మీ మామగారు పెసరట్టు త్వరగా పంపే ఏర్పాటు చెయ్యి ముందు.'

మూడు చేతుల వాళ్ళూ ముక్కల్ని క్రిందపడేసి లేచారు.

చెస్‌బోర్డు ముందిద్దరూ సీరియస్‌గా చెస్‌బోర్డునే చూస్తున్నారు.

'ఒరేయ్ ! రాచరికాలు పోయినా, యీ రాజులు, మంత్రులూ, ఏనుగులూ, గుర్రాలూ, శకటాలూ ఎటసెట్రా ఎట్సెట్రాలతో వ్యూహాలు వెయ్యటం మాత్రం పోలేదురా మనకు ? ఆపండోయ్ — ఆట ! యిక్కడ మేము పెళ్ళికొడుకుగాడి కుట్రలో యిరుక్కొని చస్తుంటేనూ ?' సుబ్బారావు చెస్‌బోర్డు మీదనున్న రాజుల్ని, మంత్రుల్ని చిందరవందర చేస్తూ అన్నాడు.

'ఒరేయ్, మన గోపీచంద్‌గాడు తపస్సులో పడ్డాడురోయ్. వోరి వీడి తపస్సు పాడుగాను. పేకాట వ్యసనం కన్నా పెద్ద వ్యసనం లాగుంది రోయ్ — యీ రచనా వ్యాసంగం ? యింత మనం గోల చేస్తున్నా పట్టించుకోకుండా ఆలోచిస్తున్నాడు అంటే వో సీరియల్ నవలే రాసి పారేసేలా వున్నాడు. నాయనా గోపీచందూ ? యిప్పటికి నీ సీరియల్ ఆలోచన ఆపు. యిక్కడ పెళ్ళికొడుకు వో పెద్ద కుట్ర చేసేడు' నిరంజన్ అన్నాడు.

'కుట్రా ?' ఆలోచనలో నుంచి బయటపడ్డాడు గోపీచంద్.

'ఆ ! వాళ్ళ కాబోయే మామగారితో కల్సి కుట్ర చేసేడు. మా మూడ్ చెడగొట్టి మమ్మల్ని నిలువుదోపిడీ దోస్తున్నాడు — వర్సగా 'షో'లు చూపిస్తూ. మనం కల్సికట్టుగా వీడి కుట్రను భగ్నం చేయాలి. మా నాయకుడివి నువ్వే'.

'బోలో... గోపీచంద్ రచనా కంఠీరవకూ— జై'.

'జై' అంటే 'జై' అని అరిచారంతా.

'యింతకీ మీకు పెసరట్లు రాకుండా నేను కుట్ర పన్నేనంటారు. మీకు పెసరట్లూ గట్రా రాకపోవటమే మీ వోటమికి కారణం — నా జయానికి కారణం— అని అంటారు. అంతేనా ?'

'అంతే — అంతే ...'

'అయితే స్వయంగా నేను చీటీ రాసి మనిషిని పంపించి మీరు కోరినవన్నీ తెప్పిస్తాను. మా మామగారు— అదే కాబోయే మామగారంటే అల్లాటప్పా మనిషనుకొన్నారేమో !'

రమేశ్ అటూ యిటూ చూచాడు.

ఎదురుగ్గా వెంకన్నబాబు కన్పించాడు

రమేశ్ తనవైపు చూడగానే వెంకన్నబాబు కళ్ళు కాంతితో ప్రకాశించాయి. ఆశతో, నిల్చున్న చోటినుంచి కదిలి, రెండడుగులు ముందుకు వేసేడు.

'ఒరేయ్. చీటీ తీసికెళ్ళటానికి మా వెంకన్నబాబు కూడా సమయానికి యిక్కడే వున్నాడు. గోపీ— చీటీలో ఏం రాయాలో ఎలా రాయాలో చెప్పు. ఒరేయ్, మళ్ళీ నన్ను తర్వాత అని లాభం లేదు మీకేమేమి కావాలో అన్నీ చెప్పేయండిప్పుడే నిముషంలో రాకపోతే నా పేరు రమేశ్ కాదు' బల్లమీదనున్న కాగితంను చేతుల్లోకి తీసుకొంటూ అన్నాడు రమేశ్

'బోలో... రమేశ్ దానసముద్రకీ— జై .'

జై అంటే జై అని అరిచారంతా.

'ఒరేయ్, ఛీ ఛీ. .ఏమిటిదంతా? యిప్పటికి మనం చేసిన అల్లరి చాలు. ఎంత పెళ్ళికొడుకు స్నేహితులమైనా మన అల్లరికి వో హద్దు వుండాలి. పాపం ఆయనెవరో అడిగినవి అడిగినట్లు పంపిస్తున్నాడు కదా అని పిచ్చి పిచ్చి కోరికలు కోరటం మర్యాద కాదు' గోపీచంద్ మందలిస్తున్నట్లు అన్నాడు.

'ఒరేయ్ కథాసాగరం—నీ ఆదర్శాల పర్వతాలు చాలా ఎత్తయినవని మాకు తెల్సుకాని నోరు మూసుకో. కందకులేని దురద కత్తిపీటకన్నట్లు రమేశ్‌గాడికి లేని బాధ, మొహమాటం నీకెందుకు? ఒరేయ్ రమేశ్, వాడికిలాంటి రచనలు చేయటం చాతకాదు కానీ నేను చెప్తాను రాయి— చీటీ—' భీమసేన్ అన్నాడు.

''చెప్పు''

విడిది — కేంప్ నెంబర్ టు,
పెళ్ళికొడుకు+మిత్రబృందం

ఎమర్జంట్ మెమో నెంబరు 10,
అర్జంట్ — ఎమర్జెంట్
కాబోయే మామగారూ,

చీటీ నెంబరు 9 కి జవాబింతవరకు లేనందుకు కాబోయే అల్లుడిగా నాకు యమ కోపం వచ్చింది. నా మిత్రులకు జరిగి.. అమర్యాద నాదిగానే భావిస్తున్నాను ఆఫ్టరాల్ పెసరట్లూ— సేమ్యా వుప్మా పంపమంటే పంపలేని మీ అశక్తతకు జాలిపడాలో, విచారించాలో, కోపపడాలో అర్థం కావటంలేదు. ఏమైనా యీ చీటీ నెంబరు 10 కి వెంటనే జవాబివ్వడం — అంటే కాగితం ద్వారా కాదు కోరికల

# దాగుడుమూతలు

తీర్చటం ద్వారా— వెంటనే అవసరం అలా తీర్చని ఎడల రాగల పరిణామములు ఎలా వుండునో వూహించుట నా కిష్టం లేదు

మీరు వెంటనే పంపవల్సిన వస్తువుల లిస్టు —

1 నేతి పెసరట్లు కొబ్బరి ఛట్నీతో – 25
2 సేమ్యా ఉప్మా " – 25 ప్లేట్లు
3 బూస్ట్ – 50 కప్పులు
4 స్పెషల్ వక్కపొడి పొట్లాలు – 50
5 బాబా జర్దాకిళ్లీలు – 5

"ఒరేయ్ భీమా, నీ లిస్టు బాగావున్నది కానీ మనకు బాబా జర్దాకిళ్లీలు పడవు రెండు స్పెషల్ డీలక్సు మీరా కిళ్లీలు రాయి — ఆ చేతితోనే"

"ఆ ! రమేశ్ రాస్తున్నావా ?"

"ఊఁ రాస్తున్నాను"

మీరా కిళ్లీలు — 5
కింగ్ సైజ్ గోల్డుఫ్లేక్ పేకెట్లు — 25
ఛార్మినార్ పేకెట్లు — 10

'ఒరేయ్ ! నాకివేం గిట్టవురా నా బ్రేండ్ – 555 రెండు తగిలించండి— ఆ చేత్తోనే '

అలా ఆ లిస్టు పెరిగి పెరిగి హనుమంతుడి తోకంత అయింది

మొత్తం మీద లిస్టు పూర్తయింది వుత్తరం రాయటం కూడా పూర్తయింది

'ఒరేయ్ వెంకన్నా ! యీ చీటీ తీసుకెళ్లి పెళ్లి వాళ్లింట్లో నేనిమ్మని యిచ్చిరా పరుగెత్తు కెళ్లాలి వెంటనే వచ్చి వాళ్లేమన్నారో చెప్పాలి అర్థమయిందా ?'

చీటీ వెంకన్నబాబు చేతిలో పెట్టబోతూ అన్నాడు రమేశ్ వెంకన్నబాబు అర్థమయిందన్నట్లు తలూపేడు— కానీ చీటీ తీసుకోలేదు

'అత్తయ్య తలంటి పోసుకోటానికి వెంటనే రమ్మన్నది రా బావా వెళ్దాం— రావూ ?' వెంకన్నబాబు సౌంజ్ఞలలోని ఈ భావం అందరికీ స్పష్టంగా అర్థమయింది

'వస్తాలే ముందు చెప్పిన పని చెయ్యి' విసుగ్గా అన్నాడు రమేశ్

'ఊహూ ! యిప్పటికి రెండుసార్లు వాళ్లకి చీటీలిచ్చి వచ్చాను అత్తయ్య కోప్పడుతుంది యిప్పటికే చాలా ఆలస్యమయింది రా బావా'

రమేశ్‌కి వాడి మొండితనానికి కోపం వచ్చింది

'ఒరేయ్ మూగవెధవా ! చెప్పిన పని చెయ్యకుండా మొండికెత్తుతావేరా ? నిన్నూ ' చెయ్యెత్తేడు రమేశ్

కానీ ఆ చెయ్యి అలాగే ఆగిపోయింది

అందుకు కారణం — గోపీచంద్ ఆ చెయ్యిని పట్టుకొన్నాడు

'ఛీ యిదేమిటి రమేశ్ ? పాపం వుట్టిపుణ్యానికి అమాయకుడైన ఆ కుర్రాడి మీద చెయ్యి చేసుకొంటావేం ? నిన్ను మీవాళ్లు పిలుస్తున్నారని చెప్పటానికి కాబోలు— అతను వచ్చి ఎంత సేపయిందో తెల్సా ? మన వైరితనానికి కూడా వో హద్దూ పద్దూ వుండాలి పెళ్లికని వచ్చి పేకాటలో మునిగిపోతే ఎలా ? ఆ చీటీ నేను తీసికెళ్లి యిస్తాను నువ్వు ఆ కుర్రాడు చెప్తున్నది శాంతంగా అర్థం చేసుకో — ప్లీజ్ '

అలా గోపీచంద్ అంటూండగానే పెళ్లివారింటి నుంచి ఫలహారాలు వచ్చాయి వాటితోపాటు రఘురావ్ కూడా వచ్చాడు

"సారీ సర్ పెసరట్లు తయారుకావడం కాస్తంత ఆలస్య

మయ్యింది ఓ! చీటీ నెంబర్ 10 తయారయినట్లుందే యిలా యివ్వండి సార్ ''

గోపీచంద్ ఆ చీటీని అరచేతిలో వుంచుకొని నలిపేయ బోయాడు కానీ రమేశ్ ఆ చీటీని తీసుకొని స్వయంగా రఘురావ్‌కిచ్చాడు

సరిగ్గా అదే సమయంలో పరబ్రహ్మమూర్తి అక్కడికి ప్రవేశించాడు

''ఏమిటి ? మిత్రులంతా అలా సీరియస్‌గా వున్నారేమిటి ? ఏమండీ, మీ పేరేమిటో ''

''రఘురావ్ అండీ''

''ఆఁ! మా వాళ్లకి మర్యాదలన్నీ జరుగుతున్నాయి కదా ? మీరు ఏంలోటు చెయ్యరనుకోండి కానీ అడగడం నా బాధ్యత కదా ? నాన్నా —రమేశ్! మంగళస్నానాలకి టైమ్ అయిందని మీ అమ్మ ఒకటె గోల పెడుతున్నదోయ్ వెంకన్నగాడు యిక్కడే వున్నాడా ? చెప్పలేదా ? చెప్పి వుండడు వెధవ చెప్తే నువ్వెందుకు రావు ఏం బాబూ మీరూ వస్తారా—అబ్బాయికి మంగళ స్నానాలు చేయించ బోతున్నారు ''

''అలాగే నాన్నగారూ వెంకన్న మంగళ స్నానాలకి రమ్మని చెప్పలేదు ''

''ఏరా వెధవా నిన్ను పంపించింది దేనికి ? నువ్వు యిక్కడ చేస్తున్నదేమిటి ?'' వెంకన్నబాబు చేతికి అందుబాటులో వున్నాడు అంచేత నెత్తిమీద గట్టిగా రెండు మొట్లు మొట్టి అన్నాడు పరబ్రహ్మమూర్తి

ఆ మొట్లు వెంకన్నబాబుకు కొత్త కాదు పైకి అతి మెత్తగా కన్పిస్తాయి కానీ అనుభవించే వాడికి గుడ్లలో నీళ్లు తిరుగుతాయి

''లేదు మామయ్యా! నేను పిలుస్తూనే వున్నాను బావగారు పేకాట ఆడుతూ ''

''ఛీ నోర్మూయ్'' మరో మొట్టికాయ ఎడింది వెంకన్నబాబు మాడు మీద

''అయ్యా రఘురావ్‌గారూ పెళ్లికొడుకును పిలవటానికి ఆ విడిది నుంచి యీ విడిది దాకా వియ్యంకుడే స్వయంగా వచ్చే పరిస్థితిని కల్పించటం మీ మర్యాదకు లోటు అనుకొంటున్నానని మీ వియ్యంకుడు గారికి మాట వర్సగా వో ముక్క చెప్తారా ? ''

'అలానే చెప్తానండీ '

'అన్నట్లు బయట వర్షంజల్లు పడుతున్నట్లుందే సమయానికి యీ వాన వొకటి తగులుకొంది చూడండి గొడుగేదైనా ఏర్పాటు చేస్తారా - పెళ్లికొడుకుకి ?'

రఘురావ్‌కి అసలే వొళ్లు మండుతోంది అతను పెళ్లివాళ్లు వచ్చిన దగ్గరినుంచి వాళ్ల ధోరణిని గమనిస్తూనే వున్నాడు అయితే బావగారి మొహం చూచి మనసులో కోపాన్ని చిరాకుని మనసులోనే వుంచుకొని, నవ్వుని మొహంమీద పూసుకొని తిరుగుతున్నాడు

కానీ యిక ఆ నటన చేయలేకపోయాడు

'అలాగేనండీ చీటీ నెంబరు పదిలో వో లిస్టు వుంది ఆ లిస్టు అడుగున గొడుగులు కూడా చేరుస్తాను ఎన్ని ఆజ్ఞ యిస్తారో యివ్వండి' మామూలుగానే అన్నా అందులో వ్యంగ్యాన్ని గుర్తించక పోలేదంతా

అప్పుడే వో స్కూటర్ వచ్చి ఆ యింటిముందు ఆగింది

'డాక్టర్‌గాడొచ్చాడోచ్' మిత్ర బృందం బిగ్గరగా అరిచింది సంతోషంతో

ఒక్క గోపీచంద్ మాత్రం, గుడ్ల నీరు కుక్కుకొని ఏడుపును దిగమింగకుంటున్న వెంకన్న బాబును దగ్గరిగా తీసుకొని కన్నీళ్లు తుడవసాగేడు!

(ఇంకా వుంది)

# టెలిపతీనే జీవనోపాధిగా స్వీకరించిన ప్రఖ్యాత టెలిపతిస్టు వోల్ఫ్ మెస్సింగ్

అద్భుత వ్యక్తులు

బి.వి. పట్టాభిరామ్

మెజీషియన్—హిప్నాటిస్ట్

ఆది ఒక ఆడిటోరియం. స్టేజిమీద ఆర్టిస్టు 'టెలీపతీ ప్రదర్శన'' ఇస్తున్నాడు. ప్రేక్షకులు తలుచుకున్నది వెంటనే చెప్పడం, వారు అనుకున్నవి చేసి చూపించడం వంటి అద్భుత కార్యాలను అవలీలగా ప్రదర్శిస్తున్నాడు. ప్రదర్శన మంచి రసపట్టులో ఉండగా నలుగురు సోవియట్ యూనియన్ పోలీసులు స్టేజిమీదకు హుటాహుటిన మైకు దగ్గరకు వచ్చి ''ఈ ప్రదర్శన ఇంతటితో సమాప్తం'' అని ప్రకటించి ఆ ఆర్టిస్టును బలవంతంగా కారులో తోసి, రయ్యిమని ఊరవతలికి తీసుకుపోయారు. వచ్చినవారు పోలీసులు కాబట్టి ఏమీ ఎదురు చెప్పలేని ఆ ఆర్టిస్టు ''తనని ఎందుకు అరెస్టు చేసారు ఎక్కడికి తీసుకు వెళ్తున్నారు దయచేసి చెప్ప''మని అడిగాడు. అవన్నీ మరో పది నిమిషాల్లో తెలుస్తాయి మేము దొంగలం కాదు అని పోలీసులు సమాధానం చెప్పారు.

పది నిమిషాల్లో ఆ కళాకారుణ్ణి, ప్రముఖ నాయకుడు స్టాలిన్ ముందు హాజరు పరిచారు ఆ పోలీసులు. స్టాలిన్ అతనికేసి తీక్షణంగా చూస్తూ ''నువ్వు చాలా పెద్ద టెలిపతిస్టువని ప్రచారం ఉంది. నీకంత శక్తి ఉంటే ప్రస్తుతం పోలెండు దేశంలోని నాయకులు ఏయే వ్యూహాలు పన్నుతున్నారో చెప్పు — నువ్వు చేసే పనిలో సత్యముంటే నువ్వు చెప్పగలుగుతావు — లేని పక్షంలో నీ అంతు చూస్తాను అని చెప్పాడు. ఆ వ్యక్తి టెలీపతితో పోలెండులో ఉన్న ఆప్త స్నేహితుడికి సందేశాలు పంపి కొంతవరకు సమాచారం సేకరించి స్టాలినుకు చెప్పాడు. అది స్టాలిన్‌కు తృప్తి కలిగించినా, అతని శక్తి ఇంకా పరిశోధించాలనే ఉద్దేశ్యంతో మరికొన్ని పరీక్షలు పెట్టాడు. అతను అన్నీ కూడా విజయవంతంగా చేయగలిగాడు.

అతని పేరు వోల్ఫ్‌మెస్సింగ్. 1899 సెప్టెంబరు పదవ తేదీన రష్యా ఆధీనంలో ఉన్న వార్సాలో [పోలెండు] ఒక పేదకుటుంబంలో జన్మించాడు. అతని తల్లిదండ్రులు ఎంతో దైవ భక్తి కలిగినవారు కానీ మెస్సింగ్‌కు చిన్నతనం నుంచి భక్తిభావం బుర్రకెక్కలేదు తన ఇంట్లో ప్రార్థనలు చెయ్యటం అతనికి నచ్చలేదు. అక్కడ ఉంటే తను కూడా భక్తుడిపోతానేమోననే భయంతో, తన పదకొండవ సంవత్సరంలో ఇంట్లోంచి పారిపోయి బెర్లిన్ పోయే రైలెక్కే





సాడు. రైలైతే ఎక్కాడు కానీ చేతిలో టికెట్ లేదు. అందుకని ఒక సీటు కింద దాగుకున్నాడు. ఇంతలో కండక్టరు వచ్చి అందరి వద్దా టికెట్లు చూస్తుండగా, చేతిలో నుంచి పెన్ను జారి క్రింద పడింది. అది తీద్దామని అతను వంగునేసరికి అక్కడ సీటు కింద మెస్సింగ్ కనబడ్డాడు. అతన్ని బయటకు లాగి టికెట్ చూపించమని అడిగాడు. సరిగ్గా ఆ క్షణంలోనే మెస్సింగ్ జీవితంలో ఒక పెద్ద మలుపు జరిగింది. మెస్సింగ్ భయం భయంతో అక్కడ పడేసి ఉన్న ఒక చిన్న కాగితం ముక్కను కండక్టరుకిచ్చి అది అతనికి టికెట్‌లాగ కనపడాలనే సందేశం తనకు తెలియకుండానే పంపాడు. కండక్టరు ఆ కాగితం ముక్కను అటూ ఇటూ చూసి, సంతకం పెట్టి ''మరీ టికెట్ ఉండగా సీటు క్రింద ఎందుకు దాగుకున్నావు'' అని మందలించి ఆ కాగితం మెస్సింగ్‌కిచ్చి వెళ్ళిపోయాడు. ఆ సంఘటన మెస్సింగ్ జీవితాన్నే మార్చివేసింది. తాను అనుకున్నది ఎదురుగా ఉన్నవారు అనుకునేలాగ చేయగలననీ, వారు అనుకున్నది తను చేయగలననీ విశ్వాసం ఏర్పడింది

బెర్లిన్ చేరిన తరువాత ఎన్నో రకాల ఉద్యోగాలు చేసాడు, కానీ ఎందులోనూ అతనికి తృప్తి లభించలేదు చివరికి ''టెలీపతీ''ని వృత్తిగా స్వీకరించి స్టేజిపై ప్రదర్శనలివ్వ సాగాడు. అతీంద్రియ శక్తులను ప్రదర్శించడం వృత్తిగా స్వీకరించి బహిరంగంగా ప్రదర్శనలిచ్చిన మొట్టమొదటి కళాకారుడితడే.

1915వ సంవత్సరంలో మెస్సింగ్, వియన్నాలో ఒక ప్రదర్శన ఇవ్వటానికి వెళ్ళినపుడు ఆల్బర్ట్ ఐన్‌స్టీన్‌ని, సిగ్మండ్ ఫ్రాయిడ్‌ని కలుసుకోవటం జరిగింది. చిన్నవయసులోనే టెలీపతీని అద్భుతంగా ప్రదర్శిస్తున్న మెస్సింగ్‌ను ఐన్‌స్టీన్, ఫ్రాయిడ్‌లు, విడివిడిగానూ, కలిసి, ఎన్నోరకాల పరీక్షలకు గురిచేసారు ఫ్రాయిడ్, ఒకసారి మెస్సింగ్ కళ్ళకేసి చూస్తూ ఒక సందేశం పంపాడు అదేమంటే, అలమారలోని శ్రావణము అనే పనిముట్టును తీసుకుని, ఐన్‌స్టీన్ మీసంలోని మూడు వెంట్రుకలు పీకాలి అని సందేశం పంపడంలో కళ్ళతో కానీ, చేతులతో కాని సౌజ్ఞలు చేయనవసరం లేదు. ఆ విషయాన్ని మనసులో అనుకుంటూ అతనికేసి చూస్తేచాలు. మనసులో ఏముందో తెలుసుకోగలడు.

ఫ్రాయిడ్ అలా సందేశం పంపిన, నిమిషానికి మెస్సింగ్ లేచి అలమారలోని శ్రావణము తీసుకుని ఐన్‌స్టీను వద్దకు వచ్చి ''క్షమించాలి, ఫ్రాయిడ్ గారికి మీ మీసంలోని మూడు వెంట్రుకలు కావాలిట పీకుతున్నాను'' అని అడిగాడు. తన సందేశాన్ని ఖచ్చితంగా అందుకున్నందుకు ఫ్రాయిడ్ ఉబ్బితబ్బిబయిపోయి మెస్సింగ్‌ని ఎంతో మెచ్చుకున్నాడు.

అప్పటి నుంచి మెస్సింగ్ ఈ విద్యపై మరింతగా సాధన చేసి, క్లయర్‌వాయన్స్ కూడా బాగా అభ్యసించి, అమెరికా, ఇంగ్లండు, జపాన్, బ్రెజిల్, అర్జెంటీనా, ఆస్ట్రేలియా, ఫ్రాన్సు, ఇండియా దేశాలు పదేళ్ళపాటు తిరిగి స్టేజి ప్రదర్శనలిచ్చి ప్రజలకు ఎంతో వినోదంతోబాటు ఆశ్చర్యం కలిగించాడు 1927లో భారతదేశం వచ్చినప్పుడు మెస్సింగ్, మహాత్మాగాంధీనికలిసాడు. గాంధీకి కూడా అతీంద్రియ శక్తులపై చాలా నమ్మకం ఉండి మెస్సింగ్‌ని గాంధీ కొన్ని పరీక్షలకు గురిచేసి. అతను అవి జయప్రదంగా చెయ్యడంతో అతనిని ''అద్భుత వ్యక్తి''గా కొనియాడారు.

అనంతరం మెస్సింగ్ పోలెండు వచ్చి అక్క

# ప్రెస్టీజ్ ఒక్కటే 100% భద్రమైనది

# జి. ఆర్. ఎస్. ఒక్క ప్రెస్టీజ్‌కే కలదు గనుక






**ప్రెస్టీజ్‌కి జి ఆర్ ఎస్ 100% భద్రతను ఎట్లా చేకూరుస్తుంది?**

గాస్కెట్ రిలీజ్ సిస్టమ్ ఒక అద్వితీయమైన భద్రతా సాధనం అది మూతలో రబ్బర్ గాస్కెట్‌కు సరిగా పైనగల ఒక రంధ్రం ఆవిరి ఒత్తిడి అధికమైనప్పుడు జి ఆర్ ఎస్ రబ్బర్ గాస్కెట్‌ను సాగేటట్టు రంధ్రంనుంచి బయటకు విస్తరించేటట్టు చేసి ఆవిరిని క్రిందివైపునకు విడుదలచేస్తుంది అంత తేలిక అంత సులభం 100% భద్రత



**అయితే అన్ని ప్రెషర్ కుక్కర్లు భద్రమైనవి కావా?**

మీరు సేఫ్టీ ప్లగ్‌ను మార్చినపుడు మీకు నకిలీది లభించవచ్చు ఇది అత్యవసర సమయాలలో పనిచేయదు దురదృష్టవశాత్తు సేఫ్టీప్లగ్ నకిలీదో అసలైనదో మీరు గుర్తించలేరు ప్రమాదాన్ని ఎందుకు కొని తెచ్చుకోవాలి? జి ఆర్ ఎస్ ఎన్నడూ విఫలంకాదు అది 100% భద్రతను నిశ్చయంగా ఇస్తుంది



**జి ఆర్ ఎస్ లేకుంటే ఏమౌతుంది?**

నకిలీ సేఫ్టీ ప్లగ్‌లు పనిచేయకపోవచ్చు వెయిట్ వాల్వ్‌లోని రంధ్రాలు పూడుకుపోవచ్చు ఒకవేళ ఆవిరి ఒత్తిడి ఎక్కువైపోతే తక్షణం దానిని విడుదల చేయగల వైఫల్యంలేని భద్రతా విధానం మీకు కావాలి అందుకే జి ఆర్ ఎస్ రూపొందించ బడింది మీ ప్రెషర్ కుక్కర్‌ను భద్రమైనదిగానేకాదు అత్యంత భద్రమైనదిగానేకాదు 100% భద్రతకలదానిగా చేసేందుకు



**సొమ్ము ఆదా మన్నిక మరియు సర్వీస్- ప్రెస్టీజ్ విధానం!**

ఎక్కువ వండటానికి స్థలాన్ని సమకూర్చి, సమయాన్ని ఇంధనాన్ని ఆదా చేయడంలో మీకు తోడ్పడటానికి అనువుగా క్రొత్త ప్రెస్టీజ్‌కి చక్కగా అమర్చబడిన పైమూత కలదు హెవీగేజ్ అల్యూమినియంతో నిర్మించబడిన క్రొత్త ప్రెస్టీజ్ పెక్కు సంవత్సరాలపాటు పనిచేస్తుంది కాగా దేశమంతటా నెలకొల్పబడిన ప్రెస్టీజ్‌వారి విక్రయానంతర సర్వీసు కేంద్రాల ఫలితంగా సమర్థమైన సర్వీసు లభించగలదని మీరు రూఢిగా నమ్మవచ్చు

## క్రొత్త ప్రెస్టీజ్

ప్రతి కుటుంబానికి కావలసిన సైజులలో లభ్యమౌతుంది

TTK తయారి.

MAA(S) TTP 1B TEL 84

# అద్భుత వ్యక్తులు

టెలీపతీ, క్లయర్ వాయన్స్ ప్రదర్శనలతోపాటు. పోయిన వస్తువుల ఆచూకీ తెలిపే శక్తిని కూడా సాధన చేసి, బాగా ప్రావీణ్యత సంపాదించి, ఇటు పోలీసు వారికి, అటు స్నేహితులకు ఎంతో సహాయం చేసాడు.

1939లో ఒక టెలీపతీ ప్రదర్శనలో, హిట్లర్ గురించి ప్రస్తావిస్తూ హిట్లరు రష్యా పైకి దండెత్తితే తప్పక మరణిస్తాడు అని ప్రకటించాడు. అది తెలుసుకుని హిట్లర్ మండిపడి, అతన్ని పట్టించిన వారికి పెద్ద మొత్తం బహుమతిగా ఇస్తానని ప్రకటించాడు. అతన్ని పట్టుకుని అతనిచేతనే ఆ మాటను ఉపసంహరింపచేయాలని చూసాడు హిట్లర్ కానీ ఈలోగా మెస్సింగ్ తప్పించుకున్నాడు. కానీ మెస్సింగ్ తండ్రిని సోదరులను బంధువులను నాజీలు అంతమొందించారు.

అక్కడినుంచి రష్యా చేరి, అక్కడి సాంస్కృతిక శాఖవారిని కలిసి తనకు ఉపాధి కల్పించమని కోరాడు, ''మాకు ఇలాంటి వాటి మీద నమ్మకం లేదు, మాకు జాతకాల రాయుళ్ళు అతీతశక్తులు ప్రదర్శించే వాళ్ళ అవసరం లేదు'' అని ఖండితంగా చెప్పేసారు. అయినా మెస్సింగ్ పట్టువిడవక ''ఎప్పటికైనా ప్రభుత్వం ఈ శక్తులను గుర్తిస్తుంది, ఈ శక్తులలో ఎటువంటి మోసం లేదు, అయినా తనను ఒక్కసారి పరీక్ష చేయమని ప్రాధేయపడ్డాడు. సరేనని వారొక కమిటీని ఎంపికచేసి వారిని పరీక్ష చేయమని కోరారు. కమిటీ సభ్యులందరూ మెస్సింగ్‌ను పరీక్షచేసి అతనికి అతీంద్రియశక్తులున్నాయని ఏకగ్రీవంగా ఆమోదించారు.

మెస్సింగ్‌ను అతని జీవితకాలంలో ఎంతో మంది శాస్త్రజ్ఞులు ఎన్నోరకాల పరీక్షలకు, పరిశోధనలకు గురిచేసి అతను ప్రదర్శించే దాంట్లో ఎటువంటి మోసమూ లేదని నిర్ధారించారు.

రష్యాలో అతి ముఖ్యమైన ''సైన్స్ అండ్ రిలీజియన్'' అనే పత్రికలో మెస్సింగ్ గురించి, అతని అతీతశక్తుల గురించి ఎంతో వివరంగా చాలాసార్లు ప్రచురించారు. మెస్సింగ్ రాసుకున్న ''ఎబౌట్ మై సెల్ఫ్'' అనే స్వీయ చరిత్రను సీరియల్‌గా ప్రచురించారు.

''నేను నాస్తికుడను. దేవుడూ, దయ్యమూ అంటే నాకు నమ్మకం లేదు, కానీ అతీంద్రియ శక్తులంటే నాకు అపారమైన విశ్వాసం ఉంది. అది విశ్వాసం కాదు అనుభవం, ఈ అనుభవం, ప్రతీ మనిషి జీవితంలో తప్పక ఒకసారి పొందుతాడు, ప్రపంచమంతా ఈ శక్తులను గుర్తించే రోజు అతి దగ్గరలో ఉంది'' అని అంటారు వోల్ఫ్ మెస్సింగ్ ★

పై వారం :

గ్రేట్ మెజీషియన్ హెర్మన్

# వైకుంఠపాళి

కంచుమర్తి వెంకటేశ్వరరావు



ఆఖరి బస్సు నన్ను అడవిలాంటి ఊరిలో దింపేసి కాస్తంత దుమ్ముకూడా నా మొఖాన కొట్టి గతుకుల రోడ్డు మీద ఊగిసలాడుతూ వెళ్ళిపోయింది చుట్టూ చీకటి అంతా నిర్మానుష్యం ఈ చీకటిలో వెళ్ళ వలసిన చోటుకి వెళ్ళగలనా లేదా అనే భయం చిన్నగా కలిగింది చేతిలోని బేగ్ బరువు నా అవస్థకు తోడయింది బేగ్‌ను ఆ చేతికి ఈ చేతికి మార్చుకుంటూ అడుగులు వేయడం ప్రారంభించాను

చేతికున్న రేడియం వాచి చీకటిలో పన్నెండు గంటలు చూపించింది వాచిలో అలారం కూడా ఉంది నిశ్శబ్ద వాతవరణంలో పన్నెండు గంటలు సూచిస్తున్నట్లుగా అలారం కొట్టింది

"డాడీ కారు తీసుకు వెళ్ళండి"

బయలు దేరుతుంటె పెద్ద కొడుకు నవీన్ చెప్పినప్పుడు 'నేను వెళ్ళవలసిన చోటు పవిత్రమైంది నా కూడా అంతస్తు చూపడానికి కాదు' అని చెప్పి సిటీబస్ కూడా ఎక్కని నేను ఒక ప్రైవేటు బస్సులో ఇరుకు మనుష్యుల మధ్య నిలబడ్డానికి చోటు సంపాదించి మరీ ప్రయాణం సాగించాను

నేను వెళ్ళేది ఎక్కడికి ?

ఇరవై ఏళ్ళ క్రితం ఈ ఊరుతో, ఈ మనుష్యులతో బంధాలను త్రెంచుకుని నునుపుగా కనిపించే కొండలను ఎక్కడానికి సాహసం చేసి బయలుదేరాను నునుపు కొండలు ఎక్కలేవు జారిపడతావు అని చెప్పారు కానీ ధైర్యంతో, మొండి పట్టుదలతో అడుగులు ముందుకు వేసు కుంటూ వెళ్ళాను విజయాన్ని నా చేతుల్లోకి తెచ్చుకున్నాను

ఈ విషయం చెప్పడానికి, ఆనాడు నన్ను ఆపడానికి ప్రయత్నించిన రాఘవ, నా ప్రియ మిత్రుడుకు నా విజయాన్ని చెప్పి వాడి చేత మెప్పు పొందాలని తపనతో ఈ ప్రయాణం

చిన్నప్పుడు ఈ ఊరులో రాఘవ, నేను ప్రాణ స్నేహితులం

మా తాతా తండ్రులు ఈ ఊరులో రాజాల్లా బ్రతికేవారు నా తరంకు వచ్చేసరికి ఐదెకరాల పొలం, ఇల్లు మిగిలింది ఇద్దరు పిల్లలుతో సంసారం జరిగిపోతుంది కానీ నా కిష్టం లేదు నేమా రాజాలా బ్రతకాలి నా పిల్లలు రాజఠీవిలో పెరగాలి అలా ఉండాలంటే ఈ పిడికెడు మెతుకులు చాలవు ఈ ఆలోచన నాలో కలగగానే పట్నం వెళ్ళి వ్యాపారం చెయ్యాలనే కోరిక ఏర్పడింది,

కానీ రాఘవ ఒక సామాన్య రైతు బిడ్డ చిన్నప్పటినుండి కష్టాలు, నష్టాలు ఎదుర్కొన్నవాడు జీవితాన్ని చిరు దశలోనే చదవడం మొదలు పెట్టినవాడు

"నీవు ఎన్నుకున్నదారి మంచిది కాదు అయినా ఈ రోజు నీకు ఏం తక్కువ ఉండటానికి ఇల్లుంది బ్రతకడానికి పొలం ఉంది అప్పుల బాధ లేదు నీ పిల్లలతో హాయిగా సుఖంగా ఉండడానికి ఈ మాత్రం చాలదా"

"వీల్లేదు రాఘవా ఎందుకో అలా బ్రతకాలనిపించడం లేదు ఉన్నతంగా పెరగాలి ఈ ఆలోచన ఎందుకు కలిగిందో, ఈ ప్రయాణానికి ఎందుకు ముహూర్తం పెట్టానో చెప్పే స్థితిలో లేను ఈ మజిలీలో విజయం సాధించడానికే ప్రయత్నిస్తాను అలా నా ప్రయత్నంలో విజయం సాధిస్తే సంతోషించే వారిలో ప్రథముడివి నువ్వే ఒకవేళ ఓడిపోతే నువ్వు ఆదరించి బుజ్జగిస్తావనీ తెలుసు అందుకే బయలుదేరుతున్నాను నన్ను ఆపవద్దు"

అని చెప్పి ఉన్న ఇల్లు, పొలంను అమ్మి చేతికందిన డబ్బుతో భార్యాపిల్లలతో, ఊరుతో పూర్తిగ బంధం త్రెంచుకుని పట్నం చేరాను ముందు ఒక అద్దెఇల్లు సంపాదించి డబ్బునే చేతో పట్టుకుని ఏ వ్యాపారం చెయ్యాలా అనే ప్రయత్నంలో పడ్డాను నా ప్రయత్నానికి

# వైకుంఠపాళి

మొదటి మెట్టుగా ఒక వడ్డీ వ్యాపారస్తుని దగ్గర మరి కొంత డబ్బు తీసుకుని ఫ్యాన్సీ స్టోరు ప్రారంభించాను నా కృషికి అదృష్టం తోడయింది అది రాణించింది సంవత్సరం తిరిగేలోగా ఫ్యాన్సీ స్టోరు పెద్దదయింది చిన్న ఇల్లు కట్టాను పిల్లలు చదువుతున్నారు ఐదు సంవత్సరాల్లో ఆ ఊర్లో ఫ్యాన్సీస్టోరుతోపాటు రెండు బట్టల షాపులు పిల్లలు పెరిగారు

పది సంవత్సరాలకు ఒక ప్రైవేటు కంపెనీలో వాటాదారునిగ చేరాను చిన్న ఇల్లు బంగళాగా మారింది పెద్దబ్బాయి నవీన్ ఇంజనీయరు రెండోవాడు చదువుమీద శ్రద్ధలేక నాతో వ్యాపారంలోకి దిగేడు

ఇప్పుడు ఊర్లో లైన్స్‌క్లబ్ ప్రెసిడెంటుని మర్చంట్స్ అసోసియేషన్‌కు అధ్యక్షుడిని

ఇంతటి ఉన్నత స్థితికి చేరుకున్నాను ఎప్పటికప్పుడు అనుకునేవాడిని రాఘవ దగ్గరకు వెళ్ళాలని, నా విజయాన్ని చెప్పాలని అయితే వ్యాపారంలో ప్రతి నిముషం లెక్కించే నాకు టైము దొరికేది కాదు అంతా బిజీ ఈ మధ్యనే విదేశాలకు వెళ్ళి వచ్చాను

ఇన్నాళ్ళకు రెండ్రోజులు విశ్రాంతి దొరికింది

రాఘవ దగ్గరకు వెళ్ళడానికి తీరికయింది

ఆలోచిస్తుంటె దూరం తగ్గిపోయింది ఇరవై ఏళ్ళక్రితం స్మృతిపథంలోంచి తీసేసిన జాడలు గుర్తుకొచ్చాయి అదే ఇల్లు అయితే పెంకుటిల్లు స్థానంలో డాబా వచ్చిందంతే రాఘవ కొడుకులు, కోడళ్ళు, మనవళ్ళతో ఉండి ఉంటాడు

వరండాలో లైటు వెలుగుతుంది

బేగ్‌ను అరుగుమీద ఉంచి తలుపు తట్టాను

తలుపులు తెరచుకున్నాయి

గుండె అరలు విచ్చుకున్నాయి

ఎదురుగా రాఘవ

వార్ధక్యపు ఛాయలు స్పష్టంగా కనిపిస్తున్నాయి, తల నెరసింది ముడతలపడ్డ శరీరం కప్పుతూ పంచె లాల్చీ కళ్ళద్దాలు తగ్గిన చూపుకు సాక్ష్యాలంటున్నాయి

''ఎవరూ '' అని కళ్ళద్దాలు సరిచేసుకుని చూస్తూ అన్నాడు రాఘవ ఆ పిలుపులో ఎంత సంతోషం

'నేనే రాఘవా '

రాఘవ నన్ను అమాంతం కౌగిలించుకున్నాడు

''ఒరేయ్ చూపు తగ్గినా నా కళ్ళు నిన్ను గుర్తుపట్టాయిరా ''

రాఘవ బేగ్‌ను అందుకుని లోపలకు నడిచాడు రాఘవతో లోపలకు వెళ్ళాను

''ఒరేయ్ నువ్వింకా కుర్రాడిలాగే ఉన్నావురా ''

రాఘవ మాటలకు నవ్వేను ఖరీదైన బట్టలు, ఆహారం నా వయసును దాస్తున్నాయి

ఎదురెదురుగా కూర్చున్నాం రాఘవ ఏదో మాట్లాడుతున్నాడు నేను మాత్రం ఇల్లంతటిని పరిశీలిస్తున్నాను గదులన్నిటిలోను లైట్లు వెలుగుతున్నాయిగాని ఎవరూ బయటకు వచ్చిన జాడలేవీ కనిపించడంలేదు

''మాటల్లో అడగడం మరచిపోయాను భోజనం చేసావా లేదా చేయకపోతే చెప్పు రెండు నిముషాల్లో సిద్ధం చేస్తాను ''

నిజంగా భోజనం చేయలేదు అయితే అర్ధరాత్రివేళ రాఘవకు ఇబ్బంది పెట్టడం ఎందుకనుకున్నా వాడిదగ్గర అబద్ధం చెప్పడం ఇష్టంలేక భోజనం చేయలేదనే చెప్పాను

రాఘవ గిలగబ వంట గదిలోకి వెళ్ళాడు

నాకంతా ఆశ్చర్యంగా ఉంది ఇంట్లో ఎవరూ లేరా ఆ ఇంట్లో నాకున్న చనువుచేత ప్రతి గది దగ్గరకు వెళ్ళి తొంగిచూసాను ప్రతి గదిలో మంచాలు, కుర్చీలు ఉన్నాయిగానీ ఎవరూ లేరు వంట గది దగ్గరకు వెళ్ళాను రాఘవ ఎసరులో బియ్యం వేస్తున్నాడు రాఘవనే కళ్ళార్పకుండా చూస్తూ నిలబడ్డాను

''ఏరా ఇల్లంతా నిశ్శబ్దంగా ఉందేమిటిరా '' నెమ్మదిగా అడిగాను

రాఘవ నవ్వాడు పెదవులపై కృత్రిమంగా నిలిచిన నవ్వది

వంటయింతర్వాత భోజనం వడ్డించాడు నేను తింటుంటె తృప్తిగా చూస్తున్నాడు రాఘవ

భోజనం అయ్యేక గదిలోకి వచ్చి కూర్చున్నాం

''ఏరా అందరూ ఏమయ్యారు ''

''ఎవరు ఉంటారు రెక్కలు వచ్చింతర్వాత పిల్లలు ఎగిరిపోయారు జీవితాంతం తోడుగ ఉండే భార్య మధ్యలోనే ఆయుస్సు అయిపోయి నన్ను ఒంటరిగ విడిచి పరలోకానికి వెళ్ళిపోయింది ''

రాఘవ కళ్ళల్లో నీళ్ళు

రాఘవ ఏ స్థితిలో ఉన్నాడో ఆ రెండు మాటలతో తెలిసిపోయింది నాకు

''పెద్దాడు ఎమ్మె చదివి లెక్చరరు ఉద్యోగం సంపాదించి ఈ ఊరు మునసబు కూతురును ప్రేమించి పెళ్లి చేసుకున్నాడు ఇల్లరికం షరతు మీద పెళ్ళికి ఒప్పుకున్నాడు వెళ్ళిపోయాడు రెండోవాడు డిగ్రి పాసయి పై ఊర్లో ఉద్యోగం చేస్తున్నాడు మూడోవాడు ఈ ఊర్లోనే మరో ఇంటిలో ఉంటూ వ్యవసాయం చేసుకుంటున్నాడు ఎవరి దారి వారు చూసుకున్నారు పెళ్ళికాక ముందు ఎలా ఒంటరిగా ఉన్నానో ఇప్పుడూ అలాగే ఉన్నాను మధ్య వచ్చిన వాళ్ళు మధ్యలోనే వెళ్ళిపోయారు ''

ఊర్లోనే ఉంటూ తండ్రిని ఒంటరిగా వదిలేసారు కొడుకులు ఎందుకిలా జరిగింది అదే అడిగాను రాఘవ సమాధానం చెప్పకుండా చాలా టైమయింది పడుకొమ్మని చెప్పి మంచంవేసి తనూ పడుకున్నాడు

నేనెందుకు వచ్చాను నా విజయాన్ని చెప్పి రాఘవ మెప్పు పొందాలని కానీ జీవితంలో పూర్తిగ ఓడిపోయి ఒంటరి జీవితం అనుభ








నవ్యసాహితీ సమితి ఆధ్వర్యంలో ఇటీవల బందరులో జరిగిన కవయిత్రుల సమ్మేళనంలో అధ్యక్షోపన్యాసం యిస్తున్న కుమారి వాసిరెడ్డి సీతాదేవి. మంగళగిరి ప్రమీలాదేవి, సి. వేదవతి, శాసనసభ్యు రాలు శ్రీమతి నన్నపనేని రాజకుమారి, డి. సుజాతాదేవిగార్లని కూడా చిత్రంలో చూడవచ్చు.

విస్తున్న రాఘవను చూసేసరికి నా ఆనందమంతా నీరుగారి పోయింది.

రాఘవ నిద్రపోయాడు. నాకు నిద్ర కరువయింది. మంచం మీంచిలేచి ఒక్కొక్క గదిలోకి వెళ్ళాను. ఒక గదిలో టేబిలు మీద చిందర వందరగా పడి ఉన్న ఉత్తరాలు నా కంట పడ్డాయి. పరాయి వాళ్ళ లెటర్సు చదవకూడదని తెలిసినా రాఘవ గురించి పూర్తిగ తెలుసుకోవాలన్న ఉద్దేశ్యంతో వాటిని చేతుల్లోకి తీసుకున్నాను.

కొడుకులు వ్రాసిన ఉత్తరాలవి.

ఒక్కొక్క ఉత్తరం చదువుతుంటె నా గుండె బరువయింది. నాకే ఇంత బాధనిపిస్తుందే రాఘవ ఎంతగా కుమిలిపోయాడో ...

పిల్లల చదువులకని చాలా పొలం అమ్మేసాడు. ఉన్న పొలంను తన వాటా అంటూ మూడో కొడుకు చేజిక్కించుకున్నాడు. ఉద్యోగాలు చేస్తున్న కొడుకులు తల్లి పోగానే ఉన్న ఇల్లు అమ్మేసి తమ దగ్గరకు వచ్చేయమంటున్నారు. వాళ్ళకు కావలసింది తండ్రికాదు...ఆస్తి ... ఇంకా ఏం మిగులుంది ?

టేబిలంతా వెదికాను. మరో విషయం తెలిసింది. ఇంటి మీద చాలా అప్పలున్నాయి.

నా కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి.

రాఘవ ఏ స్థితిలో ఉన్నాడు ?

కొడుకులను తన ఆశయాలమేరకు చదివించి ఉన్నత స్థితికి తీసుకొచ్చాడు. కొడుకులు తనను ఉద్ధరిస్తారన్న ఆశతో తన కున్న దంతటినీ ధారపోసి పెంచాడు. కానీ వాళ్ళేం చేసారు ? డబ్బు వ్యామోహంతో అంతా దోచి తండ్రిని ఏకాకిని చేసి ఎవరి దారంట వాళ్ళు వెళ్ళిపోయారు.

తనే దారి కోసం పరుగులు తీస్తానంటే వద్దని చెప్పి హితవు చేసిన రాఘవ ఎక్కడున్నాడు ? ఉన్నదాంతో సుఖంగా ఉండమని, దాంట్లోనే సంతృప్తి ఉందని చెప్పిన రాఘవ ఏ ఆశయంతో కుటుంబాన్ని నెట్టుకొచ్చాడో చివరకు ఏ స్థితికి దిగజారిపోయాడోచూస్తుంటే ఈ సమాజంలో ఉన్నత స్థాయికి చేరుకోడానికి పరుగులు తీయడంలో తప్పులేదనిపిస్తుంది. ఈ పరుగులో గెలిచినా... ఓడినా... అన్న పట్టుదలే విజయానికే దారి తీసింది.

ఈ విషయం ఈ స్థితిలో రాఘవకు చెప్పగలడాతను. చెప్పితే దెప్పిపొడిచినట్లుంటుంది. అయితే తన కర్తవ్యం ఏమిటి ? రాఘవకు సహాయం చెయ్యడమే.

బేగ్‌లోంచి డబ్బుతీసి టేబిల్లో ఉంచాను.

''రాఘవా... ఆ రోజు నేను ఈ ఊరు విడిచి వెడతానంటే ఆపడానికి ఎంతో ప్రయత్నించావు. నిజంగా నీ మాట విని ఆరోజు ఆగితే నేను కూడా నీ స్థితిలో ఉండేవాడిని. ఏంసాధించే వాడిని. ఈ రోజు సంఘంలో నేను ఉన్నత స్థితిలో ఉన్నాను. ఏ ఆశయంమేర నువ్వు ఉన్నదాంతో సుఖంగా ఉండాలని కోరుకున్నావో ఆ సుఖం నీకు ఎంతవరకు ఫలించింది. కొడుకులు అన్యాయం చేసారు...అప్పల పాలయ్యావు.

రాఘవా... ఇరవై ఏళ్ళ తర్వాత నేను నీ దగ్గరకు ఎందుకు వచ్చానో తెలుసా... నా విజయాన్ని నీకుచెప్పి నువ్వు సంతోషిస్తావని, నీ అభినందనలు అందుకుందామనీ వచ్చాను. కానీ నువ్వు ఏ స్థితిలో ఉన్నావో, ఎలా ఉన్నావో చూసేసరికి నా గెలుపును మరచిపోయాను. నీకు సహాయంచేసి నిన్నొక ఒడ్డుకు తీసుకురావడమే మిత్రుడిగా నా కర్తవ్యం. అయితే వ్యక్తిత్వమున్న మనిషివి. ఎవరి దయా దాక్షిణ్యాలు ఆశించవు. అందుకే ఈ డబ్బును నీ చేతికి ఇవ్వలేక టేబిల్లో ఉంచుతున్నాను. నన్ను అపార్థం చేసుకోకుండా ఈ డబ్బు తీసుకుని అప్పలు తీర్చు. నువ్వు ఏ సమయంలో వచ్చినా నా గుండెల్లో దాచుకుంటాను. నువ్వు ఈ వయసులో ఏ ప్రేమకోసం తపిస్తున్నావో ఆ ప్రేమను నేనూ, నా భార్యా పిల్లలు నీకు అందిస్తారు. నన్ను అర్థం చేసుకుంటావని ఆశిస్తున్నాను.''

రాసిన కాగితాన్ని డబ్బు దగ్గరఉంచి తేలిక పడిన హృదయంతో గదిలోంచి బయటకు వచ్చాను.

ఏ తెల్లవారు జామునో నిద్ర పట్టింది.

మర్నాడు సాయంత్రంవరకు ఉండి వెళతానని చెప్పాను.

బస్సు ఎక్కుతున్నప్పుడు రాఘవను చూసాను.

కండువాతో కన్నీటిని తుడుచుకుంటున్నాడు రాఘవ.

బస్సు కనుమరుగయ్యేవరకు రోడ్డుమీద

## స్పృహ

నేను నా జీవితానికి రాజీనామా ఇచ్చి
మరణం వైపు ప్రయాణిస్తుండగా
ఎవరో పిలిచినట్లయింది
వెనక్కితిరిగి చూసాను
శూన్యం నన్ను పలకరించింది—
లోకం —
క్రినీడల పాన్పు మీద
నగ్నంగా నిద్రపోతోంది—
సంఘం—
రాజ(కీయ) భోగాల్లో మత్తెక్కి
నాసిరకం నినాదాలు ఆలాపిస్తూ
మానవజీవిత చరిత్రనే చెరుస్తోంది —
ఊపిరి లేని మూగజనం
వదనాల్లో వేదనలు మండి
అంతరాత్మాహుతి చేసుకొంటున్నారు —
నారి సజీవ సమాధుల్లో
వెలిగించిన దీపాల వెచ్చదనం
శీతలం కమ్మిన నా శ్వాసకోశంలోకి ప్రాకి
నన్ను బ్రతకమంటోంది— అందుకే
నా మరణాన్ని మరోసారి వాయిదా వేసుకుని
వయస్సును తిరగబడ్డ మనస్సుతో
నింపుకుని
తమస్సును చీల్చుకుంటు
ఉషస్సులోకి సాగిపోతున్నా

— ప్రేమ్‌జీవ్

# ధర్మపథం —

—బులుసు వేంకటరమణయ్య

## కుంభకర్ణుని నిద్ర



మంచి పనికోసం ప్రయత్నంచేస్తే దైవం దానికి సహాయపడుతుంది దానిని ప్రజలు ఆమోదిస్తారు దురుద్దేశంతో ఎంత గొప్ప కృషి చేసినా దైవం అనుకూలించదు విపరీతమైన ఫలితం ఉండవచ్చు

రాక్షసులలో క్రూర స్వభావులు రావణ, కుంభకర్ణులు పరులను హింసించడమే వారి పరమ లక్ష్యం ముల్లోకాలకూ, వారంటే విపరీతమైన భయం వారిద్దరూ బ్రహ్మను గురించి మిక్కిలి ఘోరమైన తపస్సు చేశారు బ్రహ్మ ప్రత్యక్షంకాగా, రావణుడు, మనుష్యులు మినహా యితరులవల్ల తనకు మరణం కలుగు కూడదని వరం కోరగా, బ్రహ్మ ఆ వరాన్ని ఇచ్చాడు ఇక, కుంభకర్ణుడి వద్దకు వచ్చి వరం ఇవ్వడానికి సిద్ధపడ్డాడు

కుంభకర్ణుడు మిక్కిలి క్రూరుడు అతడు ప్రజలను హింసించడమే కాదు కొండ వలె ఉన్న ఆ స్థూలకాయుడు ఎందరినో మింగివేశాడు సహజంగా దయాహీనుడైన ఆ క్రూరుడు, తనకు నిర్దయత్వం కావాలనే కోరికతో తపస్సు చేశాడు అతని స్వభావాన్ని గ్రహించిన దేవతలు బ్రహ్మ వద్దకు పోయి ''దేవా! మహాక్రూరుడైన యీ కుంభకర్ణునికి, వాడు కోరిన వరం యిస్తే యీ లోకాలనే మింగివేస్తాడు వాని బాధలు ఎవ్వరూ భరించలేరు నీవు వానిని మాయలో దింపి, వరం పేరిట— ఏదో— లోకానికి హాని కలగనిది యిచ్చి మమ్మల్ని కాపాడవలెను'' అని ప్రార్థించారు బ్రహ్మ ఆలోచించి, సరస్వతీ దేవి వైపు చూచి ''నీవు వాగ్దేవివి కదా! కుంభకర్ణుడి నాలుకపై నిలిచి, వాని సంకల్పానికి విరుద్ధంగా పలికేటట్లు చెయ్యి'' అని అన్నాడు ఆమె ''అట్లే'' అని తల ఊపింది తర్వాత బ్రహ్మ కుంభకర్ణుడివద్దకు వచ్చి ''నీ తపస్సునకు మెచ్చాను ఏమి కావాలో కోరుకో'' అని అన్నాడు ఆ రాక్షసుడు ''నిర్దయ''ను అడుగుదామని మనస్సులో అనుకున్నా, అడిగేటప్పుడు ''నిద్ర''అనేమాట నోటినుండి బయటికి వచ్చింది బ్రహ్మ సంతోషంతో ''సరే! ఆరు నెలలు నిద్రపో లేచి ఒక్కసారిగా అంత భోజనంచేసి, మర్నాటి నుండి మళ్లీ నిద్రపో'' అని చెప్పి అంతర్ధానమైనాడు పని ముగించుకుని సరస్వతీదేవి కూడా వెళ్లిపోయింది ఆ పిదప కుంభకర్ణుడు తాను తప్పగా అడిగినట్లు గ్రహించి నాలుక కరుచుకొన్నాడు మనం గట్టి ప్రయత్నం చేసినా, దైవం అనుకూలంగాలేనప్పుడు ఏం చేస్తాం''మని అనుకున్నాడు ఇందులో దేవ మాయ ఉన్నదని ఊహించి వారిపైని ఎక్కువ పగ పూనినాడు 

అలాగే నిలబడిఉన్న రాఘవను చూస్తూ ఆలాగే బస్సులో నిలబడిపోయాను

*   *   *

ఇంటికొచ్చిన రెండ్రోజులకు లెటర్‌పేడ్ కోసం బేగ్ తెరిచాను నా కళ్ళను నేనే నమ్మలేక పోయాను

రాఘవ టేబిల్లో ఉంచిన డబ్బు నా బేగ్‌లో ఉంది

ఒక లెటరు

గబ గబ చదివాను

''ఒరేయ్ నువ్వు గదిలోకి వెళ్ళి లెటర్లు చదవడం, నా గురించి చాలా సేపు నువ్వు బాధ పడడం, డబ్బును ఉంచడం అన్నీ గమనించాను మిత్రుడిగా నీవు నీ తాహతుకు తగినట్లుగా నన్ను ఆదుకోవడం సమంజసమే కానీ జీవితంలో పూర్తిగ ఓడిపోయి రేపో మాపో చావడానికి సిద్ధంగా ఉన్న నేను కష్టాలను దాటి మళ్ళీ బ్రతకాలనుకోవడం నాకిష్టంలేదు అందుకే నీ సహాయాన్ని తిరస్కరిస్తున్నాను

నువ్వు ఎందుకు వచ్చావో నాకు తెలుసు నువ్వు ప్రతి మెట్టు ఎక్కుతున్నప్పుడు సాధించే ప్రతి విజయం నాకు ఎప్పటికప్పుడు తెలుస్తూనే ఉంది ఎంతో గర్వపడేవాడిని

లెటరులో నువ్వు రాసినట్లు ఆరోజు నేను ఆపినప్పుడు నువ్వు ఆగిపోతే నాలాగే ఉండేవాడివి

## వైకుంఠపాళి

ఏ ఆశయాలను నమ్ముకుని ఇలా ఉండిపోయానో అవే నన్ను కాటేసాయి ప్రతి మనిషి తనున్న స్థితి నుండి ముందుకు దూసుకుపోవడమే సాహసం చెయ్యాలి ఈ విషయంలో నువ్వు గెలిచావు

ఒరేయ్ జీవితం వైకుంఠపాళి కష్టాల పాములు, సుఖాల నిచ్చెనలు ప్రతి మనిషికి ఎదురవుతాయి ఎత్తుమీద ఎత్తువేసి పాము నోట్లో పడకుండా నిచ్చెన ఎక్కడానికే ప్రయత్నించాలి

జీవితం ప్రారంభంలో నువ్వూ, నేనూ ఒక దగ్గర నుండే బయలుదేరాం కానీ నువ్వు ఒక్కొక్క గడి దాటుకుని గబగబ ముందుకు వెళ్ళిపోయావు నేను కష్టాలు దాటుకుని కొంత దూరం మాత్రమే వెళ్ళాను కొంత దూరం వెళ్ళేసరికి గడి దాటడమే కష్టమనిపించింది దాటినా సరిగ్గా పాము నోట్లో పడేవాడిని మళ్ళీ మొదలు ఆలాగే పడుతూ లేస్తూ, లేస్తూ పడుతూ నడుస్తున్నాను నువ్వు నిచ్చెన మీద నిచ్చెన ఎక్కుతూ పైకంటూ వెళ్ళిపోయావు నీ ధైర్యం, నీ పట్టుదలే నిన్ను అందలం ఎక్కించాయి

కొడుకులు అన్యాయం చేశారు అప్పల పాలయ్యాను ఇల్లు మిగలింది ఇంటిమీద అప్పులు రెండ్రోజుల్లో ఈ ఇల్లు నాది కాదు నాల్రోజుల క్రితమే కోర్టువారు నోటీసు పంపించారు వేలంకు ఇల్లును అమ్మేసి తమ దగ్గరకు వచ్చేయమన్న కొడుకులు ఇల్లుకాస్త అప్పులవాళ్ళకు జప్తు చేయబడుతుందని తెలిసి నా గురించి పట్టించుకోవడం మానేసారు ఇల్లు వేలం వేయబడింతర్వాత ఎక్కడుంటాను బిక్షాందేహీ అంటూ కొడుకులను ఆశ్రయించలేను అందుకె వేలం వేయబడిన క్షణాలకు నన్ను నేను చంపుకోవాలని నిర్ణయించుకున్నాను

నువ్వు ఈ ఊరు వచ్చావు మర్నాడే వేలం

బహుశా ఈ ఉత్తరం నీవు చదివేటప్పటికి నా ప్రాణాలు అనంతవాయువుల్లో కలిసిపోయి ఉండొచ్చు

వైకుంఠపాళిలా నరకానికి తోసివేసే పెద్ద పాము కోరల్లో చిక్కుకున్నాను ఎలా తప్పించుకుంటాను నిజానికి తప్పించుకోవాలనే తపన కూడా లేదు

నీ విజయానికి మనస్ఫూర్తిగా అభినందిస్తూ, నువ్వింకా ముందుకు వెళ్ళాలని ఆశిస్తూ సెలవు తీసుకుంటున్న,

మిత్రుడు — నీ

రాఘవ ★

# విడవకుండా వచ్చే దగ్గుకు ఉపశాంతి ఇస్తుంది



## విక్స్ ఫార్ములా 44 కాఫ్ డిస్క్




**ప్రత్యేక పదార్థం సైలెంటియం కలిగిన ఏకైక కాఫ్ లాజెంజ్**

సైలెంటియం విడవకుండా వచ్చే దగ్గుకు శీఘ్ర ఉపశమనం ఇస్తుంది దీనితోపాటు ఫార్ములా 44 కాఫ్ డిస్క్—

- దగ్గు క్రిములను నాశనం చేస్తుంది
- గొంతు నొప్పినుండి ఉపశమనం ఇస్తుంది
- శ్వాస తీసుకోవడాన్ని సులభం చేస్తుంది




మందులాంటి రుచి మందులాంటి పని

CASRH-19-244 TEL

# స్వాతి జల్లు

## సీరియల్

## రావినూతల సువర్ణ కన్నన్

(గత సంచిక తరువాయి)

ఆ రోజు ఆదివారం!

అనుకున్న ప్రకారం అత్త పర్మిషన్‌తో వాసంతి ప్రతాప్‌తో సినిమా కెళ్ళొచ్చి దగ్గర్లో ఉన్న హోటల్లో టిఫిన్ తింటూ మధురమైన ఫ్యూచర్ని తల్చుకుని మురిసిపోతోంది

"అబ్బ! నీలో నువ్వే మురిసిపోకపోతే అదేమిటో నాక్కూడా కాస్త చెప్పకూడదూ?" ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుంటూ అన్నాడు ప్రతాప్

తృప్తిపడిన వాసంతి సున్నితంగా తన చేతిని లాక్కుంది అది ఫేమిలీ రూం! తాము తప్ప మరెవ్వరూ లేరు పెళ్ళయ్యేదాకా హద్దులు దాటనని అత్తకిచ్చిన మాట ఆమెకి బాగా జ్ఞాపకం ఉంది

చేతిని ముట్టుకుంటే తన పాతివ్రత్యం చెడిపోతుందని ఎంత మాత్రం కాదు కానీ దానికి అవకాశం ఇస్తే ఇంక కాస్త ముందుకు వెళ్ళడని గ్యారంటీ ఏమిటి?" అందుకే కేవలం స్నేహితుల్లా మాత్రమే మసలుతోందామె

అది కాస్త చిరాకనిపించినా "తప్పదు మరి!" అనుకున్నాడు ప్రతాప్

"అన్నట్టు ప్రతాప్! ఓ గుడ్ న్యూస్!" హఠాత్తుగా అంది వాసంతి

"ఏమిటి?" కుతూహలంగా చూశాడు ప్రతాప్

"చెప్పకో చూద్దాం!"

"మన పెళ్ళికి చెవర్లెట్ కారు బహూకరించబోతోంది మీ అత్త!"

"ఛ! కాదు!" చేదు తిన్నట్టు పెట్టింది ముఖాన్ని వాసంతి

"అయితే మన హనీమూన్ ట్రిప్‌లో వరల్డంతా తిరిగిరమ్మని ఉంటుంది! నిజంగా మీ అత్తది మంచి టేస్ట్!" మెచ్చుకున్నాడు ప్రతాప్

అతని ఊహలకి కాస్త తెల్లబోయిన వాసంతి

"నో! నో! అవేం కాదు! వీటి అన్నింటికన్న తియ్యని వార్త! మనం ఎవరం కలలో కూడా ఊహించని మధురాతి మధురమైన వార్త!" అంది తన్మయత్వంగా

ప్రతాప్ ఊహ కందలేదా వార్త

"వీటన్నింటికన్న మంచి వార్త ఏమిటబ్బా? ఆ! తెలిసింది! ఆవిడ బిజినెస్ అంతా మన చేతుల్లో పెట్టేసి నన్ను ఉద్యోగానికి రాజీనామా చేసి బిజినెస్ గొడవంతా నన్ను చూసుకోమని ఉంటుంది! యామై కరెక్ట్?" ఉత్సాహంగా అన్నాడు

అతని ఊహలకి వాసంతి ముఖం పాలిపోయిందో క్షణం ఇంకా అలాగే ఉంటే ఇంకేం ఊహిస్తాడో అన్న భయంతో తేరుకుని, చిన్నగా నవ్వేసి "ఓడిపోయావ్! నేనే చెప్పేస్తున్నాను విను! మా అత్త కుమారి మాధవి"

"ఆఁ కుమారి మాధవి?"

"విను మరి! కుమారి మాధవి త్వరలో శ్రీమతి మాధవి కాబోతోంది"

"ఆఁ?" పిడుగు పడ్డట్టు చూశాడు ప్రతాప్

**జరిగిన కథ—2** • కొన్ని వ్యాపార సంస్థలకు యజమానురాలయిన మాధవికి మేనకోడలు వాసంతి వాసంతి, ప్రతాప్‌ల ప్రేమ ఉదంతం తెలుసుకొన్న మాధవి ప్రతాప్‌ను తమ ఇంటికి తీసుకొనిరమ్మని వాసంతితో చెపుతుంది ప్రతాప్‌ను చూసిన మాధవి తన మేనకోడలి సెలక్షను బాగుందని మనస్సులోనే మెచ్చుకొంటుంది ప్రతాప్ అన్న రాజారావని తెలుసుకొని, ఈ పెళ్లి జరగదని వాసంతితో చెపుతుంది తను పెళ్లి చేసుకోవాలనుకుంటున్నట్లు వాసంతితో చెపుతుంది మాధవి ప్రతాప్, వాసంతిలు తను పట్టుదలలు వదలకపోవడంతో వారి పెళ్లికి అంగీకరిస్తుంది మాధవి

"అవును ప్రతాప్! నేనూ అలాగే తెల్లబోయాను! పెళ్ళంటే మండిపడే అత్త! జీవితంలో పెళ్ళే చేసుకోను! నువ్వే నా కూతురివనుకుంటాను, అన్న అత్త అంతెందుకు మగాళ్ళంటేనే ఒక రకంగా చిరాకుపడే అత్త ఇప్పుడు గృహిణి కాబోతోందంటే అంతకన్న ఆనందకరమైన విషయం ఏముంటుంది?" మనస్ఫూర్తిగా అంది వాసంతి

"షా! జోక్!"

"ఛ! ఛ! వేళాకోళం కాదు ప్రతాప్! నిజంగానే అత్త పెళ్ళి చేసుకుంటుందట! స్వయంగా నాతోనే చెప్పింది! ఆవిడ పెళ్ళయ్యాకే మన పెళ్ళి"

"వరుడెవరు?" తేరుకుని అన్నాడు ప్రతాప్

"అది చెప్పలేదు వీలు చూసుకుని మెల్లగా చెప్తానంది! ఆవిడ మనసులో ఎవరో ఉన్నారనుకుంటాను నిజంగా ఆయన్ని అభినందించాలి! అత్తలో మార్పు తెచ్చినందుకు

అసలు ఇప్పుడు అత్త ఎంత ఆనందంగా ఉందో తెలుసా? ఇన్నాళ్ళకి తాను గృహిణి కాబోతోందనే ఆనందంకన్న తను ప్రాణప్రదంగా చూసుకునే నన్ను, కట్నాన్ని తృణప్రాయంగా భావించే ఈ హీరో చేసుకోబోతున్నాడనే ఎక్కువ ఆనందిస్తోంది!" ఆరాధనగా అంది వాసంతి

"అరె! చాలా టైమయిందే! మైగాడ్! అర్జంట్‌గా ఓ ఫ్రెండ్ రమ్మన్నాడు ఆ సంగతే గుర్తులేదు!" చటుక్కున లేచాడు ప్రతాప్

అయ్యో! అప్పుడేనా?" గుణిసింది వాసంతి

"సారీ! వాసంతీ అతనితో ముఖ్యమైన విషయాన్ని గురించి చర్చించాలి! మరోసారి కలుద్దాం!" నాలుగడుగులు వేస్తూ అన్నాడు ప్రతాప్

తప్పనిసరిగా లతన్నను ంరించింది వాసంతి

* * *

"వసూ! ప్రతాప్, నువ్వూ ఏదైనా మాటా, మాటా అనుకున్నారా? అతనూ రావడం లేదు, నువ్వూ కాలేజీ, ఇల్లు తప్ప మరోచోటికి వెళ్ళినట్టు లేదు!" అమాయకంగా అడిగింది మాధవి

"ఏమో అత్తా! ఎప్పుడూ పదే పదే ఫోన్ చేసేవాడు అజాపజా లేడు, పోనీ అని నేనే ఫోన్ చేశాను కానీ ఎన్నిసార్లు చేసినా అతను దొరకనే లేదు వాళ్ళ అన్నగారు కూడా అదోలా మాట్లాడారు" గుడ్లనీరు గుడ్ల కుక్కుకుంటూ అంటున్న ఆ పిల్లని చూస్తే జాలేసింది మాధవికి

"ఊళ్ళో లేడేమో! పోనీ నువ్వే ఓసారి వాళ్ళింటికి వెళ్లిరాకూడదూ! ఒక్కసారీ వాళ్ళింటికి నువ్వు రాలేదని అతను అలిగాడేమో! అందుకే నువ్వోసారి వాళ్ళింటికి వెళ్ళిం! మన పురోహితుడుగార్ని రమ్మని కబురు చేశాను ఆయన వచ్చాక మంచిరోజు నిర్ణయించి చేసు

కూడా రాజారావుగారికి ఫోన్ చేస్తాను!'' ధైర్యం చెప్పింది.

అత్త మాటలకి ముఖం వికసించిన వాసంతి ఆ సాయంత్రమే ప్రతాప్ ఇంటికేసి బయల్దేరింది.

రాజారావు వాసంతిని చూసి ముందు తెల్లబోయాడు. వెంటనే తేరుకుని ''ప్రతాప్ ఇంట్లో లేడు'' ముభావంగా అనేసి బయటికెళ్ళిపోయాడు.

అతని ప్రవర్తనకి బిత్తరపోయిన వాసంతి, ఎప్పుడొస్తాడో తెలుసాండీ?'' అంది అతని వదినని ఉద్దేశించి.

ఆ పిల్ల ఎవరో గ్రహించిన రాజారావు భార్య ''తెలియదు! అయినా నీకతనితో పనేమిటి?'' కొట్టినట్లే అంది.

తెల్లబోయింది వాసంతి.




''నా పేరు ... వాసంతి!'' గొణిగింది.

''అయితే ... ?''

''అదే ... నేను, ప్రతాప్ ప్రేమించుకున్నాం!'' ఈ మాట అంటున్నప్పుడు ఆమె కళ్ళు రెండూ నీటితో నిండుకున్నాయి.

''ఏమిటీ? ... ప్రేమించుకున్నారా? ... అందుకేనా మీ అత్త 'ఆస్తిపాస్తులు లేనివాడికి మా పిల్లనివ్వం!' అంటూ అప్పుడు ఆస్తి ఉన్న ఓ డాక్టర్ని కుదిర్చిందట?'' విసురుగా అందామె.

''ఏమిటి?''

''ఆహా! ఎంత నంగనాచివి! నీకు తెలియకుండానే నీ అభిప్రాయం తెలుసుకోకుండానే ఆవిడగారే సంబంధం కుదిర్చిందంటావ్! అది నన్ను నమ్మమంటావ్!'' ఈసడించి పారేస్తున్న ఆవిణ్ణే చూసి తల తిరిగిపోయింది వాసంతికి.

''ఏమంటున్నారు మీరు?'' ఎన్నడు అడగనంత గట్టిగా అడిగింది.

''ఇదిగో పిల్లా! అనడానికీ, చెప్పడానికీ ఇంకేం మిగల్లేదు! ఇక ముందు మీకూ, మాకూ ఎలాంటి సంబంధంలేదు. మా మరిదికి లక్ష రూపాయల కట్నంతో ఓ గొప్పింటి పిల్ల రాబోతూంది. ఇంక అతనిమీద ఆశ వదులుకుని మీ అత్త చెప్పిన ఆ డాక్టర్గాణ్ణే కట్టుకో!'' పరమ గయ్యాళిలా అరిచింది ప్రతాప్ వదిన.

''ప్రతా...ప్‌కి... తెలుసా?'' లోగొంతుతో అంది.

''ఆహా! అతనికి తెలియకుండా నిర్ణయించాల్సిన అవసరం మాకేమిటి? మీ ఇష్టమే మా ఇష్టం! అని అతనెప్పుడో చెప్పాడు'' గర్వంగా అంది.

ఇంక ఆవిడతో మాట్లాడి ప్రయోజనం లేదనుకున్న వాసంతి ఎలాగో తూలిపోతూ ఇల్లు చేరింది.

ఆ పిల్ల మనసంతా రాయిలా అయిపోయింది.

''ఏమైంది వసూ! అతను ఇంట్లోనే ఉన్నాడా? ఎందుకు రాలేదట?'' వాసంతి ఇంట్లోకి రాగానే ఆదుర్దాగా అడిగింది మాధవి.



ఇటీవల బొబ్బిలి వృత్తి కళాకారుల సమాఖ్య కార్యదర్శి శ్రీ లక్ష్మీనాథ్ ఏర్పాటు చేసిన సన్మాన సభలో శ్రీమతి జమున ముఖ్య అతిథిగా విచ్చేసి కళాకారుడు శ్రీ పి. సోమరాజును సత్కరిస్తున్న దృశ్యం.

---

"నువ్వు ఆశించినట్టే అయింది!" పదునుగా ఉందామె గొంతు.

"ఏమిటి ... ?" తెల్లబోయింది మాధవి.

"అంతా తెలిసీ, ఏం తెలియనట్లు అలా నటించడానికి నీకు సిగ్గనిపించడంలేదూ ? "

"వసూ ! " పిడుగు పడ్డట్టు చూసింది మాధవి.

"ఏమిటత్తా ! ఇదంతా చేసింది నువ్వు కాదూ ? "

నేనా ? "

"మరి...?...నేనా ?"

ఊఁ...సరే! విషయం చెప్పు! అతను నిన్ను పెళ్లి చేసుకోనన్నాడా ? " శాంతంగా అంది మాధవి.

"లేదు ! ... అతనసలు ఇంట్లోనే లేదు ! నాతో మాట్లాడటానిగ్గానీ, నా ముందుకు రావడానికిగానీ అతనికి ముఖం చెల్లడంలేదు. ఏ మగాడికైనా ఇంతకన్న అవమానం ఏం కావాలి ? " ఆవేశంగా అంది వాసంతి.

మాధవికి కోపం రాలేదు సరిగదా చచ్చే నవ్వొచ్చింది. అందుకే పలమారే దాకా నవ్వింది.

"ఛీ ! ఎందుకా నవ్వు ? అసలు నీకు మొదట్నించి ప్రతాప్ వాళ్లంటే ఇష్టంలేదు. ఎలాగైనా ఇది తప్పించాలని చూశావ్ ! నేను ఒప్పుకోలేదు. నాకోసం నీ మనసు మార్చుకుంటున్నట్టు నటించావ్ ! తీరా పెళ్లికి సిద్ధపడ్డాక అడ్డుపుల్ల వేశావ్ ! "

వాసంతి వాగ్ధాటికి విస్తుపోయింది మాధవి.

"వసూ ! " అంది. అంతకన్న మరోమాట ఆమె నోట రాలేదు.

"ఎందుకా నటన ? నాకో డాక్టర్‌తో పెళ్లి నిశ్చయం అయిందనీ, ఆస్తిపాస్తులు లేని నీకివ్వనని ప్రతాప్‌కి ఫోన్‌లో చెప్పలేదూ ? ఇది పెళ్లి చెడగొట్టటం కాక మరేమిటి ?

అవున్లే ! ప్రేమ, పెళ్లి లాంటివి నీకెలా తెలుస్తాయి ! నీకే వాటి విలువ తెలిస్తే నిన్ను హృదయ పూర్వకంగా ప్రేమించిన ధర్మరాజు లాంటి ఆ రాజారావు గార్ని కాలదన్నుకుని నిండైన నీ జీవితాన్ని చీకటి పాలు కానిచ్చేదానివే కాదు...అందు..."

"అంతే ! ఆమె మాట పూర్తికానేలేదు— మాధవి కళ్లు అగ్ని వర్షించాయి. ఆమె చేయి వాసంతి రెండు చెంపల్నీ టపటప వాయించేసింది.

"పాపిష్ఠిదానా ఎవడే ఆ ధర్మరాజు ? ... ఆ ధర్మరాజు గురించి నీకేంతెలుసే ? ... తల్లి కరువై, అల్లాడిపోతున్న పసిపిల్లని అక్కున చేర్చుకుని, కొండంత పెద్దరికం నెత్తినేసుకుని అల్లారుముద్దుగా పెంచి ఇంత దాన్ని చేసిన నాకన్నా ఒక్క నెల రోజుల పరిచయంతో, నీ ఆస్తంతా కాజెయ్యాలనుకుని, తీరా నేను పెళ్ళాడబోతున్నానని తెలిసి నిరాశతో పారిపోయే ఆ అన్నదమ్ములే ఎక్కువయ్యారా ? ... పాముకు పాలు పోసి పెంచానే విశ్వాస ఘాతుకరాలా !" క్రోధాన్ని వెదజల్లుతూ ఒక్కతోపు తోసి, ఆ పిల్ల మంచంమీద పడగానే అసహ్యంగా ఓ చూపు చూసి చరచరా తన గదిలోకెళ్ళి తలుపు బిగించుకుంది మాధవి.

జరిగిందేమిటో అర్థమయ్యేసరికి వాసంతి వెన్నులోంచి ఒణుకు వచ్చేసింది. వాచిపోయిన చెంపలమీద చేతులుంచుకుని అలాగే కూర్చుండి పోయింది.

మంగమ్మగారు కాఫీ, టిఫిన్ చేసి ఏ రూముకీ అత్తా కోడళ్ళిద్దరూ రాకపోవడంతో పడుతూ లేస్తూ తనే మేడమీదికెళ్ళి మాధవి గది తలుపు తట్టి ఆమె పలక్కపోయేసరికి వాసంతి గదిలోకొచ్చింది.

వాసంతి ముఖం చూసి క్షణం తెల్లబోయిన మంగమ్మగారు "ఏమైంది వాసమ్మా?" అంది అప్యాయంగా. ఆవిడ వాసంతి నలాగే పిలుస్తుంది.

"అత్తకి .. అత్తకి కోపం వచ్చింది మంగమ్మగారూ !" దుఃఖం సుళ్ళు తిరిగే గొంతుతో అంది వాసంతి.

"కోపమా ? ఎందుకు ?" అంది. ఇటీవల మాధవిలోని మార్పు ఆవిడ కూడా గమనించింది.

"నా మూలంగానే !"

"నీ మూలంగానా ?"

"... ... ... ... ..."

"పద చూద్దాం!" అంటూ మాధవి గది దగ్గరకొచ్చి "మాధమ్మతల్లీ!" అంటూ రెండు మూడుసార్లు పిల్చింది.

"అత్తా ! నేను చాలా తొందర పడ్డాను ! మూర్ఖంగా ఎవరో చెప్పిన మాటలు నమ్మి నిన్ను అనరాని మాట లన్నాను ! నన్ను క్షమించత్తా ! ప్లీజ్ !. తలుపు తియ్యవూ ?" బతిమాలింది వాసంతి.

తలుపు తెరుచుకోలేదు.

దిక్కు తోచలేదు వారిద్దరికీ; మేనేజర్ తోటీ, గుమాస్తాతోటీ కూడా పిలిపించారు. కానీ ఫలితం శూన్యం !

"ఏదైనా అఘాయిత్యం చెయ్యదుకదా !" క్రమేపీ వారిలోని భయం కొండలా పెరిగి పోతూంది.

హఠాత్తుగా వాసంతికో ఆలోచన వచ్చి చటుక్కున ఫోన్ దగ్గరికెళ్ళి ఎవరికో ఫోన్ చేసింది.

అరగంటలో కారు హారన్ వినిపించింది.

ఒక్క అంగలో కిందిగి దిగి భార్య సహాయంతో మెల్లగా నడిచి వస్తున్న ఓ వయసు మళ్ళినాయన కనిపించగానే ఆయన్ని కౌగిలించుకుని భోరుమంది.

"ఊరుకో !... ఊరుకోమ్మా !... ఏం జరిగింది ?" అనునయిస్తూనే లోనికొచ్చారా దంపతులు.

అంతా చెప్పింది వాసంతి ఏడుస్తూనే.

ఆ దంపతుల కళ్ళు మాధవి పట్ల సానుభూతితో చమర్చాయి. ఆయనే పరంధామయ్య గారు, ఆమె ఆయన భార్య పార్వతమ్మ.

"నువ్వు ... నువ్వు చాలా తొందర పడ్డావమ్మా!" సీరియస్‌గా ఉంది పరంధామయ్య కంఠం.

"అయినా కన్నతల్లిలా నిన్నులాలించిన మాధవిని అన్ని మాటలనడానికి నీకు మనసెలా వచ్చింది ?" సూటిగా చూస్తూ అంది పార్వతమ్మ.

"నిజమే తాతయ్యా ! నాది పొరపాటే ! ఏదో శని నెత్తినుండి తొందరపడ్డాను ! కానీ ... తన ఆగ్రహాన్నిలాగా బైటపెట్టేది?... నన్నింకా కొట్టమనండి ! విశ్వాస ఘాతకురాల్నని తన్ని తగిలెయ్యమనండి! అంతేగానీ... తనిలా తలుపులు మూసుకుని..." ఏడుపుతో వాసంతి గొంతు పూడిపోయింది.

"ఊఁ !... సరే! ఏడవకు!... జరిగిందాన్ని గురించి వదిలేసి జరగవలసింది చూడు" సన్నగా నిట్టూరుస్తూ మెల్లగా మేడ మెట్లు ఎక్కి మాధవి తలుపు తట్టారు.

తలుపు తెరుచుకోలేదు.

"అమ్మా ! మధూ ! నేనెంతో శ్రమపడి నీ కోసం వచ్చాను ! నా కోసమైనా తలుపు

తెరు తల్లీ!'' మృదుమధురంగా ఉన్నాయి పరంధామయ్యగారి మాటలు.

అంతే! చటుక్కున తెరుచుకున్నాయి తలుపులు!

''అయ్యో! మీరెందుకొచ్చారు మామయ్యా! మీ ఆరోగ్యం అసలే బాలేదు కదా!.. అత్తయ్యా! మామయ్యకి నువ్వైనా చెప్పాల్సింది!'' ఆప్యాయంగా ఇద్దర్నీ పలకరించి మంచం మీద కూర్చోబెట్టింది మాధవి.

''బావుంది! నువ్వే రప్పించావు! పసిపిల్లలా ఏమిటమ్మా ఈ అలకలు? వసు ఎంత కంగారు పడిందో తెలుసా?'' మంచంమీద కూర్చుంటూ అన్నారు పరంధామయ్యగారు.

మాధవి మొహం గంభీరంగా అయిపోయింది. కళ్ళన్నీ బాగా ఏడ్చినట్లు ఎర్రగా జ్యోతుల్లా వున్నాయి.

''అబ్బ! నాకీరోజు ఎంత ఆకలిగా ఉంది! వంటయిందా మంగమ్మగారూ?'' మళ్ళీ ఆయనే అన్నారు.

''ఆఁ అయింది బాబూ! తమక్కాబురెళ్ళగానే చేసేశాను!'' అంది మంగమ్మగారు.

''పద పద!... నాకూ ఆకలిగానే ఉంది!'' నవ్వింది పార్వతమ్మ.

''పదండి మామయ్యా!... పద అత్తా!'' అంటూ వాసంతికేసి కన్నెత్తి చూడనైనా చూడకుండా కిందికి నడిచింది మాధవి.

అంతా భోజనాలకూర్చున్నారు. ఎవరికీ ఆకలి లేదని అందరికీ తెలుసు.

''అమ్మాయి నాకంతా చెప్పింది!'' హఠాత్తుగా అన్నారు పరంధామయ్యగారు.

మాధవి మాట్లాడలేదు. అత్త ముభావం వాసంతికి చాలా బాధగావుంది. కదిపితే కడలి కెరటంలా దూసుకొచ్చేట్టున్నాయి కన్నీళ్ళు.

పది దాటాక ''నువ్వు వెళ్ళి పడుకో మధూ! మేం ఈ రోజు ఇక్కడే ఉంటాం! తెల్లారేసరికి మనసు నిర్మలమౌతుంది'' బలవంతాన మాధవిని ఆమె గదిలోకి పంపేసి అంతా కిందికొచ్చేశారు.

నౌకరు వేసిన మంచాలమీద ముగ్గురూ నడుములు వాల్చారు.

''వసూ! నీకు నిద్ర వస్తోందా?'' హఠాత్తుగా అన్నారు పరంధామయ్యగారు.

''లేదు తాతయ్యా!''

''అయితే నేనో కథ చెప్తాను వింటావా?''

''తప్పకుండా వింటాను తాతయ్యా! మీ కథతోనైనా నా మనసు కాస్త కుదుటపడుతుందేమో!'' బాధగా అంది వాసంతి.

''అయితే జాగ్రత్తగా విను!''

పరంధామయ్యగారు చెప్తుంటే ఆయన మంచాన కిటు, అటు వేసిన మంచాలమీద పడుకున్న వాసంతి, పార్వతమ్మలు వంటయింటి గుమ్మంలో పడుకున్న మంగమ్మగారూ కుతూహలంగా వింటున్నారు.

* * *

కృష్ణానదీ తీరంలోని ఓ పెద్ద గ్రామంలో ఓ పేద దంపతులుండేవారు. వారి వంశోద్ధారకుడైన ఏకైక పుత్రరత్నం మల్లన్న అల్లారు ముద్దుగా పెరిగి ఆడ్డగాడిదలా తయారయ్యాడు. తండ్రి రామయ్యగారు పురాణం చెప్పి, తల్లి యశోదమ్మ విస్తళ్ళు కుట్టి, అప్పడాలు వత్తి సంపాయించిన సొమ్ము వారికి తెలియకుండా తస్కరించి బీడీలు ఊదడం దగ్గర్నించి, నాటు సారా తాగడం వరకు నేర్చుకొని ''అమ్మకు రెండబ్బకు రెండిమ్మహి దిట్టించు కొడుకు!'' అన్నట్టు తయారై ఆ గ్రామానికే ఓ సమస్యలా తయారయ్యాడు.

అటు కొడుక్కి నచ్చచెప్పలేక, ఇటు ఇంట్లోంచి బయటికి గెంటలేక సతమతమైపోయే వారు తల్లిదండ్రులు.

మనశ్శాంతి కరువైన ఆ దంపతులకి చాలా కాలం తరువాత మరో ఆడపిల్ల కలిగింది. ఆ పిల్ల అంద చందాలు, ఆట పాటలు చూసుకుని కాస్త తేరుకున్న వారు కొడుకు ఆగడాలు పట్టించుకోవడం మానేశారు. పాపపేరు పావని అని పెట్టుకున్నారు.

పాపకి అయిదేళ్ళు నిండాయి.

మల్లన్న మరీ చీడ పురుగులా తయారయ్యాడు.

వీళ్ళకన్నా పరమ దరిద్రుడైన మరో పెద్ద మనిషి తన గుండెలమీద కుంపటిలా ఉన్న కూతుర్ని, ఆ చీడపురుగు చేతిలో పెట్టేసి... ''అమ్మయ్య! పిల్ల కన్నెచెర వదిలింది!'' అనుకుని చేతులు కడిగేసుకుని హాయిగా నిట్టూర్చాడు.

పెళ్ళయ్యాక కొంతకాలం బుద్ధిగా ఉన్నా ఆ తరువాత కొన్నాళ్ళకి వడ్డీతోసహా వెధవ పనులు చేసి రుణం తీర్చుకున్నాడు మల్లన్న.

రామయ్యగారి ఇంటి పక్కనే మరో బ్రాహ్మణ కుటుంబం వుండేది. ఆ గృహస్థు పేరు ముకుందంగారు. భార్య దుర్గమ్మ. ఒకే ఒక కొడుకు రఘు.

ముకుందంగారు ట్యూషన్స్ చెప్పేవారు. ఇల్లు, వాకిలి, పొలం పుట్ర గలవాడు.

ముఖ్యంగా రామయ్యగారి కుటుంబం అంటే చాలా అభిమానం!... పావని ఎప్పుడూ వారింటనే గడిపేది. కొడుకుని గురించి రామయ్యగారు కృంగిపోతూంటే ధైర్య వచనాలతో ఓదార్చేవాడు.

''ఏనాటికైనా మీ కొడుకు తప్పక మారి మంచి వ్యక్తి అవుతాడు!'' అని హామీ యిచ్చి వారిలోని ఆశకి జీవం పోసేవాడు.

కాని వారి ఆశలు తీరకుండానే రామయ్యగారు కాలం చేశారు. పున్నామ నరకం నుండి తప్పించే పుత్రుడు ఆ సమయానికి పట్నంలోని ఓ వేశ్యా గృహంలో ఉన్నాడు.

అతనికోసం తిరిగి, తిరిగి విసిగిపోయిన ఆ వూరి జనం సాటి బ్రాహ్మణుడైన ముకుందంగారి చేత తల కొరివి పెట్టించేశారు.

తండ్రి పోయిన మూడో రోజున దిగిన కుమారరత్నం విషయం విని కాస్త తెల్లబోయి లోకం కోసం కడివెడు కన్నీరు కార్చి పదోనాటి కల్లా వస్తానంటూ భార్య మెడలో ఉన్న చిన్నం పుస్తె కాస్తా తెంపుకు చక్కాపోయాడు.



ఆ వెళ్ళడం వెళ్ళడం నెల తరువాత వచ్చి తానెందుకు రాలేకపోయాడో కథలు కథలుగా వినిపించి మరీ విలపించాడు.

"ఈ త్రాష్టుడితో ఇంకా మాటలేమిటి?" అనుకున్న జనం మారు మాట్లాడలేదు.

కాలగర్భంలో మరో అయిదు వసంతాలు వచ్చి వెళ్ళాయి ఈమధ్య కాలంలో మల్లన్నతల్లి, ఇటీవలే అతని భార్యా నాలుగేళ్ల పసిదాన్ని ఈ భూమ్మీద వదిలేసి తనువులు చాలించారు.

భార్యా, తల్లీ పోయాక కాస్త ఫ్రీగా ఉన్నా పిల్ల ఓ గుదిబండలా తోచింది మల్లన్నకి.

అందుకే తను పోషించాల్సిన చెల్లెలి మీద ఆ పిల్లని పడేసి రాత్రికి రాత్రి ఉడాయించేశాడు.

దెబ్బ మీద దెబ్బ తగలడంతో తట్టుకోలేక పోయిందా పసి మనసు. సెగ తగిలిన చివురు టాకులా కంపించిపోతున్న పావనిని ఆదుకున్నారు ముకుందంగారు.

పావనిని, పాపని కూడా వారే చేరదీసి తమ కుటుంబ సభ్యులుగా చేర్చుకున్నారు.

అనుకోకుండా వారి గ్రామానికి సిరి పట్టింది. ఓ పంచదార మిల్లు వెలిసి ఓ చిన్న బస్తీలా తయారైౖ దాని వలన ఇళ్లస్థలాల ధరలు అవీ కూడా పెరిగిపోయాయ్ !

ఉన్నట్టుండి ఓరోజు హిడింబి లాంటి ఆడదాన్ని వెంటబెట్టుకుని ఉరుములేని పిడుగులా ఊడిపడ్డాడు మల్లన్న. ఆ హిడింబిని భార్యగా పరిచయం చేశాడు.

పెళ్లి చేసుకున్న తరువాత పసిదాన్ని అక్కడ ఉంచడం బావుండదని ధర్మ పన్నాలు పలికాడు.

అన్న వచ్చినందుకు ఆనందించినా... ఎందు కొచ్చాడో తెలిసిన పావని కృంగి పోయింది.

అతను తాతల నాటి ఆస్తి అయిన ఆ పాత ఇల్లు స్థలం అమ్మడాని కొచ్చాడు. కేవలం అలా అంటే బావుండదని కూతురి మీద ప్రేమ ఒలక బోశాడు. మాటవరసక్కూడ చెల్లెల్ని రమ్మన లేదు.

ఎవరి సాధక బాధకాలతోటి తనకు నిమిత్తం లేనట్టు తన పని పూర్తి చేసుకుని వెళ్లి పోయాడు మల్లన్న.

వెళ్లేటప్పుడు మైనార్టీ తీరని చెల్లెలికి తప్పనిసరిగా ఏదో కొంత ఇచ్చి, గార్డియన్‌గా ముకుందం గారి చేత ఓ సంతకం చేయించుకుని, రానని ఏడుస్తున్న పాపని సంతలోని గొడ్డులా భార్య లాక్కుపోతుంటే ... గంగిరెద్దులా ఆమె ననుసరిస్తున్న అతన్నిచూసి ఊరంతా అసహ్యించు కుంది.

పాప కోసం ఏడుస్తున్న పావనిని ముకుందం గారు, దుర్గమ్మ, రఘులు ఎంతో ఓదార్చారు.

ముఖ్యంగా రఘుకి పావనంటే ఎంతో ప్రాణం ! ఆమెకి కథలు, కబుర్లు చెప్పేవాడు. తెలియని లెఖ్ఖలు చెప్పేవాడు.

# స్వాతి జల్లు

వారి నీడలో పావని ఇంటర్ ఫస్ట్‌క్లాస్‌లో పాసయి ఉద్యోగాన్వేషణలో పడింది. కానీ పదహారేళ్ల పిల్లకి ఉద్యోగం ఎవరిస్తారు ?

ఆ వూరి ప్రెసిడెంట్ సినిమాల్లో విలన్లా కాక చాలా మంచివాడు. ముఖ్యంగా ముకుందం గారికి మంచి స్నేహితుడు.

ముద్దబంతి పువ్వులా ఉన్న పావనిని చూస్తే ఆయనకి చాలా అభిమానం! అందుకే పంచాయితీ ఆఫీసులోనే ఓ చిన్న ఉద్యోగంలాంటిది తాత్కాలి కంగా ఇచ్చాడు.

అప్పుడే ఆ వూరి కాలేజీకి లెక్చరర్‌గా చలపతి అన్న యువకుడు వచ్చి తన మంచితనంతో ముకుందంగారి ఇంట్లో రెండు గదులు సంపా దించాడు.

సాటి కులస్తుడనే అభిమానంతో అడపా దడపా పచ్చళ్ళు, కూరలుకూడా దుర్గమ్మ పంపుతూండేది.

చలపతి అందంగా ఆకర్షణీయంగా ఉండే వాడు. మితభాషి ! పెద్దలఎడ చాలా నమ్రతగా ఉండేవాడు. కాస్తో కూస్తో కలవాడనికూడా వినికిడి !

కాలం గడిచినకొద్దీ చలపతికి ఆ ఇంటితో చనువు ఏర్పడింది. పావనికూడా అతనితో నిస్సంకోచంగా మాట్లాడేది ! అతనూ అలాగే చనువుగా ఉండేవాడు.

ఓ రోజు సాయంత్రం పావని ఏడుస్తూ ఇల్లు చేరింది.

విషయం విని మండిపడ్డారు ముకుందంగారు. సరాసరి ప్రెసిడెంట్ ఇంటికెళ్ళి స్వభావానికి విరుద్ధంగా నానా మాటలూ అన్నారు. ఓ ఆడపిల్లకి రక్షణలేని ఈ ఊర్ని తగలబెట్టా లన్నారు ! అమాయకులైన ఆడపిల్లల్ని వెంటాడుతూ అచ్చోసిన ఆంబోతులా తిరుగు

## డ్రీం

దొంగతనాలు చేసి చేసి
విసుగెత్తిన
దొంగగారు కల గన్నారు—
మంత్రినైనట్టు.
కలలో
అందరికీ 'దొర'లా కనిపించినా
వృత్తి ఒకటేలా అనిపించి
అంతరాత్మ
అంగీకరించని
దొంగగారు
కలలో కంటే
ఇలలోనే బాగుందనుకున్నారు !!!

— రామసూరి

తున్న బావమరిదిని కంట్రోల్ చేసుకోమన్నారు. కాస్తలో తప్పిపోయిన దారుణాన్ని విప్పి చెప్పారు. పసిబిడ్డనుంచి చూస్తూ, చెల్లెల్లాంటి పావని మీద చెయ్యెయ్యబోయిన అతను నాశనమైపోతా డని శపించారు !

బావమరిది సంగతి, ముకుందంగారి సంగతే గాక పావని సంగతికూడా పూర్తిగా ఎరుగున్న ప్రెసిడెంట్‌గారు అన్నీ మౌనంగా విన్నారు.

తాత్కాలికావేశం తగ్గిన ముకుందంగారు తన ఆవేశానికి సిగ్గుపడి ఆయన్ని క్షమార్పణ కోరారు.

అన్నిటికీ ఆయన చిరునవ్వే జవాబైంది. ఇంకా ఏదో చెప్పబోతున్న ముకుందంగార్ని ఆపారు.

"ఇదిగో మాస్టారూ ! మీ స్థానంలో నేనున్నా... ఇలాగే... కానూ ! అతన్ని నాలుగు తన్ని వస్తాను ! ఈ జరిగిందానికి నేను సిగ్గు పడుతున్నాను ! ఇంక ముందు ఇలాంటివి జరగ వని హామీ ఇస్తున్నాను !"

మరోసారి ఆయనకు సారీ చెప్పుకుని వెళ్ళి పోయారు ముకుందంగారు.

ఆయనటు వెళ్ళగానే భార్యా, బావమరిదీ కాట్లకుక్కల్లా పడ్డారు ప్రెసిడెంటుగారి మీద.

"ఛీ! ... నువ్వేం ప్రెసిడెంట్‌వి బావా! ఆఫ్టరాల్! ఓ బడిపంతులు నానా మాటలూ అంటూంటే...చేతకానివాడిలా నోరు మూసు కున్నావా? ... ఛ! ఊరికే తలవంపు!" ఛీత్కారం చేశాడు బావమరిది. ఇదే భావాన్ని మరికాస్త ఘాటుగా వెలిబుచ్చింది భార్య.

అన్నింటికీ మౌనిలా నవ్వాడాయన.

"పాపం! ఆ పిల్ల కొట్టిన చెంప దెబ్బ వాపు ఇంకా తగ్గినట్టు లేదే! ... మీ అక్కయ్య చేత కాస్త కాపు పెట్టించుకోకూడదూ?" సానుభూతిగా అన్నాడు.

తృళ్ళిపడ్డాడు బావమరిది. కళ్ళు చింత నిప్పుల్లా చేసుకుని "హూ! చూస్తాను దీని సంగతి!" హూంకరిస్తూ వెళ్ళిపోయాడు ఇంకాస్సేపుంటే... ఓరి చవట వెధవా! ఓ ఆడపిల్ల చేత చెంపదెబ్బతిన్నావా?" అని అక్క గారెక్కడ అడుగుతుందో అని.

"హన్నా! ... నా తమ్ముణ్ణి చెంపదెబ్బ కొట్టిందీ!" తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్టి పోసింది భార్య.

తత్ఫలితంగా పావని ఉద్యోగంకాస్తా ఊడి పోయింది. అనుకున్నదే అయినా ముకుందంగారు కాస్త బాధపడ్డారు. అయితే...ప్రెసిడెంట్‌గారి మాటలు విన్న తరువాత ఆయన తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నారు. ఎలాగో పావని పెళ్ళికూడా చేసెయ్యాలి!" అని కూడా నిర్ణయించుకున్నారు. పగబట్టిన పాము కాటు వేయడానికే ప్రయత్ని స్తుందన్న ప్రెసిడెంట్‌గారి మాట పావనిక్కూడా వచ్చింది.

(ఇంకా ఉంది)

మెత్తగా నేసిన ప్రియా * టెరీన్ చీరలు
ఆకర్షణీయమైన డిజైన్లలో, అందమైన రంగుల్లో
మీ వంటిపై మెరిసిపోయే చీరలు.



# దావణగెరె

**అందంచిందే సమ్మేళనతో నూతన సరళి కల్పన !**

ది దావణగెరే కాటన్ మిల్స్ లిమిటెడ్
హనుమంతప్ప బిల్డింగ్స్,
చిత్రదుర్గ రోడ్, దావణగెరే 577 002.

షోరూములు :
కావేరి భవన్, బెంగుళూరు-560 009.
దాజీబాన్ పేట్, హుబ్లి-580 020.
చిత్రదుర్గ రోడ్, దావణగెరే-577 002.

*టెరీన్ — కేలికో రిజిస్టర్డ్ ట్రేడ్ మార్క్

THOMAS/8303-C/TEL

# కళింగదేశపు చాటువులు

పాణుగుపాటి వెంకట మంత్రిపైన పద్యము లను రచియించిన కవి మహాప్రసిద్ధుడగు నడిదము సూరకవి — ఈ పద్యములనాతడు ప్రాస్తావికముగ నప్పుడప్పుడు చెప్పియుండవచ్చును. కాని శ్రీకారముతో ప్రారంభమగుచున్న కారణము చేత నిదియొక శతకముగా పరిగణితమైనది. ఇందులో 39 పద్యములు మాత్రమే లభించినవి.

ఈ పాణుగుపాటి వెంకటమంత్రి విశాఖ పట్టణమండలములోని శృంగవరపు కోట జమీందారులైన ముఖీ కాశీపతిరావుగారి దివానుగ నుండి, దానధర్మపరుడై, కవి పండిత పక్షపాతియై రాజకార్య నిర్వహణ సమర్థుడై, కీర్తి గడించెను. క్రీ. శ. 1720–80 ప్రాంతమున నతడు జీవించియుండెను. సూరకవి యాతని పొగడి నట్లింక నెవ్వరిని బొగడియుండలేదు. ఈ ముఖీ కాశీపతిరాజుగారివద్ద వేఱొక మంత్రి కృష్ణ మంత్రి. ఈతడు సృష్టికరణ కులజుడు. అండలూరి శరభకవి తన 'ముక్తి చింతామణి' అను పద్యకావ్యమును నీ కృష్ణమంత్రికే కృతి నొసగినాడు. ఉపలబ్ధములగు వేంకట మంత్రిపై పద్యములన్నియు నిందు పొందుపఱుపబడి యున్నవి.

''శ్రీకర గౌతమకూకుద
కాకుత్స్థ పదాబ్జసేవక ప్రవరుడవై
కైకొను మభీష్టసిద్ధిని
వేకనిధీ! పాణుగుపాటి — వేంకటమంత్రీ''

''వెన్నెలవలె కర్పూరపు
దిన్నెలవలె నీదుకీర్తి దిగ్దేశములన్
మిన్నంది పన్నెకెక్కెను
విన్నావా! పాణుగుపాటి వేంకటమంత్రీ!''

''చుక్కలవలె, కర్పూరపు
ముక్కలవలె నీదుకీర్తి ముల్లోకములన్
క్రిక్కిరిసి పిక్కటిల్లెను
వెక్కసముగ బొణుగుపాటి వేంకటమంత్రీ''

''లేదు భువి వాస దడియని
వాడున్నీ యింట భుక్తిఁబడయ నిద్విజుడున్
బోడిమి మీఱఁగ నిన్నున్
లేడని కవి పాణుగుపాటి వేంకటమంత్రీ''

''వరదానాచారంబుల
గరిమగని వనీపకులను గర్మకులను భూ
సురమణి యని విన్నందుగు
విరచిత వృష పాణుగుపాటి వేంకటమంత్రీ!''

''జలచరము అబ్ధి బొడమనె
జలరాశికి మోదకరుడు చంద్రుడొకండే
కులముద్ధరింప నొకడే
విలసద్యశ! పాణుగుపాటి వేంకటమంత్రీ!''

''ఘనకులమున బొడమిన దు
ర్మను జుండిల నింద్యుడగు, నమసమూర్ధ్వముఖం
బున వెడలి మంచిదగునా?
వినుమవహిత పాణుగుపాటి వేంకటమంత్రీ''

''కలుద్రావు వానితో మూ
ర్ఖులతో జవ్వనులతోడ గోడెలతోఁడన్
గలహింప బోవ రధికులు
విలసన్మతి పాణుగుపాటి వేంకటమంత్రీ!''

''తనుదా బొగడిన నల్పుడు
ఘనుడగు నాఘనుని ఖలుడొకడు గాదన్నన్
జనులంద అతని జొగడరె
వినుమవహిత పాణుగుపాటి వేంకటమంత్రీ''

''జగములకు సాక్షి సూర్యుం
డగు సూర్యునికొక్క సాక్షి యవనింగలడే
తగవెఱుగుడు పెనుమూర్ఖుడు
విగతకలుచ పాణుగుపాటి వేంకటమంత్రీ!''

''పెనుమూర్ఖుడాడి కొనడా
నను నెఱుఁగరె పేతు శీతనగమధ్యోర్వీన్
తను వెఱిగిన సుకవీంద్రులు
వినుమవహిత పాణుగుపాటి వేంకటమంత్రీ!''

''నన తేనియ గైకొను భృం
గ నిరూఢిని దాత మనసు గందకయుండన్
గొనవలె యాచకుడర్థము
వినుమవహిత పాణుగుపాటి వేంకటమంత్రీ!''

''కినుకమెయి దన్ను లాడగ
మొనకట్టిన సరియు గుఱ్ఱమును గాడిదయున
ఘనుడల్పునితో బోరునె
వినుమవహిత పాణుగుపాటి వేంకటమంత్రీ!''

''యతిదవుల వలయువాగను
గతిధేనువు వెంటనంటి కదలెడువత్సా
కృతి నదియె కవనచతురిమ
వితరణ ఖని పాణుగుపాటి వేంకటమంత్రీ''

''కుశలత్వ మెంతయుండిన
వశమా? పులినోటికండ వదలింపగిదా
దృశ పాండిత్యము నీదే
విశదయశా! పాణుగుపాటి వేంకటమంత్రీ!''

''శరమొకటి యేయ రిపుపై
బరుగెత్తిన గట్టువడియె భాస్కరబింబం
బరిది భవత్సాయక ధృతి
వెఱచికదా పాణుగుపాటి వేంకటమంత్రీ!''

''జనపతికి మతిదొలంగిన
కొనసాగదు మంత్రి బుద్ధి కుశలతయును శాం
తనవాదులు కురుపతి తీవి
వినెగద్చిరె పాణుగుపాటి వేంకటమంత్రీ!''

''ధరణిన్ భౌమాద్రిగహ
పరీక్షలకెగాక యతడు భాస్కరుడనియే
ర్భుఱుపవలెనె లోకులకున్
విరోధిహర పాణుగుపాటి వేంకటమంత్రీ!''

''సకలామోద సుమద్రుమ
వికసన మొనరించు ఘనుడు విడిచివ లేదా
యొక ఘనుడు జాతిలతికా
వికసతకును పాణుగుపాటి వేంకటమంత్రీ!''

''వలరాచవవికి గాదా
వెలవెలదుక పొమ్మదొక్క విలుదు సహించున్
చలమేల కార్యవాదికి
విలసద్యశ! పాణుగుపాటి వేంకటమంత్రీ!''

''బలవంతుడు బలహీనుడు
పాలాతురు విధిదప్ప నల్లపూసలు ముత్యాల్
తొలగుగద మగడుపోయిన
వెలదుకకున్ పాణుగుపాటి వేంకటమంత్రీ!''

''అని భార్గవు దరిగినశం
తనుని తనూజుందు చండతర సాయకముల్
జొనిపెనె శిఖండిమీదను
వినుమవహిత పాణుగుపాటి వేంకటమంత్రీ!''

''ఒక్క సముద్రము దక్కగ
దక్కిన సంద్రములు నీ యుదార మహిమచే



జిక్కగద విప్రభుక్తికి
వెక్కసముగ బొణుగుపాటి వేంకటమంత్రీ !''
''నీ మహిమ మొక్కనోవదు
నీ మాటయె విష్ణువరము నీ వాక్యము శ్రీ
రాముల బాణముగద త
న్వీ మన్మథ! పొణుగుపాటి వేంకటమంత్రీ !''
''కోయక పెరుగదు బచ్చలి
మేయక పాలీయ దావు; మేదినిలో డ
బ్బీయకదాదు సుకీర్తియు
వేయేలా పొణుగుపాటి వేంకటమంత్రీ !''
''చేలకడ దిష్టిప్రతిమ మె
కాలం బెదరించు ముచ్చు గావంగలదా ?
చాలును మంత్రి కుమారుల
వీలిట్టిది పెణుగుపాటి వేంకటమంత్రీ!''
''పొగ త్రాగనట్టి నోరును
పొగడంగా బ్రదుకునట్టి భూపతి బ్రదుకున్
మగ డొల్లని సతి బ్రతుకును
వెగటు సుమీ పొణుగుపాటి వేంకటమంత్రీ !''
''చెడగొఱుకు పీడపురు గొక
పిడికెడు జలకమిడి చెట్టు పెంచునె ! చెడుగా
అడివెట్టుగాని దుర్దశ
వెడలించునె పొణుగుపాటి వేంకటమంత్రీ !''
''జనియింతురు సజ్జన దు
ర్జను లుపకా రాపకార సంఘటని మొన
ర్పను గోవ్యాఘ్రము లట్లను
వినుమవహిత పొణుగుపాటి వేంకటమంత్రీ !''
''పరపీడనంబు కంటెను
దురితము, సూనృతముకంటె దొరవ్రతమున్
ధరసెంచి చూడగలవా
విరచిత వృష పొణుగుపాటి వేంకటమంత్రీ !''
''చెన్నగు నియోగి కవనపు
మిన్నావైదికని కోగునె మేదిని లోనన్
జున్నుకు మార్దవ మబ్బునె
వెన్నవలెన్ పొణుగుపాటి వేంకటమంత్రీ !''
''చౌకట్లువెట్టి మిన్నా
కోకలు తొడిగినను గలవెగురు తరకీర్తుల్
(నాకలిమిలేక యున్నవి)
వేకనిధీ ! పొణుగుపాటి వేంకటమంత్రీ''
''పొగడను పరకవి కవనము
(పొగడను పరరాజమంత్రి బర్బర తరులన్)
జగమెల్ల నిన్ను బొగడును
విగత కలుష ! పొణుగుపాటి వేంకటమంత్రి''
''(గను నేసిరి) సజ్జనుడున్
తనదు ప్రయత్నంబులేక, దధియ్యైనను
దర్పిసఁగాని వెన్న యొసగునె
వినుమవహిత ! పొణుగుపాటి వేంకటమంత్రీ !

## తేడా

గల్లాపెట్టె ముందు
పట్టు బాలీసుల మీద
సుఖంగా కూర్చున్న
వాడికీ చెమటే !

గునపం, పాఱా పట్టుకుని
కష్టపడి
ఎండలో పని చేసే
వీడికీ చెమటే !

వాడి చెమట
వెనకున్నది
ఆయాసం !

వీడి చెమట
వెనకున్నది
ఆకలి !!

— ''సింహం''

ఆంధ్రపత్రిక
1953 ఫిబ్రవరి 25
సంచిక నుంచి

''(ప్రోవగ నేర్పునె భూపతి)
దైవము కృపదప్ప భీష్మతరణి సుతాదుల్
ప్రోవంగలిగిరె కురు ప్ర
ధ్వీవరునిన్ పొణుగుపాటి వేంకటమంత్రీ !''
''ఎదురెవ్వరు తనకన నీ
పదునాలుగు జన్మముల తపము జేసి (దా
తుది విధిని గడవ నేర్చు నె)
విదళితమద ! పొణుగుపాటి వేంకటమంత్రీ !''
''వివిధ పదార్థంబులు ని
ల్వవు దక్షతలేని యింట లక్షలకొలదిన్
(ఆవిసిన గట్టున నిలుచునె
వివరాంబులు) పొణుగుపాటి వేంకటమంత్రీ !
తలయెత్తి మొఱుగుఁ గుక్కకు
(గల వారవలనఁ గొంత) ఘనతలభించెన్
గలభమునకున్న యున్న తి
వెలితిపడెనె పొణుగుపాటి వేంకటమంత్రీ''
''అలచిగురు మెసగు కోయిల
ఫలములు భుజియించు చిలుకపలుకులకెనయా
(సులలిత కవితాసూక్తులు
విలసన్మతి) పొణుగుపాటి వేంకటమంత్రీ !''

కళింగదేశమున నీ పద్యములు చాల వ్యాప్తిలో నున్నవి. కావున కొంతమంది కవులు వీని ననుసరించిరి. ఉదాహరణ మొక్కటి చూపుచున్నాను.

''చుక్కలవలె, కర్పూరపు
ముక్కలవలె నీదు కీర్తి ముల్లోకములన్
క్రిక్కిఱిసి పిక్కటిల్లెను
వెక్కసముగ బొణుగుపాటి వేంకటమంత్రీ !

అను పద్యము ననుసరించి

''వెన్నెలవలె కర్పూరపు
దిన్నెలవలె నీదుకీర్తి త్రిజగములందున్
మిన్నంది వన్నె కెక్కెను
కన్నాకై మగటపల్లి కామయచంద్రా.''
అని పచ్చమెట్ల పాపయకవి తన కామయ చంద్రశతకములో వ్రాసియున్నాడు

సేకరణ :

—శ్రీ నిడుదవోలు వేంకటరావు






కొత్త సీరియల్ ప్రారంభం

# శ్రావణి

మాడుగుల కృష్ణకుమారి



"శ్రావణీ!"

"ఏమిటండీ?" అంది చేస్తున్న పని ఆపుచేసి ప్రశ్నార్థకంగా భర్త వైపుచూస్తూ.

"నే చెప్పిన విషయం గురించి ఏమాలోచించావు?"

"ఏమిటో మీరు చెప్పిన విషయం నాకసలు గుర్తేలేదు" అంది చిరునవ్వుతో.

"అదే వారం రోజులనాడు చెప్పాను చూశావా ఆ విషయం" అన్నాడు శ్రీహరి భార్య ఏ సమాధానం చెపుతుందా అన్నట్లు ఆశగా చూస్తూ.

"అబ్బా! మీ మాటలు ఒక పట్టాన మీరు నాతో చెప్పిన విషయాలు చాలా అర్థం కావుకదా. వారం రోజులనాడు వున్నాయి. నంబర్ వన్ మీ ఫ్రెండు



పెళ్ళికి వెళ్ళాలని, నంబర్ టూ బీర్వాలో పాతబట్టలు తీసేయ్యమని, నంబర్ త్రీ పండగ దగ్గరకొస్తుంది మనిద్దరం కల్సి బజారు వెళ్ళి బట్టలు తెచ్చుకోవాలని, ఇంకా...'' అంటూ చాటభారతంలా లిస్టు చదువుతున్న భార్య మాటలు వినలేనట్లుగా చెవులు మూసుకున్నాడు.

భర్త అలా రెండు చెవులు మూసుకోవటం చూసి కిలకిలా నవ్వింది శ్రావణి. ఆమె అలా నవ్వుతుంటే బుగ్గన సొట్టలు పడటం అలవాటు.

భార్య నవ్వంటే అమితమయిన ఇష్టం శ్రీహరికి. ఆమె చేతిని తన చేతిలోకి తీసుకొని ''ఇంత అందంగా నవ్వటం ఎక్కడ నేర్చుకున్నావు ?'' అన్నాడు.

''నవ్వు కూడా అందంగా వుంటుందేమిటీ?'' అంది ఆశ్చర్యంగా శ్రావణి.

''మరి ఉండదేమిటీ. ఇంత అందంగా నవ్వుతుంటే ముద్దు కూడా వస్తుంది'' అంటూ చటుక్కున భార్య చుబుకాన్ని ముద్దాడాడు శ్రీహరి.

సిగ్గుగా పైట చెంగుతో ముఖం తుడుచుకుని ''వేళాపాళా వుండాలి ఎవరన్నా చూస్తే'' అంది.

''ఎవరున్నారని ? అమ్మ పురాణానికి వెళ్ళింది. ఇంక ఈ ఇంట్లో జంట పక్షుల స్వేచ్ఛా విహారం. మనకి ఎవరూ అడ్డులేరు. అంతా మనిష్టం'' అన్నాడు అల్లరిగా భార్య ముంగురులు చెరుపుతూ.

''అదిగో ! ఆ అల్లరే వద్దనేది పెళ్ళయి ఇన్ని రోజులయినా ఇంకా కొత్తేనా ?'' అంది.

''రోజు రోజుకి నువ్వు నా కంటికి మరింత కొత్తగా కన్పడుతుంటే? కొత్తకాక మరేమిటీ?'' అన్నాడు కొంటెగా నవ్వుతూ.

''ఏమండీ ?'' అంది శ్రావణి.

''ఏమిటీ ?'' అన్నాడు బార్యను తదేకంగా చూస్తున్న శ్రీహరి.

''నిజంగా నేను చాలా అదృష్టవంతురాలిని. ప్రేమించి గుండెల్లో పెట్టుకుని చూసే భర్తా, కన్న తల్లికన్నా మిన్నగా చూసుకునే అత్తయ్యా, సిరీ — సంపదా ఇంతకన్నా ఆడదాని జీవితంలో మరేం కావాలండీ. మీరు నాకు దొరకటం నే చేసుకున్న పుణ్య ఫలితమే'' అంది ఆరాధనగా భర్త కళ్ళల్లోకి చూస్తూ.

''ఆ, అదృష్టం నీ ఒక్కదానిదేకాదు శ్రావణీ, అందులో సగభాగం నాకుకూడా వుంది. ఈ ముద్దమందారాన్ని నాకు ప్రసాదించిన ఆ దేముడికి నిజంగా నేనెంతో ఋణపడి వుండాలి'' అన్నాడు.

''బాగుంది ! ఇలా ఒకర్నొకరు పొగుడుకుంటూ కూర్చుంటే ఇంట్లో పని ఎవరు చేస్తారు. రాత్రి భోజనానికి బదులు నాలుగు కమ్మని కబుర్లు చెపితే కడుపునిండుతుందా ?'' అంది నవ్వుతూ.

''ఆకలుండదు దాహముండదు నిన్ను చూస్తుంటే ?'' అన్నాడు సన్నగా రాగంతీస్తూ.

''ఆ పాటలు తర్వాతకానీ, నేనింకా కంది పచ్చడి రుబ్బాలి. అత్తయ్యకి రొట్టెలు చెయ్యాలి. మీతో కబుర్లు చెపుతుంటే నా పని అయినట్లే. ఆగండి వేయించిన పప్పు వంటింట్లో వుంది, తెచ్చి రుబ్బుతూ వుంటాను. మీరు కబుర్లు చెపుతూ వుండండి'' అని వంటగదిలోకి పరుగు తీసింది.

లేడిపిల్లలా పరుగులుతీసే శ్రావణి వెళ్ళిన వైపే చూస్తుండిపోయిన శ్రీహరి మనసు మళ్ళీ ఆలోచనలపై మళ్ళింది. దొడ్లో బాదంచెట్టు కింద పట్టెమంచంమీద పడుకున్న అతని మనసంతా భార్య చెప్పబోయే విషయం మీదనే లగ్నమై వుంది.

పప్పు రోట్లోపోసి రుబ్బపోతున్న శ్రావణి ''ఊ! ఇప్పుడు చెప్పండి మీ ఇష్టం. పచ్చడి నలిగేదాకా ఎన్ని కబుర్లు అయినా వింటాను'' అంటూ పొత్రం గిరగిరా తిప్పసాగింది.

మోకాళ్ళదాకా చీర పైకి పెట్టి రోటి ముందు కూర్చున్న భార్య వంక చిరాగ్గా చూసి ''నాన్‌సెన్స్. ఎప్పుడూ కందిపచ్చడీ, కాకరకాయ వేపుడు తప్ప నే చెప్పే విషయం అర్థం చేసుకోవు'' అన్నాడు.

''ఆ ! మీరిలాగే అంటారు పనిచేస్తుంటే, మళ్ళీ అదే నోటితో 'ఇదిగో శ్రావణి రెండు వెల్లుల్లిపాయలు వేసి రుబ్బవోయి అవే చేత్తో పోపుకూడా పెట్టేస్తే మరీ మంచిది అంటారు' అవునా ?'' అంది భర్త గొంతును అనుకరించి నవ్వుతూ.

''నిజమేనోయి నేను ఏదో ఆలోచిస్తూ ఆ విషయమే మర్చిపోయాను. అది కందిపచ్చడి కదూ ! ఆ పని చేసెయ్యి'' అన్నాడు చిరునవ్వుతో.

''మీ మగవాళ్ళకి భోజనంలోకి అన్ని రుచులు కావాలి కానీ భార్య ఏ పనీ చెయ్యకుండా పొద్దస్తమానం మీ దగ్గరే కూర్చోవాలి. అమ్మో పనేనా'' అంది కుడిచేత్తో పచ్చడి ఎగదోస్తూ.

''నువ్వు శ్రమ పడకుండా హాయిగా నేను మిక్సీ తెస్తే ఈ రోటి దగ్గర కుస్తీ ఎందుకో'' అన్నాడు.

''దాని మాట నా దగ్గర ఎత్తకండి. ఆ పేస్టు తినటం నా వల్లకాదు'' అంది భయంగా ముఖం పెట్టి.

''సరే ! సుఖపడటం కూడా తెలియాలి'' అన్నాడు.

''నేనేమంత కష్టపడటం లేదులేండి ఇప్పుడు'' అంది.

సాయంకాలపు నీరెండలో అలా రోటిదగ్గర కూర్చుని చెదిరిన ముంగురులతో చిరు చెమటలు పట్టి అలసిపోయిన ముఖంతో చకచకా తన పని చేసుకుపోతున్న శ్రావణి రూపం ఎంతో అందంగా కన్పించింది అతని కళ్ళకు.

మంచంమీద బోర్లా పడుకుని పరీక్షగా ఆమె కళ్ళల్లోకేచూస్తూ ఏదో అనబొయ్యాడు. ఇంతలో శ్రావణే ''అన్నట్లు మర్చేపోయాను అసలు విషయం, మీరు ఇందాక ఏదో అన్నారు చెప్పండి'' అంది హుషారుగా.

''అదే'' అని భార్య ముఖంలోకే చూస్తూ ''మనం ఒకసారి డాక్టరు దగ్గరకు వెళదామని చెప్పాను. గుర్తుందా ?'' అన్నాడు శ్రీహరి.

అంతే జరగరానిది జరిగినట్లు, వినకూడనిది విన్నట్లుగా ఆమె ముఖం ఒక్కసారిగా వాడిపోయింది. మౌనంగా వుండిపోయింది.

భార్య ముఖ కవళికలు గమనించిన శ్రీహరి ''చూడు శ్రావణీ నేనీమాట ఎత్తగానే ఎందుకలా ముభావంగా వుండిపోతావు ?'' అన్నాడు ఆమె మౌనం తనకేం కొత్త కాదన్నట్లుగా.

సమాధానంగా చాలా మెల్లిగా అంది ''ఇప్పుడు ఏమంత అవసరమని ?''

''ఎంత తెలివితక్కువగా మాట్లాడావు శ్రావణీ. ప్రేమించే భర్తా, ఆనందంగా గడిచిపోయే సంసారము, అష్టైశ్వర్యాలు వుంటే సరిపోతుందా ? మన జీవితానికి సార్థకత ఉండద్దూ ? పెళ్ళి అయి, అయిదు సంవత్సరాలయినా మనింట్లో ఏ మార్పు లేదు. ఆడదాని జీవితానికి 'అమ్మా' అన్పించుకోవటంలోనే సార్ధకత వుంది. మనకున్న ఎన్ని సంపదలకయినా సాటిరాని ముఖ్య సంపద అదే. అదే కరువయిందిప్పుడు మన జీవితంలో. ఈ విషయం గురించి అమ్మ పోరు కూడా ఎక్కువగా వుంది. ఆవిడ అభిప్రాయమే కాదు నాకు కూడా అది నిజమనే అన్పిస్తోంది. అందుకే ఒకసారి డాక్టరుని కలుద్దామని వుంది. ఇదేం తప్పు పని కాదు'' అన్నాడు భార్య మాట కోసం ఎదురు చూస్తూ.

ఏమీ చెప్పకుండా తల వంచుకుని ఏకధాటిగా రుబ్బుతున్న భార్య వైపు ఓర్పుగా పదినిముషాలు చూశాడు. ఉహూఁ ఏ కదలికా లేదు.

మెల్లిగా ఆమె తలను పైకెత్తి ''అసలు నీ ఉద్దేశ్యం ఏమిటీ ?'' అన్నాడు.

పాలిపోయిన ముఖంతో చూస్తూ ''నాకు...'' అంది గొంతు పొడరిపోతుంటే.

''ఊఁ నీకు ఏమిటీ ?'' అన్నాడు శ్రీహరి.

''నాకు ! నాకు డాక్టరంటే భయం'' అంది బిగ్గరగా ఏడుస్తూ.

శ్రావణలా ఏడవటం చూసి బిత్తరపోయిన శ్రీహరి ''ఎందుకట భయం ? అన్నాడు.

మోచేత్తో కళ్ళు తుడుచుకుంటూ ''వాళ్లు చాలా చెడ్డవాళ్ళట. రకరకాలుగా హింసిస్తారుట. చెప్పినట్లు వినకపోతే కొడతారుట కూడా, మా వూరి కరణంగారి అమ్మాయి కాన్పుకి వెడితే, వాళ్లే చంపేశారు. అందుకే నాకు చిన్నప్పటి



ఇండియానాలో ఔట్‌డోర్ ట్రాక్ అండ్ ఫీల్డ్ ఛాంపియన్‌షిప్ పోటీలలో కారల్ లూయిస్ 8.794 మీటర్ల దూరం దూకి లాంగ్‌జంప్ చరిత్రలో రెండవ స్థానం సంపాదించాడు. 1968లో మెక్సికోలో జరిగిన ఒలింపిక్ పోటీలలో లాంగ్‌జంప్‌లో బాబ్ బీమన్ స్థాపించిన రికార్డుకన్నా ఇది 11 సెం.మీ. తక్కువ. టెక్సాస్‌లోని హ్యూస్టన్ విశ్వ విద్యాలయానికి చెందిన ఈ ఇరవై రెండేళ్ల లూయిస్ 100 మీటర్ల పరుగుపందాన్ని 9.96 సెకండ్లలో సాధించి రెండవస్థానం సంపాదించాడు. ఇది మెక్సికో ఒలింపిక్స్ రికార్డుకన్నా సెకండులో నూరవవంతు తక్కువ. వీటితోపాటు లాస్ ఏంజిల్స్‌లో జరిగే ఒలింపిక్ క్రీడోత్సవాలలో 200 మీటర్ల పరుగు పందెం, 400 మీటర్ల రిలే పందేలలో పోటీ చేయాలని లూయిస్ అనుకుంటున్నాడు,

నుంచీ డాక్టరంటే భయం'' అంది ఇంకా బెక్కుతూనే.

ఈసారి పకపకా నవ్వాడు శ్రీహరి. నవ్వాపుకుంటూ ''ఎవరు చెప్పారు ?'' అన్నాడు.

''కరణంగారి అమ్మాయినేకాదు. మా సీతత్తయ్య కొడుకుని కూడా ఆపరేషన్ చేసి చంపేశారు. వద్దండీ, మనం ఏ డాక్టరు దగ్గరకు వెళ్ళద్దు మనకి లిఖితంలో వుంటే పుడతారు. లేకపోతే లేదు. పిల్లల కోసం మీకు దూరం అవటం నాకిష్టంలేదు'' అంటూ తనని కరుచుపోయి ఏడుస్తున్న భార్య అమాయకతకు ఏం చెప్పాలో, ఎలా చెప్పాలో అర్థంకాలేదతనికి.

## శ్రావణి

భార్యని అనునయిస్తూ ముందు చెయ్యి కడుక్కోమని ఆమెను పొదివి పట్టుకుని ఇంట్లోకి తీసుకువెళ్ళాడు.

కంటి కొసల నుంచి కారిన నీళ్ళతోపాటు, కాటుక మరకలు పచ్చటి శ్రావణి బుగ్గలపైన చారికలు కట్టాయి.

''పిచ్చి శ్రావణీ! నీదంతా ఉత్త భ్రమ. డాక్టర్లెప్పుడూ ప్రాణాలు పోస్తారేకానీ తియ్యరు. మీది పల్లెటూరు కదా ! అక్కడ వారందరూ, గోరంతను కొండంతలుగా చేసి చెప్పుకుంటారు. అదే నీ మనసులో నిల్చిపోయింది. చిన్నప్పుడు నాకు చాలా జబ్బుచేస్తే బ్రతికించింది ఈ డాక్టర్లే తెలుసునా ?'' అన్నాడు.

''నిజంగా?'' అంది నమ్మలేనట్లుగా ముఖం పెట్టి శ్రావణి.

''నిజం'' అన్నాడు నమ్మకంగా శ్రీహరి.

''ఆయుస్సు తీరిన వాళ్ళెవరో చనిపోతే అది డాక్టర్లు చేశారనటం చాలా తప్పు. డాక్టరు ప్రపంచానికే తండ్రిలాటివాడు తెలుసా ? మనకి ఏ జబ్బువచ్చినా దాచకుండా డాక్టరుకి చెప్పుకోవాలి. ఇప్పుడు వైద్యంలో ఎన్నో ఆధునిక పద్ధతులు వచ్చాయి'' అంటూ టెస్ట్ ట్యూబ్ బేబిని గురించి చెపుతున్న భర్తవైపు నోరు తెరుచుకుని వింటూ వుండిపోయింది.

తమ చుట్టాలలో జరిగినదొకటి, జరగనివో పది కథలుగా కల్పించి చెప్పి డాక్టర్లు మంచి వాళ్ళు అనే భావం భార్య మనసులో ప్రవేసించేటట్లుగా చెయ్యటానికి తలప్రాణం తోకకి వచ్చినట్లయింది శ్రీహరికి.

మొత్తానికి ఎలా అయితేనేం మర్నాడు భార్యని డాక్టరు దగ్గరకు తీసుకువెళ్ళటానికి ఒప్పందం చేసుకున్నాడు.

కానీ శ్రావణికి మాత్రం గుండెలు గుభేలు మంటున్నాయి.

ఆ రాత్రి పక్కనే పడుకున్న శ్రావణి భర్తవైపు తిరిగి'' ఏమండీ నాదో చిన్న కోరిక''అంది.

''ఏమిటీ ?'' అన్నాడు శ్రీహరి.

''డాక్టరు మిమ్మల్ని పరీక్షించేటప్పుడు మీ దగ్గర నేనుంటాను, నన్నుపరీక్షించేటప్పుడు మీరు నా దగ్గర వుండండి. అప్పుడు మనల్ని ఎవ్వరూ ఏమీ చెయ్యలేరు'' అంది గొప్ప సలహా చెపుతున్నట్లుగా.

''ఖర్మరా నాయనా బొద్దుగా, ముద్దుగా, అందంగా వున్నదని ఆశపడి చదువు లేకపోయినా ఫర్వాలేదని సరిపెట్టుకుని, నిన్ను చేసుకున్నందుకు నా గడ్డి నన్ను తిన్పిస్తున్నావుకదా'' అని తల చేత్తో పట్టుకుని కూర్చున్నాడు శ్రీహరి.

''ఏమండీ తలనెప్పిగావుందా ? లేక నే చెప్పిన సలహా నచ్చలేదా?'' అంది అమాయకంగా శ్రావణి.

''తలనెప్పికాదు. నీ మాటలతో నాకు పిచ్చెక్కేటట్లుగా వుంది. కళ్ళు మూసుకుని పడుకో, మరింకేం మాట్లాడకు'' అన్నాడు.

''నే చెప్పింది నచ్చకపోతే కోపం ఎందుకు?'' అని సణుక్కుంటూ భర్తకి దూరంగా జరుగుతూ చివరగా పడుకుంది శ్రావణి.

భార్యనయితే కసురుకున్నాడు కానీ మళ్ళీ జాలి ముంచుకొచ్చింది శ్రీహరికి. తను కూడా ఆమెకి దగ్గరగా జరిగి తనకేసి తిప్పుకుంటూ ప్రేమగా 'కోపం వచ్చిందా ?' అన్నాడు.

''నాకెందుకు కోపం. మీకు వచ్చింది– నా మాటలకు కోపం'' అంది లీలగా కంట్లో నీరు తిరుగుతుంటే ?

ఒక్క క్షణంపాటు మనసు గిలగిలలాడింది శ్రీహరికి భార్యను నొప్పించానన్న బాధతో. మరింతగా ఆమెకి దగ్గరవుతూ 'డాక్టర్లు, పరీక్షించేటప్పుడు ఎవ్వరూ వుండకూడదు రేపు డాక్టరు ఏమి అడిగినా సరే దాచకుండా చెప్పేయాలి. తెలుసా ?' అన్నాడు.

''దాచేందుకు ఏమున్నాయి'' అంది శ్రావణి అర్థంకాక.

''నా ఉద్దేశం అదికాదు. అడిగినవాటికి సరిగా జవాబు చెప్పమని'' అన్నాడు.

''సరేలెండి. అయినా మీరూ వుంటారుగా'' అని అనబోయి అంతలోనే మళ్ళీ నాలిక కొరుక్కుంది.

భార్యలా అనటం చూసి నవ్వుకున్నాడు శ్రీహరి.

* * *

విజయా క్లినిక్ ముందు రిక్షా దిగి భర్త వెనకాల బిక్కు బిక్కుమంటూ నడిచింది శ్రావణి.

ముందు భార్యను బయటకూర్చోపెట్టి తను డాక్టరుతో మాట్లాడటానికి లోపలికి వెళ్ళాడు శ్రీహరి.

ఒంటరిగా కూర్చున్న శ్రావణి హాస్పిటల్ వాతావరణాన్ని భయం భయంగా పరిశీలిస్తోంది. అయిదు సంవత్సరాలకే ఈయనకి పిల్లలు పుట్టలేదని ఇంత కంగారేమిటో. అత్తయ్య అయితే మరీనూ ఎప్పుడూ పిల్లల ధ్యాసే. పెళ్ళయిన వాళ్ళకి పిల్లలు పుట్టరా ఏమిటీ ? వీళ్ళకంతా హడావిడే. తమ ఊరిలో పెళ్ళయిన పాతికేళ్ళకి కూడా పిల్లలు పుట్టినవాళ్ళు ఒకరిద్దరు ఆమె మనసులో మెదిలారు.

ఆలోచనలు పారదోలుతూ నర్సువచ్చి లోపలికి రమ్మనటంతో ఉలిక్కిపడి లేచి లోపలికి నడిచింది.

''ఈవిడే నా మిసెస్ శ్రావణి'' అన్నాడు శ్రీహరి.

నమస్కారం చేసింది.

చిరునవ్వుతో ప్రతినమస్కారం చేస్తున్న డాక్టరుని చూడగానే కొంతవరకు భయం

తొలగినా బెరుకు మాత్రం తగ్గలేదు.

డాక్టరు టెస్టు చెయ్యటానికి రూమ్‌లోకి రమ్మంటుంటే భర్తవంక చూసింది.

మరేం భయం లేదని వెళ్ళి రమ్మని కళ్ళతోనే హామీ ఇచ్చాడు శ్రీహరి.

''చూడమ్మా నీకు పీరియడ్స్ కంటిన్యూగా వస్తాయా ?'' అంది డాక్టరు.

''వస్తుంది''అన్నట్లుగా తలవూపింది.

''నీకు కడుపు నెప్పిగానీ, లేక వేరే ఇతర బాధలు కానీ వున్నాయా'' అంది మళ్ళీ.

అటువంటివేంలేవని చెప్పింది శ్రావణి.

''పెళ్లయాక నెల తప్పటం అంటూ జరగలేదా ?'' అని ప్రశ్నించింది.

సిగ్గుగా లేదని తల వూపింది శ్రావణి.

ఇంకా కొన్ని ప్రశ్నలు అడుగుతుంటే శ్రావణి మనసు సిగ్గుతో కుంచించుకుపోయింది. కొంతవరకూ డాక్టరు ఆడది అయినందుకు సంతోషించింది కూడా ఒక రకంగా. డాక్టరు అడిగిన ప్రశ్నలు ఆవిడకి ఎంతవరకు ఉపయోగ పడతాయో అర్థం కాలేదు.

బల్లమీద పడుకున్న శ్రావణికి అదొక శిక్ష లాగా అనిపించింది. త్వరగా పూర్తయితే బాగుండును అని కూడా అనుకుంది.

ఆమెను పరీక్షిస్తున్న డాక్టరు మధ్యలో ''నీ కేదన్నా ఆపరేషన్ జరిగిందా ?'' అని ప్రశ్నించింది. పొత్తికడుపుమీద అంగుళంమేర గీతని చూస్తూ.

తనకేం ఆపరేషన్ జరిగిందా అనుకున్న శ్రావణికి చిన్నప్పుడు తనకు ఏదో సెగ్గడ్డలేస్తే అది ఎంతకూ తగ్గకపోతే ఆపరేషన్ చేశారని తల్లి చెప్పిన మాటలు గుర్తుకువచ్చి అదే మాట డాక్టరుతో చెప్పింది.

డాక్టరు అటు తిప్పి, ఇటు తిప్పి ఎన్ని ప్రశ్నలు వేసినా ఒకే సమాధానం చెపుతోంది శ్రావణి.

డాక్టరు పని పూర్తయింది. ఆమె ముఖం ఎందుకో అప్రసన్నంగా అనిపించింది శ్రావణికి.

తన భర్తతో డాక్టరు టకటకా ఏదో ఇంగ్లీషులో చెపుతోంది. ఆ మాటలు విన్న శ్రీహరి ముఖంలో రంగులు మారటం, కళ్ళు కోపంతో జేవురించటం చూసిన శ్రావణి గుండెలు దడదడలాడినాయి.

డాక్టరు ఫీజుచెల్లించి ఏం మాట్లాడకుండా బయటకు నడిచాడు శ్రీహరి.

రిక్షాలో కూడా ముభావంగా కూర్చున్న భర్తకేసి చూస్తూ ''డాక్టరు ఏమని చెప్పింది'' అంది.

''నన్నేం అడగవద్దు''ని కళ్ళు మూసుకుని కణతలు బలంగా నొక్కుకున్నాడు శ్రీహరి.

భర్త ప్రవృత్తి అర్థంకాక భయపడ్డది. అయోమయంలో పడ్డది.

## 2

''అబద్ధం. నేను నమ్మను. నాకేం జరగ

# శ్రావణి

లేదు'' అని పిచ్చెక్కిన దానిలా అరుస్తోంది శ్రావణి.

''ఎందుకే అలా గొంతు చించుకుంటావు. నువ్వు కాదంటే మాత్రం ఎవరు నమ్ముతారు. అయ్యో భగవంతుడా ఎంత చేటు తెచ్చిపెట్టా వయ్యా. ఒరేయి బాబు హరీ నీ గొంతు కోశానురా నాయనా. నాకు నువ్వు ఒక్కడివే అయినా నీ కడుపునయినా నల్గురు పుడితే నా నట్టిల్లు కళ కళ లాడుతుందని కలలు కన్నాను. ఇంత ఘోరం ఎక్కడా జరగలేదు. ఒసేవ్ మహమ్మారి దానా ఎందుకు చేశావే ఈ పని. నా కొంప కూల్చటానికి కంకణం కట్టు కున్నావే ? '' అని తిడుతూ మధ్య మధ్యలో జరిగిన దానికి ఏడుస్తోంది రవణమ్మ.

''అత్తయ్యా ! ... మీరు కూడా నమ్ము తున్నారా ? ఎప్పుడూ పల్లెత్తు మాట కూడా అనని నన్ను తిడుతున్నారా?'' అంది గద్గదంగా.

''తిట్టక, పూజించమంటావా. నీ ముఖం నాకు చూపించకు.'' అంది కోపంగా.

''ఏమండీ ? మీరయినా నన్ను...''శ్రావణి మాట పూర్తికాక ముందే ?

''ఎందుకు చేశావీ పని ? '' అన్నాడు తీక్షణంగా చూస్తూ శ్రీహరి.

భర్త అలా ఎదురు ప్రశ్న వేస్తుంటే సమాధానం ఏంచెప్పాలో తెలియలేదు ఆమెకు. అసలామాట వినగానే ఒక్కసారిగా వెయ్యిపిడుగులు తన మీద పడ్డట్లుగా అనిపించింది. హాస్పటల్ నుంచి రాగానే అత్తగారితో చెప్పటం విని తనసలు ఈ లోకంలో వుందా లేదా అనిపించింది. లేకపోతే తన కేమిటి పిల్లలు కల్గకుండా ఆపరేషన్ జరగటమేమిటి. లేదు, ఇది నిజం కాదు. ఇందులో ఏదో మోసం వుంది. తన నసలు పరీక్షించింది డాక్టరు కాదేమో నన్నంత అనుమానం కూడా వచ్చింది.

''ఆ మోసం చేసిన దాన్ని అడిగితే ఏం చెప్తుందిరా. మరిన్ని అబద్ధాలు తప్ప. అందుకే కాబోలు నేను ఎప్పుడు పిల్లల మాట ఎత్తినా మాట్లాడేది కాదు. ప్రపంచంలో జరిగే మోసాలు నేనూ వింటున్నాను కానీ, ఇంత కనీ వినీ ఎరగని ఘోరం ఎక్కడా చూడలేదు. నా వంశం నిర్వశ్యం అవవల్సిందేనా'' అంటూ విలపిస్తోందావిడ.

తల్లి అలా దీనంగా ఏడవటం చూసిన శ్రీహరికి తన గుండెల్ని రంపంపెట్టి కోస్తు న్నట్లుగా అనిపించింది. అప్పటివరకు భార్యను ఎంతో అమితంగా ప్రేమించే అతని మనసు నిండా అసహ్యం పేరుకుంది. తల్లి అన్నమాటలే చెవుల్లో ప్రతిధ్వనించసాగాయి. అవును అమ్మ అన్నమాటలు నిజమే.తను పిల్లల గురించి ఎప్పుడు ఎత్తినా శ్రావణి భావాలు మారిపోయేవి. ''ఆ( !

పుడతారులేద్దురు. పిల్లలకేం కొరత. అయినా నాకు తెలియక అడుగుతాను ఇప్పటి నుంచి మీకింత పిల్లల పిచ్చి ఏమిటని'' తన మాటలను త్రోసిపుచ్చేది. మూడు సంవత్సరాలు చూశాడు. కానీ ఫలితం శూన్యం. తను డాక్టర్ని కలిసి తనలో ఏ లోపం లేదని తేల్చుకున్నాక శ్రావణిని ఒత్తిడి చేశాడు. తను ఆ ప్రసక్తి ఎత్తితేనే ఏదో వంకతో మార్చేది. ఆఖరిసారిగా తను పట్టుపట్టి చూపించిన దానికి ఫలితంగా బయట పడింది భయంకర సత్యం.

''ఏమండీ నేను చెప్పేమాట'' అని తన భుజంమీద చెయ్యివేసిన భార్య వంక జుగుప్సగా చూశాడు శ్రీహరి నువ్వా అర్హత పోగొట్టు కున్నావన్నట్లు.

ఆ చూపుకి విలవిల లాడిందామె మనసు. ''ఎందుకండి మీకంత కోపం. శ్రావణీ, శ్రావణీ, అంటూ పొద్దస్తమానం నా కొంగు పట్టుకు తిరిగే మీరు, ఒక్క క్షణమయినా నన్ను చూడందే

వుండలేని మీరు, మీరు నన్ను నా శీలాన్ని శంకి స్తున్నారా ?'' అంది దీనంగా.

''అనుమానించటానికి తగిన ఆధారం దొరికింది కాబట్టే అనుమానించవల్సి వచ్చింది. అంత స్వేచ్ఛగా తిరగదల్చుకున్న దానివి పెళ్ళెందుకు చేసుకున్నావు. నీకు అక్కర్లేక పోయినా కట్టుకున్న మొగుడికి పిల్లలు కావల్సి

వస్తారని ఆ రోజు నీ రహస్యం బట్టబయలవు తుందన్న ఆలోచనా, పాపం పెళ్ళికి ముందు రాలేదు. అవునా ? ఆ ఆలోచన అప్పుడు వచ్చి వుంటే ఈ పెళ్ళికి ఇష్టపడే దానివి కాదు. అవునా ?'' వ్యంగ్యంగా అన్నాడతను.

''అబద్ధం. కాదు ! కాదు ! కాదు!'' అంది ధారాపాతంగా ఏడుస్తున్న శ్రావణి.

''ఏది కాదు. పెళ్ళికి ముందు నువ్వు చేసిన పాడుపనులు బయటకు రాకుండా వుండటానికి ఆపరేషన్ చేయించుకోవటం నిజం కాదా ? ఆ నిజాన్ని అబద్ధంగా దాచిపెట్టి నీ అందంతో, అమాయకత్వంతో ఆకర్షింప చేసుకుని పెళ్ళిపేరుతో నన్ను మోసం చెయ్యటం నిజం కాదా ? ఆ మోసాన్ని డాక్టరు వెల్లడి చెయ్యటం నిజంకాదా ? ఇన్ని నిజాల్ని అబద్ధాలుగా చెప్ప టానికి నీకు సిగ్గులేదు'' అన్నాడు ఛీత్కారంగా చూస్తూ.

''భగవంతుడా ! మిమ్మల్ని ఎలా నమ్మిం చాలో నాకు తెలియటంలేదు. ఏ పాపం ఎరగని నామీద ఇంతంత అభాండాలు వేస్తుంటే భరించ లేకపోతున్నాను'' అంది అప్పటివరకు ఏడ్చి ఏడ్చి అలసిపోయిన శ్రావణి.

''పాపం చేసిన మనసుతో దేముడు పేరును

# ఇవే'మన' పద్యాలు




మెఱుము మెఱయగాను మేఘమునక బలిమి
కదిసివాన గలుగు గణనమించు
మెఱుము మెఱయకున్న మఱి వానలును సున్న
విశ్వదాభిరామ వినుర వేమ.

కూడా అపవిత్రం చేస్తావెందుకు — నో, ఐయికాంట్ బేర్ ఇట్.'' పిడికిలి బిగించి నుదుట కొట్టుకున్నాడతను.

భర్తలా నుదురు బాదుకోవటం చూసిన శ్రావణి మనసు విలవిలలాడింది. ఓదార్చటానికి దగ్గరకెళ్దామని, ఆపాలని బలంగా అన్పించినా కూడా అతని మాటలు మనసులో మెదిలి అచేతనంగా వుండిపోయింది.

## శ్రావణి

''అది బాగానేవుంది.మధ్యలో నువ్వెందుకురా తల బాదుకుంటావు. తర్వాత ఏం చెయ్యాలో ఆలోచించు'' అందావిడ కొడుకు బాధ చూడ లేక.

''ఏం ! ఆలోచించనమ్మా. తెలియక తప్పు చేస్తే మందలిస్తాం. కానీ ఇది క్షమించేటంతటి తేలికపనా రేపు నల్గురికీ ఈ విషయం తెలిస్తే నాకు ఎంత అప్రదిష్ఠ, అవమానం. ఈ పరిస్థితిలో నన్నేం చెయ్యమంటావమ్మా'' అన్నాడు శ్రీహరి బాధగా.

న్యాయస్థానంలో నిలబడిన ముద్దాయిలా వుంది శ్రావణి మనసు.

''కుక్కముట్టిన కుండని నిప్పుతో కాలిస్తే అయినా శుద్ధి అవుతుంది. దీన్ని ఏ నిప్పులతో కాలిస్తే శుద్ధి అవుతుంది. ఎలా పనికివస్తుంది. అయినా మనకి ఉపయోగపడనిదాన్ని వుంచు కోవటం అనవసరం.'' నర్మగర్భంగా అందావిడ.

తల్లి డొంకతిరుగుడుగా అన్నా ఆమె మాటలు నిజం అన్పించకపోలేదు శ్రీహరికి.

నిప్పులకుండలా వున్న అతని మనసు ఏమీ ఆలోచించే పరిస్థితిలో లేదిప్పుడు. అందుకే తల్లి నిర్ణయాన్ని అమలుపరుస్తున్నాడు.

''నీ బట్టలు సర్దుకో'' అన్నాడు ముభావంగా.

అతని అభిప్రాయాన్ని అర్థం చేసుకున్న శ్రావణి మేను ఒక్కసారిగా కంపించిపోయింది. బతిమాలింది, ఏడ్చింది, పోట్లాడింది. కానీ ఆ ప్రభావం ఎవరి మనసుమీదను పని చెయ్య లేదు.

ఆఖరిసారిగా రైల్లో కూర్చున్న భార్య చేతిలో టిక్కెట్టుతోపాటు కొన్నినోట్లుకూడా వుంచాడు శ్రీహరి. ఏదో చెప్పబోయిన ఆమె ముఖం చూడటం ఇష్టం లేనివాడిలా పక్కకు తిప్పుకున్నాడు.

బిగ్గరగా కూతవేస్తూ రైలు కదిలింది.

కళ్ళనిండుగా నీళ్ళు తిరగటంతో శ్రీహరి రూపం మసకమసగా కన్పించింది శ్రావణి కళ్ళకు.

దూరమయిపోతున్న రైలు, జన సందోహం తగ్గిన ఖాళీ ప్లాట్‌ఫారమ్‌మీద ఒంటరిగా నిలబడి పోయిన శ్రీహరి మనసు ఒక్కసారిగా బావురు మంది. ముడుకులమీద చేతులాన్చుకుని ఎదురుగా వున్న ఖాళీ బల్లమీదకూర్చుని జరిగింది నిజమేనా అని పునశ్చరణ చేసుకోసాగాడు.

అయిపోయింది. తన అయిదేళ్ళ అనుబంధం ఈ రోజుతో తీరిపోయింది. ఇంటికి వెళ్ళగానే చిరునవ్వుతో ఎదురొచ్చే శ్రావణి ఇంకలేదు. దేవతలేని ఆలయంలో అడుగుపెట్టని వ్యక్తిలా, శ్రావణిలేని శూన్యమయిన ఆ లోగిలిలో అడుగు పెట్టటం తనకిక అసాధ్యం. అలా ఎన్నిగంటలు నిశ్చల సమాధిలో కూర్చున్నాడో అతనికే తెలియదు. టైము చూసి తృళ్ళిపడ్డాడు. ఇంటి దగ్గర తల్లి గుర్తుకు వచ్చి బలవంతాన లేచాడు అన్యమనస్కంగానే.

[ఇంకా వుంది]

# ప్రేమ్ సబ్బుతో స్నానం
# రోజంతా ఉల్లాసం

మీ శరీరమునకు మృదుత్వమునిచ్చి సహజ
సౌందర్యమును పెంపొందించు సబ్బు ప్రేమ్.
దీని స్వచ్ఛమైన నురగ, పరిమళము
మీ మనసును పులకింపజేయును.




గులాబి మఱియు ఆకుపచ్చ
రంగులలో లభించును



జయలక్ష్మి
గుంటూరు వారి తయారీ

Imageads M-1783



# సినిమా విశేషాలు

-జి. వి. జి.

"ఉద్దండుడు"లో కృష్ణ, సుమలత

**నమోదు చేయబడిన చిత్రాల పేర్లు**

లక్ష్మీజ్యోతి ఫిలిమ్స్ ''స్మగ్లర్'', శ్రీ హరిలక్ష్మి ఫిలిమ్స్ ''తల్లి గోదావరి'', ఆర్. కె. ఫిలిమ్ ఎంటర్‌ప్రైజెస్ ''అమాయకులుకాదు; అగ్నిభరాటాలు'', పి. వి. ఎస్. ఫిలిమ్స్ ''భగవాన్'', ఎస్. వి. ఎస్. ఫిలిమ్స్ ''శ్రీమతి లీల—శ్రీవారి గోల'', ఇంటర్నేషనల్ ఎంటర్‌టైన్‌మెంట్ ''వజ్రాయుధం'', అరుణోదయా ఆర్ట్స్ పిక్చర్స్ ''గోపీకృష్ణ'', శ్రీ కమలా సరస్వతి పిక్చర్స్ ''ఛాలెంజి అమ్మాయిలు'', హనుమాన్ ఆర్ట్స్ పిక్చర్స్ ''ఇన్‌స్పెక్టర్ దొంగ'', రాజలక్ష్మి మూవీస్ ''కేడీ'', శ్రీకర్ ప్రొడక్షన్స్ ''ఆడపెత్తనం – మగపెత్తనం'', పురంధర ప్రొడక్షన్స్ ''భక్తి శక్తి'', విష్ణు కుమార్ పిక్చర్స్ ''భక్త మాధవదాస్'', విజయాంబికా మూవీస్ ''భీషణ సమరం'', యు. ఎస్. ఆర్. పిక్చర్స్ ''దేశద్రోహులు'', దేవీ కమల్ మూవీస్ ''దొంగల్లో దొర'', నవత ఆర్ట్స్ ''జీవితం సినిమా కాదు'', జయశ్రీ చిత్ర ''కుర్రది–కుర్రాడు'', కౌసల్యా పిక్చర్స్ ''మంత్రదండం'', లక్ష్మీనారాయణ క్రియేషన్స్ ''సింగపూర్ సి. ఐ. డి.''.



'అభిమన్యుడు' లో స్మిత

## "కుర్ర చేష్టలు" లో పెళ్ళి పేటాకులు

ఆ ఇంటి గోడల నిండా '' జూలై 23 '' అని రాసి ఉంది, దేవదాస్ గెటప్‌లో సింహాచలం ( రాళ్ళపల్లి ) మద్యం సేవిస్తూ, ''జగమే మాయ ... బతుకే మాయ ... చెల్లెమ్మా, నీ జాతకం చెల్లకొట్టేనయ్యా... ఓం కు జెల్ల కొట్టేనయ్యా... ఇరవై మూడనీ, జూలై నెలయనీ – వేదాంతులే మాయ చేశారయ్యా ... మస్కా కొట్టారయ్యా...'' అంటూ విపరీతంగా దగ్గసాగాడు.

అరుగు మీద తాపీగా బఠాణీలు తింటూ కూర్చొన్న జయమాలిని ''పోన్లే, అన్నయ్యా!



'అమ్మాయిలూ ప్రేమించండి'లో రాధిక



సుమన్, విజయశాంతి, 'కుర్రచేష్టలు'

మన మామయ్య తండ్రికి డబ్బుందనేగా అతని కొడుక్కిచ్చి పెళ్ళి చెయ్యాలనుకున్నావ్ ? మరో మామయ్య తండ్రిని చూస్తే సరి,'' అంది.

సింహాచలానికి కైపు నసాళానికెక్కింది. ''నోర్ముయ్ ! నేను దేవదాసులాగా దగ్గుతూ గుండెలు బాదుకుంటూంటే, నువ్వు దేవదేవిలాగా శెనగలు తింటూ చమత్కారాలు చెప్తున్నావ్ ?'' అంటూ సీసాతో చెల్లెల్ని కొట్టబోయాడు. పెళ్ళి కెళ్ళి తిరిగొచ్చిన అతని భార్య హడావిడిగా వచ్చి అతని చెయ్యి పట్టుకుని, ''ఆగవయ్యా ఆగు ! అత్త మీది కోపం దుత్త మీద చూపించి నట్టు ఆళ్ల మీది కోపం దీని మీద ఎందుకూ చూపించడం ? జూలై 23 నాడు నీ చక్రం గిర్రుమంటూ తిరగేస్తాడని చెప్పి వంద రూపాయలు మడతెట్టుకెళ్ళిపోయాడే— ఆ జ్యోతిష్యుడి మీద చూపించు'' అంది.

ఇంతలో విడాకుల శాస్త్రి వచ్చాడు. అతన్ని చూడగానే సింహాచలం భోరున ఏడ్చాడు. ''నాకెంత అన్యాయం జరిగిపోయిందో చూసేవా? జూలై 23 గోడ మీద కూడ రాసినాడు ... అంతా అయిపోయింది.''

''పెళ్లి జరిగిపోయిందని నువ్వేం కంగారు పడకు. పెరుగుట విరుగుట కొరకే, పెళ్లి జరుగుట విడాకుల కొరకే - అని పెద్దలన్నారు. వాళ్ల కాపురంలో కల్లోలం రావాలంటే శనీశ్వరుడికి అభిషేకం చేయించాలి,'' అంటూ శాస్త్రి ఓదార్చాడు.

''అలాగే...శనీశ్వరుడి గుడి ఎక్కడుంది ?''

శాస్త్రి అక్కడున్న ఒక గ్లాసు అందుకుంటూ, ''వెయ్యి శనేశ్వరుల పెట్టు నేనుండగా వేరే ఎక్కడో అభిషేకం ఎందుకు చేయించడం ? ఈరోజు నుంచి జూలై 23 దాకా ఈ మందులో నాకు అభిషేకం చెయ్. ఆ తర్వాత చూస్కో'' అంటూ గ్లాసులో మద్యంపోసి, ''కొత్త దంపతుల పెళ్లి— పెటాకుల కింద మారిపోవడానికి

శారద, జయసుధ, కృష్ణ "మహా సంగ్రామం"





"మహా సంగ్రామం"లో జయసుధ, శోభన్‌బాబు.



విజయశాంతి, మురళీమోహన్, "సీత పుట్టిన దేశం"లో

## కోటారెడ్డి దర్శకత్వంలో "తమాషాలో తదిగిణతోం"

"ఆగస్టు 1న పాటల రికార్డింగ్, ఆగస్టు 22న హైదరాబాద్‌లో షూటింగ్ ప్రారంభిస్తున్నాం." అన్నారు సి. హెచ్. వి. నాగయ్య. ఈయన సమర్పించే ప్రసాద్ ఇంటర్నేషనల్ ఫిలిమ్స్ వారి పై వినోదాత్మక చిత్రంలో నరేష్, బాలాజి, అరుణ, రాళ్ళపల్లి, వేలు, వీరభద్రరావు, హేమసుందర్, నీరజ, మైత్రేయ నటిస్తారు. కాశీ విశ్వనాథ్ మాటలు, శంకర్ గణేశ్ సంగీతం, ఓ. ప్రభాకర్ ఛాయ, రమేష్ రెడ్డి కూర్పుతో శ్రీమతి నాగయ్య నిర్మించే ఈ చిత్రానికి ఎం. ఎస్. కోటారెడ్డి స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తారు.

## రేలంగి నరసింహారావు దర్శకత్వంలో స్థిర ఛాయా చిత్రకారులు మోహన్‌జీ - జగన్‌జీ రూపొందించే చిత్రం

"రమేష్ నాయుడు మ్యూజిక్ డైరెక్షన్‌లో పాటలన్నీ రికార్డ్ చేశాం." అన్నారు మోహన్‌జీ. ఈయనా, గంధం జగన్ మోహన్ నిర్మించే రమా "సినీ చిత్రాలయవారి తొలి చిత్రంలో చంద్రమోహన్, శరత్ బాబు, సత్యనారాయణ, పి. ఎల్. నారాయణ, రావి కొండలరావు, భానుప్రియ, రాజ్యలక్ష్మి, సంగీత, అత్తిలి లక్ష్మి వగైరా తారాగణం. పూసల సంభాషణలు. డి. కోటేశ్వరరావు ఛాయ, భాస్కర రాజు శిల్పం, కే. బాలు కూర్పు. జార్జి ప్రొడక్షన్‌తో రేలంగి నరసింహారావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు. "ఆగస్టు 1 నుంచి 10, సెప్టెంబరు 1నుంచి 7, సెప్టెంబర్ 27నుంచి అక్టోబర్ 10 వరకు మూడు షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది." అన్నారు ఈ చిత్రాన్ని సమర్పించే జగన్‌జీ. గుమ్మడి గెస్టుగా నటిస్తున్నారు.



"నన్ను సినిమాకు తీసుకెళ్ళటం ఇష్టం లేకపోతే మానేయండి. అంతేగానీ, వచ్చి మీరు హాల్లో నిద్ర పోతుంటే, సిగ్గుతో నే చచ్చిపోతున్నాను!"

## "సినీ తార"

నిర్మాణంలో ఉండగానే గొప్ప సంచలనం సృష్టించిన "లేఖయుడే మరణం ఒరు ఫ్లాష్ బాక్" అనే మలయాళ చిత్రాన్ని పై పేరున లావణ్యా ఆర్ట్ "ఎక్సర్స్ అధినేతలు వి. ఎస్. వి. నరసింహారావు, పర్వతరెడ్డి శివకుమార్ తెలుగులో అనువదిస్తున్నారు. ధక్కా మక్కీలు తిన్న సినీ తారగా నళిని ప్రధాన భూమికను నిర్వహించిన ఈ చిత్రంలో శారద, జయచిత్ర, శుభ ఇతర పాత్రధారులు. మాటలు, పాటలు గోపి రాశారు. కె. జి. జార్జ్ దర్శకుడు.

పూర్ణిమ, విజయశాంతి, రాజ్యలక్ష్మి "ఈ చరిత్ర ఇంకెన్నాళ్ళు ?"



"రుస్తుం"లో అన్నపూర్ణ, చిరంజీవి, గుమ్మడి





మహా సంగ్రామం లో జయసుద శోభన్‌బాబు



విజయశాంతి మురళీమోహన్ సీత పుట్టిన దేశం లో

## కోటారెడ్డి దర్శకత్వంలో తమాషాలో తదిగిణతోం

ఆగస్టు 1న పాటల రికార్డింగ్ ఆగస్టు 22న హైదరాబాద్‌లో షూటింగ్ ప్రారంభిస్తున్నాం అన్నారు ఎ హెచ్ వి నాగయ్య ఈయన సమర్పించే ప్రసాద్ ఇంటర్నేషనల్ ఫిలిమ్స్ వారి పై వినోదాత్మక చిత్రంలో నరేష్ బాలాజి అరుణ రాళ్ళపల్లి వేలు వీరభద్రరావు హేమసుందర్ నీరజ మైత్రేయ నటిస్తారు కాశీ విశ్వనాథ్ మాటలు శంకర్ గణేశ్ సంగీతం ఓ ప్రభాకర్ ఛాయ రమేష్ రెడ్డి కూర్పుతో శ్రీమతి నాగయ్య నిర్మించే ఈ చిత్రానికి ఎం ఎస్ కోటారెడ్డి స్క్రీన్‌ప్లే దర్శకత్వ బాధ్యతలు వహిస్తారు



"నన్ను సినిమాకు తీసుకెళ్ళటం ఇష్టం లేకపోతే మానేయండి అంతేగానీ వచ్చి మీరు హాల్లో నిద్ర పోతుంటే సిగ్గుతో నే చచ్చిపోతున్నాను!

## రేలంగి నరసింహారావు దర్శకత్వంలో స్థిర ఛాయా చిత్రకారులు మోహన్‌జీ - జగన్‌జీ రూపొందించే చిత్రం

రమేష్ నాయుడు మ్యూజిక్ డైరెక్షన్‌లో పాటలన్నీ రికార్డ్ చేశాం అన్నారు మోహన్‌జీ ఈయనా గందం జగన్ మోహన్ నిర్మించే రమా ఎనీ చిత్రాలయవారి తొలి చిత్రంలో చంద్రమోహన్ శరత్ బాబు సత్యనారాయణ పి ఎల్ నారాయణ రావి కొండలరావు బానుప్రియ రాజ్యలక్ష్మి సంగీత అత్తిలి లక్ష్మి వగైరా తారాగణం పూసల సంభాషణలు డి కోటేశ్వరరావు ఛాయ బాస్కర రాజు శిల్పం కే బాలు కూర్పు జార్జి ప్రొడక్షన్‌తో రేలంగి నరసింహారావు స్క్రీన్‌ప్లే దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు ఆగస్టు 1 నుంచి 10 సెప్టెంబరు 1నుంచి 7 సెప్టెంబర్ 27నుంచి అక్టోబర్ 10 వరకు మూడు షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది అన్నారు ఈ చిత్రాన్ని సమర్పించే జగన్‌జీ గుమ్మడి గెస్టుగా నటిస్తున్నారు

## సినీ తార

నిర్మాణంలో ఉండగానే గొప్ప సంచలనం సృష్టించిన లేఖయుడే మరణం ఒరు ఫ్లాష్ బాక్ అనే మలయాళ చిత్రాన్ని పై పేరున లావణ్యా ఆర్ట్ పిక్చర్స్ అదినేతలు వి ఎస్ వి నరసింహారావు పర్వతరెడ్డి శివకుమార్ తెలుగులో అనువదిస్తున్నారు డక్కా మక్కీలు తిన్న సినీ తారగా నళిని ప్రదాన భూమికను నిర్వహించిన ఈ చిత్రంలో శారద జయచిత్ర శుబ ఇతర పాత్రదారులు మాటలు పాటలు గోపి రాశారు కె జి జార్జ్ దర్శకుడు

పూర్ణిమ విజయశాంతి రాజ్యలక్ష్మి ఈ చరిత్ర ఇంకెన్నాళ్ళు ?



రుస్తుం లో అన్నపూర్ణ చిరంజీవి గుమ్మడి





'ముక్కోపి'లో సత్యనారాయణ, నరేష్



''అన్నం పెట్టిస్తానా ? వద్దు బాబూ ! ఈ సినిమా చూస్తే కడుపు నిండుతుంది. డబ్బులియ్యి !''

## మురళీమోహన్ సమర్పణలో "కుటుంబ గౌరవం"

''ఆగస్టు, సెప్టెంబర్ నెలల్లో 1–15 తేదీల మధ్య జరిగే రెండు షెడ్యూల్స్‌తో చిత్రీకరణ ముగుస్తుంది,'' అన్నారు మురళీమోహన్. ఈయన సమర్పిస్తూ, ప్రధాన పాత్ర నిర్వహించే జయభేరి ఆర్ట్ ప్రొడక్షన్స్ ''కుటుంబగౌరవం'' చిత్రానికి జూలై 27న తొలిగీతం ధ్వని ముద్రితమైంది. విజయశాంతి, రంగనాథ్, సత్యనారాయణ, రావుగోపాలరావు, గిరిబాబు, నూతన్ ప్రసాద్, అన్నపూర్ణ తక్కిన తారాగణం. గణేశ్ పాత్రో, కాశీ విశ్వనాథ్ సంభాషణలు, చక్రవర్తి సంగీతం, కె. ఎస్. హరి ఛాయ, రాజగోపాల్ కూర్పుతో కిశోర్ నిర్మాణ సారథి. మాగంటి వెంకటేశ్వరరావు నిర్మించే ఈ చిత్రానికి రాజాచంద్ర దర్శకుడు.

'నాగు'లో చిరంజీవి, రాధ

## డైరెక్టర్ తాతినేని ప్రసాద్ కొత్త చిత్రాలు

★ ఎ. ఎన్. ఆర్.తో నంగునూరి శ్రీనివాసరావు సమర్పణలో ఎన్. ఆర్. అనూరాధాదేవి సెప్టెంబర్, అక్టోబర్ నెలల్లో నిర్మించే లక్ష్మీ ఫిలిమ్ కంబైన్స్ చిత్రానికి సత్యానంద్, నవకాంత్, చక్రవర్తి తెరవెనుక కృషి చేస్తారు.

★ నవంబర్, డిసెంబర్‌లలో ఆసం గోపాలకృష్ణారెడ్డి నిర్మించే చిత్రంలో చిరంజీవి హీరో.

★ జనవరి నుండి వి.బి. రాజేంద్రప్రసాద్ నిర్మించే జగపతి పిక్చర్స్‌వారి చిత్రంలో ఎ. ఎన్. ఆర్., బాలకృష్ణ నాయకులు.

★ బాలకృష్ణతో చిత్ర నంపిణీరంగానికి చెందిన విశాఖపట్నం వాస్తవ్యులు పి. సురేష్ నిర్మించే శ్రీ శాయిలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ ''మొనగాడు'' చిత్రం కూడా జనవరిలో మొదలవుతుంది. చక్రవర్తి సంగీతం, నవకాంత్ ఛాయతో పి. బాబ్జి సమర్పిస్తారు.

★ వచ్చే సంవత్సరం భీమవరపు బుచ్చిరెడ్డి ప్రారంభించే చిత్రంలో కూడా బాలకృష్ణ హీరో.



## తెలుగు నిర్మాతల మండలి అధ్యక్షులుగా నాలుగవసారి శ్రీ యం. ఎస్. రెడ్డి ఎన్నిక !

ఇటీవలనే జరిగిన తెలుగు చలన చిత్ర నిర్మాతల మండలి వార్షిక సర్వసభ్య సమావేశంలో, సుప్రసిద్ధ నిర్మాత, సహజకవి, పరిశ్రమ శ్రేయోభిలాషి శ్రీ యం. ఎస్. రెడ్డి నాలుగవసారి కూడా అధ్యక్షులుగా ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు.

1984–85 సంవత్సరానికి ఎన్నికయిన కార్యవర్గం :

అధ్యక్షులు : శ్రీ యం. ఎస్. రెడ్డి, ఉపాధ్యక్షులు : శ్రీ టి. క్రాంతి కుమార్, శ్రీ విజయబాపినీడు, గౌరవ కార్యదర్శులు : శ్రీ జి. ఆదిశేషగిరిరావు, ఎ. పుండరీకాక్షయ్య, కోశాధికారి : శ్రీ ఎ. సూర్యనారాయణ.

కార్యవర్గ సభ్యులు : శ్రీయుతులు దాసరి నారాయణరావు, డి. రామానాయుడు; ఎం. బాలయ్య, కె. రాఘవ, వాశిరాజు ప్రకాశం, పి. బాబ్జి, జి. జగదీశచంద్రప్రసాద్, వడ్డే రమేష్, అల్లు అరవింద్.

## కమలహాసన్‌తో విశ్వనాథ్ దర్శకత్వంలో ఏడిద నాగేశ్వరరావు చిత్రం

"తెలుగు, తమిళ భాషల్లో ఒకేసారి మా పూర్ణోదయ మరో సంచలనాత్మక చిత్రాన్ని తయారు చేస్తుంది," అన్నారు నిర్మాత ఏడిద నాగేశ్వరరావు. కమలహాసన్ హీరో. కె. విశ్వనాథ్ కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంతో అక్టోబర్‌లో మొదలవుతుంది.






## ఎమ్. ఎమ్. బి. - ఏలూరు

ఈ సృష్టిలో అందరికీ ఉపయోగించేది ఏది ?

★ గాలీ—నీరు—వెలుతురు.

## కె. ఎస్. కె. - గిద్దలూరు

పరాయి మగవాడు వస్తే తలుపు చాటు నుంచి ఇల్లాలు మాట్లాడితే— అది భయమా ? సిగ్గా ? నటనా ?

★ ఏం కాదు. ఆ యింటి మగవాని తత్వానికి చిహ్నం.

## రమేష్ - ఉరవకొండ

చెడిపోయిన ప్రతి ఆడదీ— చెడిపోడానికి కారణాలు చెప్పగలుగుతుంది—అవి నమ్మితే ?

★ నమ్మగలిగితే నమ్మండి — లేకుంటే లేదు. కాని అలాంటప్పుడు— కారణం లేకుండానే చెడిపోయే—చాలా మందిని గుర్తు తెచ్చుకోండి.

## సాయి - బేతపూడి

ఆడు వారి మాటలకి అర్థాలు వేరులే అంటారు. మరి మీ విషయంలో ?

★ అర్థం అంటూ వుంటే — ఫరవా లేదయ్యా సాయి, అసలర్థమే లేని మీ మాటల కంటె.

## కె. జె. - సంగం

మీరు ఆస్తికులా ? నాస్తికులా ?

★ ఆస్తి లేదు. కాని దేముడున్నాడన్న భయం వుంది.

## వి. ఎమ్. ఆర్. - హైదరాబాదు

మీ ముఖ్యమైన హాబీ ఏమిటి ?

★ అలా అని ఏమీలేదు.

## ఐ. హెచ్. కె. - కుత్తుమ

పత్రికలో మొట్ట మొదట మీ ప్రశ్నావళి చదవాలని చాలా మందికి వుంటుంది. ఎందు వలన ?

★ విసుక్కుందుకు ఏదో ఒకటి కావాలి కద. ఆకాటలిస్టుగా పని చేస్తుందనుకుంటా--ఇది.

## టి. ఎస్. ఎమ్. - ఢిల్లీ

రామలక్ష్మిగారూ, మీ దృష్టిలో నూటికి తొంభయిమంది పురుషులు మోసగాళ్లు. కానీ నూటికి నూరుమంది ఆడవాళ్లు మంచివాళ్లు. నిజాయితీ కలవాళ్లు ?

★ నేనలాంటి పిచ్చి స్టాటస్టిక్స్ ఇవ్వలేదే!!

## ఎస్. వి. ఆర్. - రూర్కెలా

విజ్ఞాన శాస్త్రం పురుషశక్తిని నిరాకరిస్తుంటే—మరి దేవుడు ఉన్నాడంటారా?

★ ఏం ? పురుషశక్తే— దేవుడా ?!

## ఎ. ఎస్. ఆర్. - ఆదవాని

పదిమందికి పంచేకొద్దీ పెరిగేది ?

★ ఇదివరకు విద్య అనేవారు. ఇప్పుడు అప్పేమో !




## కె. ఎ. ఆర్. - దోర్నకల్

ఎన్ని ప్రభుత్వాలు మారినా అనాదిగా ఆడదానికి జరుగుతున్న అత్యాచారాలకు న్యాయం జరిగేది ఎప్పుడు ?

★ సమాజంలో స్త్రీపట్ల మగవాడి హృదయం మారినప్పుడే.

## వి. కె. - రాయచూరు

జీవితం అనే ప్రశ్నకి చావడమే బదులు ! దానికి మీ బదులు ఏమిటి ?

★ చావు బదులెలా అవుతుంది. అంతం కాని !

## పి. యు. ఎమ్. - కాశీబుగ్గ

మనిషి అందుకో లేని దాన్ని కోరుకుంటాడెందుకు ?

★ అది నైజం — ప్రయత్నిస్తే దక్కక పోతుందా అని ఆశ.

కె. రా. గారు, కోరికలే గుర్రాలైతే ?

★ బెగ్గర్స్ విల్ రైడ్ దెమ్ !

## బి. బి. ఆర్. - బరంపురం

మిమ్మల్ని చూద్దామన్న ప్రతి అభిమానీ 'నన్ను చూసి జడుసుకుంటారు' అంటారు. మరి మీరు దయ్యమా భూతమా ? తెలియ చేయండి.

★ ఆ రెండు + మనిషి కాంబినేషన్.

## ఆర్. కె. ఆర్. - హైదరాబాదు

శ్రీమతి మాలతీ చందూరుగారికి వున్న పాండిత్యము మీ దగ్గరలేదు ?

★ నిజమే.

## బి. ఎస్. - ఇచ్ఛాపురం

ఒక్కొక్కసారి మీరిచ్చే సమాధానాలు మగవారిని రెచ్చకొట్టేలా వుంటాయి. అందుకు కారణం ?

★ అప్పుడేనా తామెలా ప్రవర్తిస్తున్నారో తెలుసుకుందుకు ప్రయత్నిస్తారని.

## కె. వి. ఆర్. - బరంపురం

నమ్మించి మోసగించిన ఆడదానిమీద పగ తీర్చుకోవడం తప్పా ?

★ పగ తక్షణ తృప్తినిస్తే — క్షమ శాశ్వత తృప్తినిస్తుందని నేను అనుకుంటాను. ఏది కావాలో నిర్ణయించుకోవడాన్నే విజ్ఞత అంటారు.

## ఎమ్. ఎస్. - గూడూరు

గ్రంథాలయాలలో సెక్సు పుస్తకాలు వుంచరు కారణం ఏమిటి ?

★ సెక్సు పబ్లిక్ ప్లేసుల్లో నిషిద్ధం కనుక !



# కవితాగానం చేసే కళ్లకు...

# ఐటెక్స్

అపురూప సౌందర్యంతో పొంగిపోయే
యవ్వనంతో మురిపించే వనితల వదనాలను
ఆకర్షించే అతివల కళ్లను, అనందంగా
కొనచూపులతో నటనమాడించేది ఐటెక్స్
శాస్త్రీయ విధానంలో తయారుచేయబడు
ఐటెక్స్ కాటుక అందాలు చిందేటి
యువతుల కళ్లను దోషమేమీ చేరనీయక
చల్లగా కాపాడుతుంది...

**చూపులనే మాటలుగా మార్చే ఐటెక్స్**




**ఐటెక్స్** **42** సంవత్సరములుగ మీ నమ్మకానికి
పాత్రమైన ఉన్నతమైన చిహ్నం

అరవింద్ లాబరేటరీస్ మద్రాసు **600033**

Imageads-AL 1293 Tel

వ్యాపార మరియు వర్తక వివరములకు :

**ప్రగతి ఏజన్సీస్,** పో. బా. 162, విజయవాడ–1, రాయలసీమ, నెల్లూరు, ప్రకాశం మరియు గుంటూరు జిల్లాలకు.

# కళ్ళు

— కుమారి విశ్వంభర జయంతి

చచ్చిపోవాలనిపిస్తోంది.

బ్రతికి బట్టకట్టాలని లేదు.

కాకిలా కలకాలం జీవించేకంటే 'హంస'లా ఆర్నెల్లు జీవించి ఈ తనువు చాలించి ఉంటే ఎంత బావున్ను !

హంస !

తన బ్రతుకు హంసలా సాగిందా ? క్షణ— క్షణం మనసు హింసలపాలై ప్రతి పూటా యమగండంలా గడిచింది. నరకయాతన అనుభవించి — నలభై ఏళ్ల కాయం అరవై ఏళ్ల వార్ధక్యం తెచ్చుకుంది.

సూదంటు రాయిలా పనిచేసిన కళ్ళు — గాజుకళ్లలా కళావిహీనమై పోయాయి. ఉక్కు ముక్కల్లా బిందెలకొద్దీ నీళ్లు మోసిన కాళ్ళు చొప్పకర్రల్లా చచ్చుబడిపోయాయి.

రోజంతా బట్టలుతికిన చేతులు — అంట్లు అరిగేలాతోమగలిగిన దుక్కల్లాంటి చేతులు బక్క చిక్కి తోటకూర కాడల్లా తయారయాయి. జవ సత్వాలుడిగి—జీర్ణశక్తి నశించిపోయిన ఈ తనువు మరిక ఉండెందుకు ?

తిండి కరువైన రోజుల్లో తినడానికి అర్రులు చాచిన నోరు — ఇప్పుడు ఎన్ని ఉన్నా నాలుక ఏ రుచీ సహించలేకపోతోంది.

రెండు చేతులా సంపాదిస్తున్న కొడుకు కష్టాన్ని అనుభవించలేని దరిద్ర జీవితం — ఎందుకు ?

ఇంకా ఎన్నాళ్లీ రోగిష్టి జీవితం ?

ఇంకా ఎన్నేళ్లీ పాపిష్టి జీవనం ?

బ్రతికి ఏం చేయాలి ? ఎవరిని ఉద్ధరించాలి ? ఉండి ఏం సాధించాలి ?

కొడుకు — కోడలు అన్యోన్యంగా జీవిస్తున్నారు.

ఇద్దరు పిల్లలు.

మనవడు — మనవరాలు !

ఇల్లు స్వర్గంలా ఉంది.

స్వర్గం !

స్వర్గంలాంటి గృహం.

తను చూసిందా ?

ఇల్లునిగాని — పిల్లల్నిగాని చూడగలిగిందా? కన్నకొడుకు ఏరికోరి కులాంతర వివాహం చేసుకున్నాడు. ఆ మహాతల్లి ఎలా ఉందో ?!

స్వర్గమనుకుంటున్న ఇల్లు ఎలా ఉందో ?

గదిలో తను బందీ. పడుకున్న మంచమే తనకు లోకం. తన తిండి—బట్ట—తన మందులు— అన్నీ — తనకు అవసరమైనవన్నీ తన ప్రక్కనే ఉంటాయి.

సమయానుకూలంగా అన్నీ సమకూరుస్తుంది కోడలు.

ఉదయం లేవగానే 'టీ' ఇవ్వటం మొదలు — రాత్రి పడుకునే ముందు పాలు త్రాగేవరకూ దగ్గరుండి సపర్యలు చేస్తుంది.

మళ్లా ఉదయం మామూలే !

ఉదయం లేచే సరికి పిల్లల్ని తీసుకొని కొడుకు కాన్వెంట్‌కు వెళ్తాడు. అక్కడ్నుండి అలా ఆఫీసుకు వెళ్లిపోతాడు.

సాయంత్రం తను పడుకున్నప్పుడు వస్తారు. రాత్రి భోజనానికి లేచినప్పుడు పిల్లలు తమ గదిలో చదువుకుంటుంటారు. కొడుకు తన ఆఫీసు పని చేసుకుంటాడు.

అవును !

తను పనీ పాటా లేకుండా పక్షవాతం వచ్చినదాన్లా మంచానపడి ఉంటె వాళ్ళు తమ పనులు మానేసి తన చుట్టూ కూర్చొని మాత్రం ఏం చేస్తారు ? ఎవరి పన్లు వాళ్లవి.

ఎందుకూ కొరగాకుండా పోయింది తనే ?

తను ఎన్ని ఇబ్బందులు — ఇక్కట్లు పడి చదివించింది కొడుకుని.

కొడుకు ప్రయోజకుడయ్యేసరికి తను అప్రయోజకురాలయింది. అదృష్టహీనురాలై మిగిలిపోయింది తను.

కళ ... కళ లాడిన కళ్లు కళ తప్పి కాంతి విహీనమై పోయాయి.

ఎంత దూరంలో ఉన్నా పరిచయమున్న

వ్యక్తిని ఇట్టే పసిగట్టి గలిగిన కళ్లు — గాజు గోళీల్లా మిగిలిపోయాయి.

అంధత్వం !

ఎదర బ్రతుకంతా గాఢాంధకారం.

తను చీకటిలోకి— కూపంలాంటి అంధకారంలో అడుగు పెట్టిన ఆర్నెల్లకి కొడుకు చదువుకున్న చదువుకి 'రాజా' లాంటి ఉద్యోగం వెదుక్కుంటూ వచ్చింది.

ఉద్యోగంవచ్చిన నెల్లాళ్లకి ఏ ఆడంబరాలూ— అట్టహాసాల్లేకుండా కోడల్ని ఇంటికి తీసుకు వచ్చాడు కొడుకు.

పదేళ్లు గడిచిపోయాయి.

ఈ పదేళ్లూ తన బ్రతుకిలాగే మంచాన పడి మూలుగుతోంది.

చూపు పోయిన కొత్తలో కొడుకు ఆపరేషన్ చేయిస్తానన్నాడు. తనకి మళ్లా చూపొస్తుందన్నాడు. అప్పో — సప్పో చేసి తనకి ఎలాగైనా ఆపరేషన్ చేయిస్తానన్నాడు.

అప్పుడు —

అప్పుడు తనే కాదంది

ఈ ఆఖరి క్షణాల్లో —

ఆరిపోయే ఈ కడప్రాణం కోసం ఎందుకు వేలకు వేలు తగలెయ్యటమనుకుంది.

ఇప్పుడిప్పుడే ఆర్థికంగా రాజుకుంటున్న తన కొడుకు బ్రతుకుని తన దరిద్రంతో ఆర్పేయడం ఇష్టంలేదు.

కోడలూ బ్రతిమలాడింది.

ససేమిరా కాదంది తను.

ఎందుకు ?

డబ్బు !

డబ్బు !... డబ్బు !

ఇన్నేళ్లూ తను ఎన్ని ఇబ్బందులు పడింది ఆ డబ్బు కోసం ? ఎన్ని కష్టాలు పడింది ఆ డబ్బు సంపాదించటం కోసం ?

అష్టకష్టాలుపడి ఒక పూట తినీ-తినక కొడుకుని చదివించుకుంది.

తన ఇన్నేళ్ల వూబిలాంటి దరిద్రం నుండి—

తన ఇన్నాళ్ల బురదలాంటి బీదరికం నుండి కమలంలా వికసించిన తన కొడుకు జీవితాన్ని తన దౌర్భాగ్యంతో నాశనం చేయడం తనకి సుతరామూ ఇష్టంలేదు.

కానీ,

ఇప్పుడు —

ఇప్పుడనిపిస్తోంది.

చూపు వస్తే బావున్ననిపిస్తోంది.

ముద్దు—ముద్దుగా మాట్లాడే మనవల్లని చూడాలని — ముద్దొచ్చే వాళ్ల రూపాల్ని కాంచాలని — తనివితీరా వాళ్లని ఆలింగనం చేసుకోవాలని —

నా కొనవూపిరిలో వూపిరి పోసుకుంటున్న ఆశ అదే !

నెరవేరుతుందా ?

ఈ అంతిమ క్షణంలో నా 'ఆఖరి కోరిక' ఆ భగవంతుడు నెరవేరుస్తాడా ?

భగవాన్ !

ఈ చిన్న కోరిక నెరవేర్చి నన్ను నీలో కలుపుకోవయ్యా ! నా బ్రతుక్కి చిన్ని భాగ్యం చాలు—భగవంతుడా ! చాలు !

నా మనసుని పట్టి పీడిస్తున్న 'ఆశ' కోడలు గ్రహించినట్టుంది. నా ముందరే నా 'కళ్ల' ఆపరేషన్ గురించి కొడుకుతో అంది.

వాడేమన్నాడు ?

వాడామాట అన్నప్పుడు తనెంత కుమిలిపోయిందీ. తన హృదయం ఎలా కుమిలిపోయిందీ వాడా క్షణం గ్రహించగలిగాడా ?

ఒక్కగా నొక్క కొడుకని — వాడి పురోభివృద్ధి కోసం తన్ని పూటలు కడుపు కాల్చుకుని — కన్నీళ్లతో కడుపు నింపుకొని — వాడి చిన్న మనసుకి ఎప్పుడూ కష్టం కలగకూడదని ఎన్ని జాగ్రత్తలు తీసుకు పెంచింది ?

కానీ—

ఇప్పుడు వీడు ఎలా మాట్లాడుతున్నాడు ?

''ఇప్పుడు — ఈ ముసలి వయసులో నీకు ఆపరేషన్ చేయించడం మంచిది కాదమ్మా !

అయినా, నీకు ఇప్పుడు ఏం కరువయింది ? టైంకి తింటూ కూర్చోక—లేనిపోని ఇబ్బందులు ఎందుకు కొనితెచ్చుకోవడం ?

అదీగాక, నిన్ను హాస్పిటల్లో జాయిన్ చేస్తే నీ దగ్గరుండడానికి ఎవరున్నారు చెప్పు. రోజూ నీ కోసం — నిన్ను చూడ్డానికి రావాలన్నా మనిషికి అయిదు రూపాయలు బస్సు చార్జీలే అవుతాయి. పోతేపోని వెధవ డబ్బు ! బస్సులో !? నానాయతనా పడితేగాని చీమపుట్టల్లాంటి జనాన్ని తప్పించుకొని బస్సులు ఎక్కలేం.''

నిజమే వాడన్నదీ నిజమే !

కానీ,

చూపు వస్తే బాగున్నన్న ఆలోచన నన్ను వేధిస్తూనే ఉంది.

ఆ రోజు —

వీధిలో ఏవో కేకలు !

లౌడ్ స్పీకర్ల గోల.

మనసుండబట్టక కోడల్ని పిలిచి అడిగాను.

''ఎవరో మహిళా సంఘంవారు మనూర్లో ఉచిత నేత్ర చికిత్సా శిబిరం పెడతారట. ఎవరైనా కళ్ల ఆపరేషన్ చేయించుకోవాలనుకుంటున్న వాళ్లు రేపు ఉదయం ఎనిమిది గంటలకు దేవస్థానం వారి అతిథి గృహాలదగ్గరకు రమ్మంటున్నారు.''

''నిజంగానా ?''

''అవునండి. ఆ గోల అదే !''

''నేనూ చేయించుకోనా ?''

''మీ ఇష్టం. మనూర్లోనే కదా! పర్లేదు. ఇబ్బంది ఉండదు.''

''నాకు చూపు వస్తుందంటావా ?''

''ఎందుకు రాదూ ? అదీగాక, ఇప్పుడు వస్తున్న డాక్టర్లు వైజాగ్ పెద్దాసుపత్రి వాళ్లేనట. కళ్లు పరీక్షించి చూపువస్తుందంటే ఆపరేషన్ చేస్తారు. లేదా, రాదని చెప్పి పంపించేస్తారు'''

''అబ్బాయి వస్తే అడుగుదాం !''

''ఆయన కాదనరులెండి.''

ఆ వారం తర్వాత—

చూపు వచ్చిన తక్షణం మొట్టమొదట కోడల్ని చూసింది.

పుత్తడి బొమ్మలా ఉంది.

ఇద్దరు పిల్లల తల్లిలా లేదు. నవనవలాడుతూ పెళ్లికాని పిల్లలా ఉంది.

పిల్లలో !

ముద్దబంతి పువ్వుల్లా ముద్దుగా ఉన్నారు. బందరు లడ్డూల్లా— కోనసీమ కొబ్బరికాయల్లా ఆరోగ్యంగా— ఆకర్షణీయంగా, పాలడబ్బాలమీది పిల్లల్లా ఉన్నారు.

వాళ్లు అచ్చం తనలాగే ఉన్నారు.

తెల్లగా అప్పుడే వికసించిన విరజాజుల్లా ఉన్నారు.

కొడుక్కి తగ్గ కోడలు.

ఆ ఇద్దరికీ తగ్గ సంతానం.

ముచ్చటగా ఉంది సంసారం.

అందుకేనేమో అప్సరసలాంటి కోడల్ని ఏరికోరి కులాంతరమైనా ఆమెనే చేసుకున్నాడు.

కొత్తగా కట్టిన ఇల్లు !

రాములవారి పర్ణశాల్లా ప్రశాంతంగా ఉంది.

దూరంగా నిలబడి చూస్తే ఎంత బావుంది.

లక్కపిడతలా ఉన్న ఇల్లు. ఇంటి చుట్టూ ప్రహరి ! ఇంటిముందు కాలిబాట కిరువైపులా రకరకాల పూలమొక్కలు.

కాంపౌండ్ గేటు కటూ ఇటూ ఏపుగా ఎనుబోతుల్లా పెరిగిన అశోక వృక్షాలు.

కాంపౌండ్ గేటు దగ్గరనుండి ద్వారం వరకూ పైన పందిరిలా అల్లుకున్న మనీప్లాంట్ కాడలు బంగారుతీగల్లా — ఆకులు చంద్రబింబాల్లా ఉన్నాయి.

ద్వారంముందు వసారాలో సోఫా !

సోఫాముందు టీపాయ్ !

ద్వారం దాటాక హాలు !

హాలుకు నలుప్రక్కలా నాలుగు గదులు.

అందులో ఒక గది తనకు కేటాయించారు.

మిగిలిన మూడు గదుల్లో ఒకటి పడక గది. ఒకటి కొడుకు తన ఆఫీసు పని చేసుకోవడానికి 'డ్రాయింగ్ రూమ్'గా వాడుకుంటున్నాడు. మూడోదాంట్లో పిల్లల పుస్తకాలు, బట్టలు, డ్రెస్సింగ్ టేబులు అన్నీ ఉన్నాయి.

నాలుగో గదిప్రక్కన చిన్న వరండా ఉంది. ఆ వరండాలోనుండి పెరట్లోకి దారి ఉంది.

పెరట్లో ఓ మూల వంటగది. కాంపౌండ్ దగ్గరగా బాత్‌రూం — లావెట్రీ ఉన్నాయి.

ఇల్లంతా పదేపదే పరికించి — పరిశీలించి చూసాను. ఆ రోజంతా ఇంటిని — ఇల్లాల్ని — పిల్లల్ని తనివితీరా చూసాను.

ఆ సాయంత్రం ఆఫీసునుండి కొడుకు వచ్చాడు.

తను ఎంత అదృష్టవంతురాలు !

తను పనిచేసిన వారి ఇళ్లన్నీ ఇలాగే ఉండేవి.

దర్జా — దర్పం ఆ ఇంటివాళ్ల సొత్తే అనుకుంది.

ఆ ఐశ్వర్యం తన ఇంటినీ వరిస్తుందనుకో లేదు. తన సంతానానికి, సంసారానికి ఇంతటి వరం సంప్రాప్తిస్తుందనుకోలేదు.

రోజులు గంటల్లా గడిచిపోతున్నాయి.

గంటలు ఘడియల్లా సాగిపోతున్నాయి.

ఇన్నాళ్లూ తన మానాన తను ఓ మూల్ల తింటూ కూర్చోవటంలేదు.

ఇల్లంతా కలియ తిరుగుతూ తనకు తోచిన పని చేస్తోంది. అడపా దడపా కోడలికి వంట పనిలో సాయంచేస్తోంది.

పిల్లలకి స్నానం చేయించటం— కొడుక్కి నీళ్ళు అందించటం — కోడలికి తల రుద్దటం— అన్నీ తనే చేస్తోంది.

ఇన్నాళ్లూ ముసలిదనుకున్న తను ఇప్పుడు మొరటుదాన్లా ఎలా తిరగ గలుగుతోంది.

ఈ సంతోషం — సంబరం నా కడప్రాణం కడతేరే వరకూ ఇలాగే సాగిపోతే బాగున్ను.

దేవుడు కూడా ఓకోసారి చాలా విచిత్ర మైన నాటకాలు ఆడతాడు. సవ్యంగా సాగుతున్న సెలయేర్లో రాయిపిక్క వేసి 'సుడులు' సృష్టించి ఆనందించే, చిన్న కుర్రాడిలా కొన్ని జీవితాల్లో అనుకోని సంఘటనలు సృష్టించి వింత తిలకిస్తాడు.

అలాంటి సంఘటన నా ఈ ఆఖరి క్షణాల్లో ఎదురవుతుందని నేనూహించలేదు.

# కళ్లు

ఆ రోజు —

ఆనాటి రాత్రి —

అతి భయంకరంగా గడిచింది.

ఆక్షణం —

చచ్చిపోవాలనిపించింది. కళ్లు పొడుచుకు చావాలనిపించింది.

భగవాన్ !

ఈ ఘోరం చూడ్డానికేనా నన్నిన్నాళ్లూ బ్రతికించావు ? చూపులేని నాకు చూపు ప్రసాదించావు ?

తను కలగనలేదు కదా !

లేదు... లేదు... లేదు.

నిజం —! యదార్థం —! వాస్తవం —!

నా కళ్ల ముందు కసాయిల్లా వాళ్లు —?

భగవాన్ నాకెందుకీ శిక్ష.

బ్రాహ్మణ పుట్టుక పుట్టి —

సత్సాంప్రదాయం గల కుటుంబంలో జన్మించి— అగ్నిలాంటి పవిత్రమైన ఆచారాన్ని— వంశ ప్రతిష్టని మంటగలిపి కులభ్రష్టుడై — ఛీ ... వీడా తన కొడుకు ?

వీడికా తను జన్మనిచ్చింది ? ఆ మారాజు కడుపున — వేదవేదాంగాలు ఏకధాటిగా వల్లించగల మహాపండితుడు— నిష్టాగరిష్టుడి కడుపున — ఈ దుర్మార్గుడా జన్మించాడు.

కులం కంటె గుణం ముఖ్యమని—

మంచి ఆచరణే ఆచారమని—అలాంటి నీతి దాయకమైన ఆచారాన్ని ఆత్మశుద్ధిగా ఆచరించ గలిగిన వాడే నిజమైన మనిషని వాదించే అలాంటి ఉన్నతుడి వారసుడా వీడు ?

కాదు...కాదు !

కారణ జన్ములై వెలిగిన మహా పండితుల వంశంలో వంశోద్ధారకుడుగా ఈ నీచుడా మిగిలాడు ?

దేవుడా ? ఏవిటీ నీ లీల ? !

## "అడకత్తెరలో పోకచెక్క"

పుట్టినింటికి చెప్పలేక
మెట్టినింటిని మెప్పించలేక
వరకట్న పిశాచపు
వాడి కోరల్లో
నలిగిపోతోంది
నేటి నవ వధువు
''అడకత్తెరలో పోకచెక్కలా''

— కుమారి కె. వి. సూర్యలక్ష్మి

కోడలు !

కులాంతరమైనా వాళ్ల వివాహాన్ని తను సమ్మతించింది. కులం కంటే గుణం ప్రధాన మన్న తన 'దేవుడి' మాట మనసులో మెదిలి.

కానీ,

గుణం కూడా గుడిసేటిదని — పుట్టుకతో సంక్రమించిన పాడుబుద్ధులు పుడకలతో గాని పోవంటారు. ఇందుకేనేమో !

కోడలే తన కొడుకుని అపమార్గం పట్టిం చిందా ? ఏమో ?

అయినా వాడి కుండాలి.

గొంతు ఎండుకు పోతోంది. నోరు పిడచ కట్టుకుపోతోంది.

కానీ,

ఆ పాపిష్టి చేతో పాపపంకిలమైన నీరు కూడా త్రాగాలనిపించటం లేదు.

ఆ వారం—

ఆకలితోనే గడిపాను. పచ్చి మంచినీళ్లు కూడా ముట్టుకోలేదు.

కొడుకు గాబరా పడతాడని తెలుసు.

కొడుకు,

ఊం!

ఎంత నిజాయితీగా పెంచింది వాడ్ని. ఎంత దర్జాగా పెంచింది ఎంత నీతిగా సాకింది !

ఏనాడైనా సాంప్రదాయాన్ని కాదని— ఆచారాన్ని వదలిపెట్టి బ్రతికిందా ?

పవిత్రమైన యజ్ఞోపవీతాన్ని ఏం చేసాడో ఆ దౌర్భాగ్యుడు ?

ఎవరో పీక నులిమేస్తున్నట్లనిపిస్తోంది.

గుండెల్నెవరో పిడికిలితో పిసుకు తోన్నట్లుంది

ఎవరు ?

మృత్యువు !

యముడు !

భగవంతుడా ? ఇప్పుడా—ఇన్నాళ్లకా నాకు విముక్తి. తీసుకుపో భగవాన్ ! తీసుకుపో ! ఈ జన్మకీ శాపం చాలు. ఈ బ్రతుక్కి — దరిద్రం చాలు.






### జె. జీ. – కరీంనగర్

నా వయస్సు 20 సంవత్సరాలు. అప్పుడప్పుడు 5 సెకన్లు గుండెల్లో నెప్పిలాగ వస్తుంది. ఈ నెప్పి రెండు సంవత్సరముల నుండి వస్తోంది. ఈ నెప్పి వచ్చినప్పుడు కడుపు త్రిప్పటం, వాంతులవటం, స్పృహకోల్పోవటం లాంటివి ఏమీ వుండవు, మామూలుగానే వుంటుంది. ఇది ప్రమాదమా ?

★ మీరు బేరియం మీల్ వగైరా పరీక్షలు చేయించుకొని కడుపులో అల్సర్ లేదని తీర్మానించుకోవలసి ఉంది. శస్త్ర వైద్యుల సలహా ప్రకారం మందులు వాడవలసి ఉంటుంది.

### ఆర్. కె. - గుంటూరు

నేను నాలుగు నెలల క్రితం ఒక ఆమెతో కలిసాను. కలిసిన నాలుగు రోజులకు అంగమునుండి చీము వచ్చినది. మందులు వాడాను. తగ్గిపోయినది. 15 రోజుల తరువాత అంగంపై అనేక పొక్కులు లేచాయి. ఇంతవరకు మానలేదు. అంగానికి ఏదైనా తగిలితే చాలా నొప్పిగా వుంటుంది.

★ దీనిని షాంక్రాయిడ్ అని అంటారు. దీనికి స్ట్రెప్టోమైసిన్, సల్ఫా డిమిడీన్ వంటి మందులు బాగా పని చేస్తాయి. "జిడాక్స్" అనే మందుని పూటకి రెండువంతున వరుసగా ఆరు పూటలు వాడితే మంచిది.

### సి. జె. – కడప

గ్యాస్ట్రో ఎంటరైటిస్ అంటే ఏమిటి ? నాకు గ్యాస్ట్రిక్ సంబంధించిన జబ్బువున్నది. సరిగ్గా జీర్ణము కాదు. కాయగూరలు, మాంసాహారము జీర్ణము కావు. శరీరము నిస్సత్తువగా, అలసటగా వుండును చపాతీలు గుడ్లు, పాలు వాడినా గూడా బాధను అనుభవించ వలసి వుంటోంది ?

★ కడుపు భాగము, చిన్న – పెద్ద ప్రేవులు మొత్తంగా గాని, వాటిలో భాగంగాని వాచినప్పుడూ ఏర్పడే రోగాన్ని గ్యాస్ట్రోఎంటరైటిస్ అని అంటారు. ఆహారం క్రమబద్ధంగా తీసుకొంటూ, శరీర వ్యాయామం చేసేవారికి, ఇతర రోగాలేవీ లేనప్పుడు, జీర్ణం అవకపోవటం అంటూ ఉండదు. మీరు మలపరీక్ష చేయించుకోవటం చాలా అవసరం. అందులో ఏమీలేదని తేలినప్పుడు పైన చెప్పినట్లుగా వ్యాయామం చేయండి.

### ఎమ్. బి. ఎల్. – సికింద్రాబాద్

మా అత్తగారి వయస్సు 60 సంవత్సరములు. ఆమెకు కడుపులో గడ్డ వచ్చినది. ఉస్మానియా హాస్పటల్‌లో ఆపరేషన్ చేసారు. 2, 3, రోజులు కోమాలో వున్నారు. తరువాత తగ్గినది. ఇంటికి తీసుకొనివచ్చి 4 నెలలయినది. ఈ ఆపరేషన్ అయ్యాక మతిమరుపు వచ్చినది. ఎప్పుడో చాలా ఏండ్ల క్రితం జరిగినవి బాగానే చెబుతున్నారు. కాని ఇప్పుడు జరిగినవి చెప్పలేకపోతున్నారు. అడిగినదే పదిసార్లు అడుగుతున్నారు. మాకు చాలా ఇబ్బందిగా వుంటోంది. దీనికి కారణమేమిటి? మందులేమైనా వున్నాయా ?

★ దీనిని రిట్రోగ్రేడ్ అమ్నీసియా అని అంటారు. దీనికి చాలా కారణాలున్నాయి. ముఖ్యంగా మెదడులోని నరాలు 'అలసట' చెందినప్పుడు ఇలా అయ్యే అవకాశం ఉంటుంది. దీనికి ప్రత్యేక చికిత్స అంటూ ఏమీలేదు. వయస్సు మీరిన వారిలో రక్తనాళాలలో ఏర్పడగల మార్పులవల్ల ఇలా జరిగే అవకాశం ఉంటుందని కొందరి అంచనా.

---

ఇన్నాళ్లూ ఎన్ని కష్టాలుపడి బ్రతికినా – ఎంత ఇబ్బందిని–ఎన్ని ఇక్కట్లని అనుభవించినా నాకు ఆత్మ సంతృప్తినే ఇచ్చింది.

కానీ,

ఈ కడ బ్రతుకులో చూపు ప్రసాదించి నన్ను – నా ఆత్మని చిత్రవధ చేసావు.

ఎంత భయంకరమైన శిక్ష వేసావు.

నెమ్మది... నెమ్మదిగా –

కొంచెం... కొంచెంగా –

బరువుగా ఉన్న రెప్పల్ని ఎత్తి చూసాను.

అది ఆఖరి చూపు.

మంచంచుట్టూ కొడుకూ– కోడలు– డాక్టరూ – పిల్లలూ :–

కొడుకు కళ్ళ నీళ్ళు దించుకుంటున్నాడు.

కోడలు చీర చెంగుతో కళ్ళొత్తుకుంటోంది.

పిల్లలు ఏం జరుగుతుందో అర్థంకాక అయోమయంగా నావైపు చూస్తూ నిలబడ్డారు.

పిల్లలు !

పసిపిల్లలు భగవంతుడితో స మా న ం అంటారు. తప్పూ ఒప్పూ తెలీని వయసు వాళ్లది. ధర్మా ధర్మ విచక్షణ తెలీని పిల్లలు.

వాళ్లనైనా ఈ పాపానికి దూరంగా పెంచితే ఎంత బావున్ను ?

కొడుకుని – కోడల్ని చూడాలనిపించటం లేదు. పిల్లలవైపు తనివితీరా చూసాను.

"అమ్మా... అమ్మా"

కొడుకు పిలుస్తున్నాడు.

కొడుకు ఎంతో ఉన్నతంగా పెరిగాడను కుంది. కానీ, ఇంతలా ఉచ్చం – నీచం తెలీని ఉన్మాదవుతాడనుకోలేదు.

భార్యా – భర్తలిద్దరూ ఎదురెదురుగా కూర్చొని– తప్ప త్రాగుతూ– మాంసం తింటూ కూర్చున్నారు.

తనకెందుకో మెలకువ వచ్చి నీళ్లకోసం వాళ్లగది దాటి వెళ్లబోయింది.

వీళ్ల రాత్రి పదిగంటల వరకూ భోజనం చెయ్యనిదిందుకా ?

మాంసం !

కోడిమాంసం !

ఛీ !

చతుర్వేదాలూ అవపోసన పట్టిన వేద పండితుడి కడుపున పుట్టి నీమడిలా – కట్టు బొట్లు కాలదన్ని త్రాగుబోతై మాంసాన్ని మెఖంలా మేస్తాడని కలగనలేదు.

కోడలో – ! అది ఆడదా !?

ఆ రోజు నే చూసిన సంఘటన గుర్తొచ్చే సరికి శరీరం గగుర్పొడిచింది.

కళ్లముందు కోడిపుంజు గిలగిలా తన్నుకుంటూ ప్రాణం పోతూంటే నా వైపు బేలగా చూస్తూ ఏదో అంటోన్నట్టుంది !

నా కళ్లని తన సూది ముక్కుతో పొడుస్తోన్నట్టుంది.

బాధగా కళ్లు మూసుకున్నాను.

అదే నా ఆఖరి చూపు ! ★

### అంకితం

నాలో సాహిత్యానికి ప్రేరకుడు, ప్రోత్సాహకుడు, అయిన శ్రీ ఇందూ రమణకు కృతజ్ఞతలతో ...

– కుమారి బి. జయంతి




**ఒ**క రోజు అకస్మాత్తుగా రజని వచ్చింది.

ఆమె అనూరాధ పిన్నికూతురు.

''కాకినాడ నుంచేనా ?'' అడిగింది అనూరాధ.

''వైజాగ్ ఇంటర్‌వ్యూ కెళ్ళి వస్తున్నానక్కా !''

''అప్పుడే ఉద్యోగం కోసం వేట మొదలెట్టావన్నమాట !'' నవ్వుతూ అందామె.

''నా పెళ్ళికి నేనే కట్నం సంపాదించుకోవాలని అమ్మ చెప్పేసిందక్కా — అందుకని ఉద్యోగాలు వెతుకుతున్నాను...'' తనూ నవ్వుతూ అందామె.

ఆ రోజంతా కబుర్లతో గడచిపోయింది.

భోజనాల సమయంలో కృష్ణను పలకరించి ఏదో మాట్లాడబోయింది గానీ అతను ముక్తసరిగా ఉండడంతో ఊరుకుండిపోయింది రజని.

''కృష్ణ గురించి కొన్ని వార్తలు విన్నాను; నిజమేనా అక్కా అవి?'' అనూరాధనడిగిందామె.

''ఏమని విన్నావ్ ?''

''అతనికి చాలా మంది అమ్మాయిలతో స్నేహం ఉందనీ !''

అనూరాధకేం చెప్పాలో తెలీలేదు.

''నీకు ఇష్టం లేకపోతే ఈ టాపిక్ మానేస్తానులేపోనీ !'' కొద్ది క్షణాలాగి అందామె.

అప్పుడే ఆమెకి ఓ ఆలోచన వచ్చింది.

## ( గత సంచిక తరువాయి )

రజనికీ కృష్ణకీ పెళ్ళి చేస్తే ఎలా వుంటుంది? ఇద్దరికీ ఈడూ, జోడూ బాగానే ఉంటుంది.

చదువు, మిగతా విషయాలు—అన్నీ సరిగ్గా సరిపోతాయ్. అటు పిన్నివాళ్ళు కూడా ఆమెకి పెళ్ళి చేయాలన్న ఆలోచనలోనే ఉన్నారు.

ఎటొచ్చీ, వారిద్దరూ ఒకరంటే ఒకరు ఇష్టపడాలి. అంతే! అది జరగాలంటే వారిద్దరూ కలుసుకుని మాట్లాడుకునే అవకాశం తను కల్పించాలి.

ఆ రోజునుంచీ కృష్ణకు సంబంధించిన పనులన్నీ రజనికే పురమాయించసాగింది అనూరాధ.

అతనికి కాఫీ ఫలహారాలందజేయడం—అతనికి భోజనం వడ్డించడం, భోజనానికి పిలవడం—

నాలుగు రోజులు గడచిపోయినయ్.

''నేనింక వెళ్తాను అక్కా...'' అంది రజని ఆ రోజు.

''అప్పుడేనా? ఎలాగూ ఇంటి దగ్గర ఊరికే కూర్చోవడమేగా! ఇంకో వారం ఉండి వెళ్దువు గానిలే...'' అంది అనూరాధ.

''ఖాళీగా ఏం కూర్చోవడం లేదులే! టైప్, [illegible]హాండ్ నేర్చుకుంటున్నాను.''

''పోనీ ఇంకో రెండు రోజులయినా ఉండు.''

ఆమె మాట కాదనలేకపోయింది రజని.

మర్నాడు కృష్ణ భోజనం చేస్తున్నప్పుడు రజని లేకుండా చూసి తనే ఆ విషయం కదిపింది అనూరాధ.

''రజని నీకు నచ్చిందా కృష్ణా !''

అతను తెల్లబోయాడు.

''ఏమిటొదినా?'' అన్నాడు అర్థం కానట్లు.

''అదే – రజని నీకు నచ్చిందా అని అడుగుతున్నాను.''

''నాకు నచ్చడం ఎందుకు ?''

''నీ కిష్టమయితే మీ ఇద్దరికీ పెళ్ళి చేయాలని అనుకుంటున్నాం...'' కృష్ణకేం మాట్లాడాలో తెలీటంలేదు.

''వద్దు వదినా !'' అన్నాడు తల వంచుకుని.

''ఎందుకని ?''

''నా కిష్టంలేదు —''

''ఎప్పుడూ జరిగినదాన్ని గురించి ఆలోచిస్తూ కూర్చుంటే అలాగే అనిపిస్తుంది. పెళ్ళి చేసుకున్నావంటే ఆ ఆలోచనలన్నీ వాటంతట అవే పోతాయ్ ...''

''ఊహుఁ! వద్దొదినా! నా కిష్టంలేదు—''

''రజని ఇష్టంలేదా లేక అసలు పెళ్ళే వద్దా ?''

''పెళ్ళే వద్దు వదినా !''

''సరే ! నా కెందుకీ విషయం ? మీ అన్నయ్యతోనే చెప్పు అలా అని'' విరాకుగా అందామె.

మర్నాడు రజని ప్రయాణమయింది.

''నిన్నో విషయం అడగాలనుకుంటున్నాను'' అంది అనూరాధ ఆమె బయల్దేరేముందు.

''ఏమిటది ?''

''కృష్ణ అంటే నీ కిష్టమేనా ?''

ఆమె ప్రశ్నకి నవ్వు వచ్చేసింది రజనికి.

''ఎందుకక్కా అలా అడుగుతున్నావ్ ?''

''ఆ ప్రశ్న ఎందుకడుగుతారో తెలీదా నీకు ?''

ఛటుక్కున అర్థం స్ఫురించింది రజనికి.

''ఏమో – నాకు తెలీదు'' అంది అబద్ధమాడేస్తూ.

''మీ ఇద్దరికీ పెళ్ళి జరుగుతే బావుండునని పించింది నాకు.''

ఆ మాటతో ఇంక తన మనసులోని విషయం చెప్పక తప్పలేదు రజనికి.

''నా కిష్టంలేదక్కా !''

అనూరాధ ఆశ్చర్యపోయింది.

''ఎందుకని ?''

రజని మాట్లాడలేదు. ఆమె ఆ ప్రసక్తి అక్కడితో వదిలేస్తే బావుండుననుకుంది.

''చెప్పు రజనీ ! ఇష్టం లేకపోడానికి ఏదయినా కారణం ఉండాలిగా ?'' రెట్టించి అడిగింది అనూరాధ.

**జరిగిన కథ—8 :** కృష్ణ సావిత్రిని ప్రేమిస్తున్నానని చెపుతాడు. అతని తత్వం తెలీని సావిత్రి తనూ అతనిని ప్రేమిస్తున్నట్లు చెపుతుంది. ప్రసాద్ ఉద్యోగంలో చేరను హైదరాబాదు వెళ్లిపోతాడు. కృష్ణ తన మాయమాటలతో సావిత్రిని లొంగతీసుకొని మొహం చాటువేస్తాడు. సావిత్రి తనకు పెళ్లి కుదిరిందని చెప్పినా కృష్ణ ఆ విషయాని కంత ప్రాముఖ్యత నీయకపోవడం ఆమెకు కలవరపాటును కలిగిస్తుంది. సావిత్రిని ఏ విధంగా వదిలించుకుందామా ! అని ప్లాన్స్ వేస్తుంటాడు కృష్ణ. కృష్ణ ఆంతర్యం తెలుసుకొన్న సావిత్రి తల్లడిల్లిపోతుంది. చెల్లెలు రుక్మిణి మరణంతో కృష్ణకు కనువిప్పు కలుగుతుంది. సావిత్రిని పెళ్లి చేసుకోడానికి నిర్ణయించుకొని వచ్చేటప్పటికి సావిత్రి ఆత్మహత్య వార్త వింటాడు. ఆమె చనిపోకముందు తనకు రాసిన ఉత్తరం చదవసాగాడు. సావిత్రి రాసిన ఉత్తరం చదివి చిత్రవధ ననుభవిస్తాడు కృష్ణ. సంగతి తెలిసికొన్న సీతారామయ్య కృష్ణను అనకాపల్లికి తీసుకొని వెళ్లిపోతాడు. కృష్ణ దిగులుతో కృశించిపోవడం చూసిన అనూరాధ అతనికి పెళ్లి చేస్తే మనుష్యులలో పడతాడేమో ! అని భర్తతో చెపుతుంది.

రజనికి ఇంక తన మనసులోని విషయం చెప్పక తప్పలేదు.

"అతన్ని గురించి విన్నానక్కా ! అలా ఆడపిల్లల జీవితాలతో ఆడుకునే మగాళ్ళంటే నాకు అసహ్యం..."

అనూరాధ ఆశ్చర్యపోయింది.

రజనిని అంత తెలివితేటలు, వ్యక్తిత్వం ఉన్న అమ్మాయిగా ఊహించలేదు తను.

ఇంక ఆ విషయం అక్కడితో వదిలేసిందామె.

రజని వెళ్లిపోయింది.

ఆ రాత్రి జరిగిన విషయమంతా భర్త చెవినేసిందామె.

"మీ తమ్ముడికి పెళ్ళి జరగడం అంత తేలికయిన విషయం కాదేమో !" సందేహంగా అందామె..

"కాకపోతే పోనీ ! ఎవరు తీసుకున్న గోతిలో వాళ్ళేపడతారు మనమేంచేస్తాం ?" అన్నాడు శీతారామయ్య.

"కానీ ఇలా నే నెంతకాలం భరించను అతనిని ?" కోపంగా అందామె.

"పోనీ ఏంచేయమంటావో చెప్పు చేస్తాను" తనూ విసుగ్గానే అన్నాడతను.

అనూరాధ సమాధానం ఇవ్వలేకపోయింది. నిజానికి ఆమెకే తెలీదు అతన్నేంచేయాలో.

అనుకోకుండా ఆ సమస్యకు కృష్ణే పరిష్కారం చూపాడు.

ఆ మర్నాడు అనూరాధ వంటింట్లో వంట పనిలో హడావుడిగా ఉన్నప్పుడు అతను గడపదగ్గర కొచ్చి నిలబడి 'వదినా' అంటూ పిలచాడు.

ఆశ్చర్యంగా అతనివేపు చూసిందామె.

ఇంతకాలం తర్వాత మొదటిసారిగా తనంతట తనే పలుకరిస్తున్నాడతను.

"ఏమిటి?" అతన్ని ప్రశ్నార్థకంగాచూస్తూ అడిగిందామె.

"నేను హైద్రాబాద్ వెళ్ళాలనుకుంటున్నా వదినా !"

"ఎందుకు ?"

"అక్కడేదయినా ఉద్యోగం దొరుకుతుందేమో ప్రయత్నిస్తాను..."

"ఇక్కడ వుండే ప్రయత్నించవచ్చుకదా?"

"నేనిక్కడ ఉండలేనొదినా. నాకు ఛేంజ్ ఆఫ్ ప్లేస్ కావాలి !"

అలా చేయడమే మంచిదనిపించింది అనూరాధకి. ఆ విధంగానయినా అతను మళ్ళీ కోలుకొని మామూలు మనిషి కావడానికి అవకాశం ఉంది."

"మీ అన్నయ్యతో కూడా చెప్పు ఆ విషయం !" తనకు అంగీకారమేనన్నట్లు అందామె.

"అన్నయ్యతో నువ్వే చెప్పాలి వదినా ! నేనేమీ మాట్లాడలేను."

"ఇంతకూ అక్కడ నీకు ఉద్యోగం దొరుకుతుందని గ్యారంటీ ఏముంది?"

"దొరుకుతుందొదినా ! ప్రసాద్ ఎలాగూ అక్కడే ఉన్నాడుగా ! వాడి సహాయం కూడా ఉండనే ఉంటుంది."

"అయితే మళ్ళీ ఇద్దరూ ఒకేచోట చేరతారన్నమాట." నవ్వుతూ అందామె.

"చచ్చిన పాముని ఇంకెందుకొదినా చంపుతావ్ ?"

"సరే–నేను చెప్పిచూస్తాను మీ అన్నయ్యకి–ఆయనేమంటారో మరి !"

"వీలయినంత త్వరగా వెళ్లిపోవాలనుంది వదినా ! వీలయితే రేపే వెళ్ళిపోతాను..."

"అంత ముంచుకుపోయిందేమీలేదులే !" అందామె.

"ఎందుకులేదొదినా ! ఇక్కడుండి నీకు శ్రమ ఇవ్వడం తప్పితే మరోటేం ఉంది ?"

అనూరాధకు అతని మాటలు జాలి కలిగించినయ్. అతనెందుకు అలా మాట్లాడాడు? ఒకవేళ



తను భర్తతో అతనిని గురించి మాట్లాడిన మాటలు విన్నాడా?

అతను వెళ్ళిపోయాడు.

ఆ రోజే ప్రసాద్‌కి ఉత్తరం రాశాడు కృష్ణ.

తను త్వరలో హైదరాబాద్‌కి రాబోతున్నట్లూ, తనకోసం ఏదోక ఉద్యోగం చూడాల్సిందని కోరుతూ రాశాడు.

దానికి ప్రసాద్ వెంటనే జవాబు రాశాడు.

ఉద్యోగాలు దొరకడం అంత తేలిక కాదనీ, అయినా అతను హైదరాబాద్ చేరుకున్నాక అప్పుడు ఏదోక ప్రయత్నం చేయవచ్చనీ తెలియజేశాడతను.

ఇది జరిగి పది రోజులయినా అనూరాధ ఆ విషయం ఏమీ మాట్లాడక పోయేసరికి తిరిగి తనే అడిగాడు—

"వదినా! నేను చెప్పిన విషయం మర్చిపోయావా?"

"లేదయ్యా! మీ అన్నయ్యతో మాట్లాడాను. కానీ ఆయన ఒప్పుకోవడం లేదు—"

కృష్ణ మొఖం చిన్నబోయింది.

"ఎందుకనొదినా?"

"నీ ఆరోగ్యం బావుండలేదనీ, ఒక్కడివే ఉంటే పూర్తిగా చెడిపోతుందనీ భయంట—"

"వదినా! నీకు హామీ ఇస్తున్నాను. నేను జాగ్రత్తగానే ఉంటాను—" దీనంగా అన్నాడతను.



ఆమె ఏమీ మాట్లాడలేదు.

"ప్రసాద్ కూడా ఉత్తరం రాశాడొదినా! నేను హైదరాబాద్ వెళ్ళాక అప్పుడు ఉద్యోగ ప్రయత్నం చేయవచ్చని, తనింట్లోనే ఉండవచ్చనీ అంటున్నాడు."

"నీ ఇష్టం నాయినా! నీకంతగా వెళ్ళాలని ఉంటే వెళ్ళు! నేను మీ అన్నయ్యకు నచ్చజెప్తాన్లే—"

"నిజంగానేనా వదినా? నేను రేపే వెళ్ళవచ్చా?"

"నీ ఇష్టమన్నానుగా!"

అతను సంతృప్తిగా ఆమెవేపు చూశాడు.

"అయితే రేపే వెళ్ళిపోతాను వదినా!" అనేసి తన గదిలోకెళ్ళి త్వరత్వరగా బట్టలు మార్చుకున్నాడతను.

మళ్ళీ ప్యాంటూ షర్టూ వేసుకోవడం — ఎంతోకాలం తర్వాత — అనకాపల్లి వచ్చి ఇంత కాలమయినా — ఏ ఒక్కరోజు కూడా ఇల్లు వదలి బయటకు పోలేదు ఇన్నాళ్ళూ!

రోడ్డుమీదకొచ్చి పోస్టాఫీస్‌వేపునడుస్తుంటే చుట్టుప్రక్కల ఇళ్ళవాళ్ళందరూ వింతగా చూస్తున్నారు తనను. తనని గురించి రహస్యంగా సంకేతాలు చేసుకుని మాట్లాడుకుంటున్నారు.

కృష్ణకు సిగ్గుగా ఉంది.

బహుశా ఊరందరికీ తన గురించి తెలిసిపోయుంటుంది. తనను సినిమాల్లో విలన్‌ని చూసినట్లు చూస్తారు కాబోలు అందరూ!

పోస్టాఫీస్ చేరుకుని టెలిగ్రామ్ ఫారం పూర్తిచేశాడతను.

"ఎరైవింగ్ సండే మార్నింగ్ గోదావరీ ఎక్స్‌ప్రెస్— మీట్ స్టేషన్" అని రాశాడు — దానికింద తన పేరు — ప్రసాద్ అడ్రస్ రాసి కౌంటర్‌లో ఇచ్చి డబ్బు కట్టేశాడు.

ఆ రాత్రంతా నిద్ర పట్టలేదతనికి.

తను ఎలాంటి జీవితం గడపదల్చుకున్నాడో తనకు తెలీదు. కానీ తనను తను మర్చిపోగలిగే జీవితం కావాలి. తన శరీరానికీ, మనసుకీ విశ్రాంతి దొరకని ఉద్యోగం కావాలి. అప్పుడుగాని తననుభవిస్తున్న నరకం నుంచి బయటపడలేడు. అప్పుడుగాని సావిత్రిని మర్చిపోవడం సాధ్యం కాదు.

మర్నాడు ఉదయం కాఫీ ఫలహారాలయాక షాపుకెళ్ళడానికి తయారయిన శీతారామయ్యను కలుసుకున్నాడతను.

"అన్నయ్యా! నేను ఇవాళ రాత్రికి హైదరాబాద్ వెళ్తున్నాను" అన్నాడు నెమ్మదిగా.

"వెళ్ళిరా! కానీ ఇకనుంచయినా ఒళ్ళు దగ్గరుంచుకుని మసులుకో..." అప్రయత్నంగానే అనేశాడు శీతారామయ్య.

ఆ తరువాత అతనికి బాధ కలిగింది — అలా నొప్పించకుండా ఉంటే బాగుండేదని.

కృష్ణ ఏమీ మాట్లాడలేదు.

తను లోలోపల అనుభవిస్తున్న నరకం తెలుస్తే అతనా మాట అనేవాడు కాదు.

ఆ రాత్రికి హైదరాబాద్ బయల్దేరాడతను.

ఉదయం ఆరున్నరకల్లా సికింద్రాబాద్ స్టేషన్ చేరుకుంది ట్రైన్. ప్రసాద్ తనకోసం వెతుకుతూ కనిపించాడు.

"అదేమిటి? నువ్వు హైదరాబాద్ స్టేషన్ కొస్తావనుకున్నాను ..." ఆశ్చర్యంగా అన్నాడు కృష్ణ.

"బుద్ధున్న వాడెవడూ ఈ రైళ్ళల్లో సికింద్రాబాద్ నుండి హైదరాబాద్‌కి ప్రయాణం చేయడు— పద— మనం ఆటోలో వెళ్ళిపోదాం" అన్నాడతను నవ్వుతూ.

సామాను ఇద్దరూ తీసుకుని బయటకు నడిచి ఆటోలో కూర్చున్నారు.

"ఇంతకూ మీ ఇల్లెక్కడ ?" అడిగాడు కృష్ణ

"అమీర్‌పేట్ అనే చోట. ఈ మధ్యే మారాన్లే అక్కడికి ..."

"గదా, ఇల్లా ?"

"ఇప్పుడు పెళ్ళాం కూడా ఉందిగా — అందుకే ఓ పోర్షన్ అద్దెకు తీసుకున్నాను —"

"పెళ్ళామేమిటి ?" ఆశ్చర్యంగా అడిగాడు కృష్ణ.

"పెళ్ళామంటే తెలీదా ? భార్య —" నవ్వుతూనే అన్నాడు ప్రసాద్.

"ఆ విషయం తెలుసులేరా !— పెళ్ళెప్పుడయింది నీకు ?"

"అదో పెద్ద కథలే !..."

"చెప్పకూడదా ?"

"ఎందుకు చెప్పకూడదు ? నేను పని చేస్తున్న కంపెనీలోనే మంజు అనే అమ్మాయి కూడా పని చేస్తోంది. ఇద్దరికీ స్నేహం అయింది—ఆ తరువాత ప్రేమ — పెద్దాళ్లెవరికీ తెలీకుండా పెళ్లి జరిగిపోయినయ్. ఈ మధ్యే అందరికీ తెలియజేయటం — వాళ్ళంతా గొడవ— నానాహంగమా అయిందనుకో."

కృష్ణకు ఆశ్చర్యం కలిగింది.

ప్రసాద్ ప్రేమలో పడడమంటేనే తమాషాగా ఉంది. దానికి తోడు పెళ్లి అదీ పెద్దాళ్లకు తెలీకుండా.

ఆటో ఓ ఇంటి ముందాగింది.

సామాను తీసుకుని లోపలకు నడిచారిద్దరూ.

అతని భార్యను పిలచి కృష్ణకు పరిచయం చేశాడతను.

"నమస్తే !" అందామె చిరునవ్వుతో.

ప్రతి నమస్కారం చేశాడు కృష్ణ.

"కూర్చోండి ! ఇప్పుడే కాఫీ తెస్తాను" అంటూ హడావుడిగా లోపలకు వెళ్లిందామె.

కాఫీ ఫలహారాలయ్యాక ఇద్దరూ కబుర్లలో పడ్డారు.

"ఎలా వుంది మా మంజు ?" నవ్వుతూ అడిగాడు ప్రసాద్.

"అంత మంచి అమ్మాయి దొరకడం నీ అదృష్టం" అన్నాడు కృష్ణ.

"మా వాళ్లు కూడా నన్ను తిడదామని పని గట్టుకుని వచ్చి, తీరా మంజుని చూసి దీవించి వెళ్లిపోయారు."

"ఈజిట్? " ఆశ్చర్యంగా అన్నాడు కృష్ణ.

"బాగా కలుపుగోరుతనంగా ఉంటుందికదా! అక్కడ పడిపోయారు మా వాళ్లందరూ ! మాట్లాడడం కూడా ఒక ఆర్ట్ అని నాకు మంజుని చూశాకే తెలిసిందిరా ! అంతెందుకు ? అసలు నేను బుద్ధితక్కువ పని చేశాను గానీ లేపోతే నీతో ఎన్నో కబుర్లు చెప్తూ కూర్చునేదీ పాటికి."

"ఏం చేశావ్ ?" ఆశ్చర్యంగా అడిగాడు కృష్ణ.

"మొన్నొకరోజు మనం వైజాగ్‌లో గడిపిన రోజుల గురించీ, మన స్నేహం గురించీ అన్నీ చెప్తుంటే — నీ విషయాలు అడిగింది — అతనెక్కడున్నాడూ, ఏం ఉద్యోగం చేస్తున్నాడూ అని — అప్పుడు జరిగిందంతా చెప్పాను. సావిత్రి విషయం వినేసరికి మంజుకి నీ మీద చాలా కోపం వచ్చేసింది. అప్పటినుంచీ నీ పేరు చెప్తే భయం —"

కృష్ణ మొఖం పాలిపోయింది.

"భయం కాదురా ! దానిని అసహ్యం అంటారు..."

"నోనో — అదేం కాదులే ! అయినా నీ రూపం చూస్తే అందరూ భయపడేలానే ఉందిలే ! ఆ క్రాపూ, ఆ గడ్డం — అచ్చం పిచ్చాడిలా కనబడుతున్నావ్ —"

"నిజంగా పిచ్చాడినయిపోయినా బావుండు నవిపిస్తోందిరా !"

"ఏడ్వావ్ లేగానీ — ముందు నువ్వెళ్ళి ఆ గెటప్ మార్చుకురా ! లేకపోతే నీకు ఉద్యోగం కాదు గదా — అసలు లోపలకు రానీరెవరూ !"

"నీ యిష్టంరా ! నువ్వేం చేయమంటే అది చేస్తాను. కానీ నాకు ముందు ఉద్యోగం కావాలి ! ఇంకో విషయం కూడా ఇప్పుడే చెప్పేస్తున్నాను. నేను మళ్ళీ తిరిగి ఇంటి కెళ్ళదల్చుకోలేదు. ఎక్కడో చోట, ఏదోక ఉద్యోగం దొరికితే చాలు — ఆఖరికి ఫిజికల్ లేబర్‌గా పని చేయడానికయినా సిద్ధమే ! నాక్కావలసింది నన్ను నేను పోషించుకోవటం — ఇంకో ఆలోచన లేకుండా గడపడానికి ప్రయత్నించడం —"

ప్రసాద్‌కి అతనిని చూస్తే జాలి కలిగింది.

"ప్రయత్నిద్దాంగానీ నువ్వు ఉద్యోగం కోసం మరీ తొందరపడితే లాభంలేదు. అంత మునిగిపోయింది కూడా ఏమీలేదు. ఏదోక మంచి ఉద్యోగం దొరికేవరకూ నా దగ్గరే ఉంటావు గనుక నీ పోషణ గురించి ఆలోచించనక్కర్లేదు. సరేనా ?"

"నీకు తెలీదురా ప్రసాద్! నాకు ఎవరి దగ్గరా ఉండడానికి మనస్కరించడం లేదు. ఎవరి మీదా ఆధార పడడం అసలు ఇష్టంలేదు. ముందు ఏదోక ఉద్యోగంలో చేరాలి. నా బ్రతుకు నేను బ్రతకడం ప్రారంభించాలి. అంతవరకూ అనీజీగానే ఉంటుంది నాకు..."

అతనిలోని మార్పు ప్రసాద్‌ని చకితుడిని చేసింది.

"సరే—అలాగే ట్రై చేద్దాం..." అన్నాడతను.

వారంరోజులపాటు ఇద్దరూ అతని స్కూటర్‌మీద ఇంచుమించుగా సిటీ అంతా గాలించేశారు. తెలిసిన వారినందరినీ కలుసుకున్నారు. అయినా ఏమాత్రం ఉపయోగం లేకపోయింది.

ఆ పరిస్థితి కృష్ణకు చాలా ఆందోళన



కరంగా తయారయింది. ఉద్యోగం దొరకడం అంత తేలిక కాదని తనకు తెలుసు. కానీ కాయ కష్టం చేసే ఉద్యోగం కూడా దొరకడం కష్టం అన్న విషయం అశాంతి కలిగిస్తోంది.

"రోజుల తరబడి ఇలా ఎదురుచూస్తూ గడపాల్సిందేనంటావా?" ప్రసాద్ నడిగాడతను బాధగా.

"హాయిగా తిని కూర్చోక అలా గొడవ చేస్తావేమిట్రా? ఎప్పుడో దొరుకుతుందిలే! మనకు తెలిసిన వాళ్ళందరికీ చెప్పాంగా!"

కృష్ణకేం చెప్పాలో తెలీటం లేదు.

తనకు ఉద్యోగం దొరకక పోవడం అటుంచి ప్రసాద్ భార్య మంజ ప్రవర్తన చాలా అశాంతి కలిగిస్తోంది.

తనను ఓ పెద్ద రాక్షసుడిని చూసినట్లు చూస్తుంది. తనతో మాట్లాడ్డానికి భయం. ఎదుటపడితే తను హత్య చేస్తాడేమో అన్నట్లుగా— తనుండే గది తలుపులు గొళ్ళెం వేసేసుకుంటుంది.

ఇలాంటి పరిస్థితుల్లో ఆ ఇంట్లో ఉండి ఆమెకు బాధ కలిగించడం తనకు నచ్చటం లేదు.

"ఇంకెవ్వరూ లేరంట్రా—తెలిసినవాళ్ళు?" అడిగాడు కృష్ణ.

ప్రసాద్ ఆలోచనలో పడ్డాడు.

"మనకి తెలిసిన వాళ్ళందరూ—ఎక్కువగా— ఏ ఉపయోగం లేనివారే!" అన్నాడు నవ్వుతూ.

"అయితే పోనీ ఏదయినా హోటల్లో సర్వర్‌గా చేరిపోతాను!"

ప్రసాద్ పగలబడి నవ్వాడు.

"ఎందుకలా నవ్వుతావ్ ?"

"సర్వర్‌గా నీ గెటప్ ఊహించుకుంటేనే సరదాగా ఉందిరా!"

హఠాత్తుగా అతని నవ్వు ఆగిపోయింది.

"అన్నట్లు మర్చేపోయాన్రా! మా ఫ్రెండ్ తమ్ముడు ఒకతను ఈ మధ్యే సి. ఏ పూర్తిచేసి ప్రాక్టీస్ పెట్టాడు. అతని నడిగితే ఏమయినా ఉపయోగం ఉంటుందేమో!"

"బాబ్బాబు— పదరా— వెళ్ళి అడుగుదాం."

"ఓకే—పద! ఇప్పుడయితే అతను ఇంట్లోనే దొరుకుతాడు మనకి" అన్నాడు ప్రసాద్.

ఇద్దరూ స్కూటర్ మీద అతని స్నేహితు డింటికి చేరుకున్నారు.

"ఏమిట్రా — ఇంత రాత్రి వేళ బయల్దే రావ్ ?" ప్రసాద్‌ని అడిగాడతను.

"అర్జంటు పని పడింది నీతో!"

"కూర్చోండి!" అన్నాడతను.

ప్రసాద్, కృష్ణ సోఫాలో కూర్చున్నారు. తనూ వాళ్ళకెదురుగ్గా కూర్చున్నాడు.

"ఇతనూ మా ఫ్రెండ్ కృష్ణ! నాతో పాటు ఎమ్. ఏ చదివాడు. ఇతను రామకృష్ణ, ఎస్. బి. హెచ్.లో ఆఫీసరు ..." పరిచయం చేశాడు ప్రసాద్.

# జీవితం—సెంటిమెంట్

"గ్లాడ్ టు మీట్ యూ ..." అతనితో కరచాలనం చేశాడు కృష్ణ.

"వచ్చిన పనేమిటంటే మా వాడికి అర్జంటుగా ఏదోక జాబ్ కావాలి. టెంపరరీ అయినా సరే! మీ బ్రదర్‌కి తెలిసిన కంపెనీలు గానీ ఆఫీసులుగానీ ఎక్కడయినా ఖాళీలుంటే ముందు ఇరికించేయాలి..." చెప్పాడు ప్రసాద్.

రామకృష్ణ నవ్వాడు.

"సరే! మా వాడి నడుగుదాం'! అంటూ లోపలివేపుకి తిరిగి "శ్రీధర్" అంటూ పిల్చా డతను.

మరుక్షణంలో ఓ యువకుడు లోపల్నుంచి వచ్చాడు.

"ఏమిటన్నయ్యా ?"

"ఈయన పేరు కృష్ణ! ఎం. ఏ.— ఈయనకు అర్జంటుగా ఉద్యోగం కావాలి. ఏదోకటి— ముందు టెంపరరీగా దొరికితేచాలు— నీకు తెలిసినవేమయినా ఉన్నాయా ?" తమ్ముడి నడిగాడతను.

శ్రీధర్ ఓ క్షణం ఆలోచించాడు.

దీపిక మాస పత్రికలో పనిచేయడానికి ఎవరయినా కావాలని ఆ పత్రిక ప్రొప్రయిటర్ నాతో చెప్పాడన్నాయ్— చెప్పి వారం రోజులయి పోయింది. మరిప్పుడు ఎవర్నయినా వేసుకున్నారో ఏమో తెలీదు–" అన్నాడతను

"అయితే మరింకేం ? అందులోనే చేరిపొండి! అంతగా అది మీకు కుదరదు అను కుంటే వేరే ఉద్యోగం చూసుకోవచ్చు" సలహా ఇచ్చాడు రామకృష్ణ.

"సరే!" ఒప్పుకున్నాడు కృష్ణ.

"అయితే ఎప్పుడు వెళ్దామంటారు ఆ మాగజైన్ ఆఫీస్‌కి ?" అడిగాడు ప్రసాద్.

"నేను రేపు మార్నింగ్ ఫోన్‌చేసి కనుక్కుం టాను — ఆ పోస్ట్ ఖాళీ ఉందోలేదో! మీరు పదిన్నరకల్లా మా ఇంటికి రండి!"

"ఓకే — "

ఇద్దరూ మళ్ళీ ఇంటికొచ్చేశారు.

మర్నాడు వాళ్ళు శ్రీధర్ కోసం వెళ్ళేప్పటికి అతను వారికోసమే ఎదురుచూస్తూ కనిపించాడు.

"మీ కోసమే చూస్తున్నాను" అన్నాడతను చిరునవ్వుతో.

"ఫోన్‌చేశారా ?" అడిగాడు ప్రసాద్.

"చేశానండీ! ఇంకెవ్వరినీ వేసుకోలేదట — తీసుకురమ్మన్నారు. పదండి వెళ్దాం."

ఆ మాటతో కృష్ణకు ప్రాణం లేచి వచ్చినట్లయింది.

ముగ్గురూ దీపిక పత్రికాఫీసుకి చేరు కున్నారు. చిన్న గోడౌన్‌లాగుందది. ఓ పక్కన దీపిక పత్రికల కట్టలు పడిఉన్నాయ్. మరోపక్క ఏవో ఖాళీ చెక్కపెట్టెలు.

వాటి వెనుక ఆఫీసుంది.

నాలుగు బల్లలు, ఏడెనిమిది కుర్చీలూ, ఓ టేబుల్‌మీద టైప్‌రైటరూ ఉన్నాయ్.

ఓ కుర్చీలో ఒక ముసలాయన కూర్చుని ఏవో లెక్కలు రాస్తున్నాడు. మరో పక్క ఒకతను పత్రికలు బంగీలు కడుతున్నాడు. టైప్‌మిషన్ ముందు ఓ అమ్మాయి కూర్చుని టైప్ చేస్తోంది.

"రాజయ్యగారున్నారా ?" బంగీలు కట్టే అతనిని అడిగాడు శ్రీధర్.

"ఉన్నారండీ !"

"నేను వచ్చానని చెప్పు—" అక్కడకు దగ్గర్లోనే ఉన్న రాజయ్య ఇంటికెళ్ళాడతను.

అయిదు నిముషాల తర్వాత వచ్చాడు రాజయ్య.

లుంగీ, చారల బుష్‌షర్టూ వేసుకున్నా డతను. నెరిసిపోతున్న జుట్టుకి రంగువేసినట్లు స్పష్టంగా తెలిసిపోతోంది.

"రండి! మీకోసమే వెయిట్ చేస్తున్నాను." అంటూ ఆఫీసుకి ఆనుకునే ఉన్న మరో గదిలోకి నడిచాడతను.

అందరూ అతన్ని అనుసరించారు.

చెక్కలతో కట్టిన చిన్న గది అది.

లోపల ఓ పెద్ద డెకొలాన్ టేబులూ, కుర్చీలూ, టేబుల్ మీద ఫోనూ, ఓ ఫానూ — ఉన్నాయ్. అందరూ కూర్చున్నారు.

"ఈయన పేరు ప్రసాద్! మా బ్రదర్ ఫ్రెండ్! వీరు కృష్ణ! ప్రస్తుతం వీరికే జాబ్ కావాలని మీతో చెప్పాను."

"నా పేరు రాజయ్యండీ, నాకు మార్కెట్లో ప్రెస్ ఉంది. ఎలాగూ ప్రెస్ ఉందికదాని మాస పత్రిక పెట్టానీ మధ్యే! ఏదో బాగానే నడుస్తోంది లెండి—" చెప్పాడు రాజయ్య.

"మావాడు ఎం. ఏ పాసయ్యాడులెండి. కనుక మీ పత్రిక్కి బాగానే ఉపయోగ పడతాడు..." నవ్వుతూ అన్నాడు ప్రసాద్.

రాజయ్య నవ్వాడు.

"పత్రికలకు ఎం. ఏలూ, బి. ఏ లూ ఎందుకండీ-దండగ! తెలుగు లిపి చదవడం, రాయడం వస్తే చాలు. మాకు ఉపయోగ పడతారు."

"అవున్లెండి..." ఒప్పుకున్నాడు శ్రీధర్.

"ఆ! చూడు బాబూ! ఇక్కడ ఫలానా పనే చేయాలని ఏమీ లేదు. అన్నీ నువ్వే చూసు కోవాల్సి వస్తుంది ఒకోసారి! కనుక అన్నిపనులూ తెలుసుకుని ఉండాలి. మన ఏజన్సీల విషయాలు, వాళ్ళకు పంపే కాపీలు, సర్క్యులేషనూ, ఎకౌంట్స్, కథలు చదవడం, ఎడ్వర్‌టైజ్ మెంట్స్ కలెక్ట్ చేసుకురావడం — ప్రూఫ్‌లు చదవడం — అన్నీ నీకు తెలిసుండాలి! అర్థ మయిందా?" కృష్ణతో అన్నాడు రాజయ్య.

"అలాగేనండీ!"

"ఇక నీకు ఆఫీస్ టైమింగ్స్ అంటూ ఏమీ ఉండవు కూడా! ఉదయం ఎనిమిది గంటల

కల్లా రావాలి! ఇక రాత్రి వెళ్లడం — నీ పనులన్నీ పూర్తయ్యాకే! ఇవన్నీ ముందే చెప్పడం మంచిదని చెప్తున్నాను. ఎందుకంటే తీరా చేరాక "ఇలా పని చేయడం నావల్ల కాదాన్ర్" అనకుండా నన్నమాట!" నవ్వుతూ అన్నాడు రాజయ్య.

"ఓకే" తలూపాడు కృష్ణ.

"ఇక జీతం గురించి ఏమిటంటే ఇంతకు ముందు ఈ పనులన్నీ చేసినందుగ్గాను మా ప్యూన్‌కి మూడువందలు ఇచ్చేవాడివి. సరే—నువ్వు చదువుకున్నవాడివి కాబట్టి ఇంకో యాభయ్ ఎక్కువ ఇస్తాను. నీ కిష్టమయితే ఇవాళే చేరిపోవచ్చు."

కృష్ణ నవ్వాడు.

సరేనండీ! అన్నీ నాకిష్టమే!"

"ఏమండీ శ్రీధర్ గారూ! నేను మాట్లాడినవన్నీ సరిగ్గా ఉన్నాయా?"

"లేకుండా ఎలా ఉంటుంది లెండి మీరు పత్రికాధి పతులయ్యే" నవ్వుతూ అన్నాడు శ్రీధర్.

"ఒరేయ్ హబీబ్!" గట్టిగా పిలిచాడు రాజయ్య.

బంగీలు కట్టే వ్యక్తి పరుగుతో వచ్చాడు.

"ఏంసార్?"

"నాలుగు 'టీ'లు తీసుకురా!"

"అయ్యో! ఎందుకండీ వద్దు! ఇప్పుడు ఇంటి దగ్గర తాగే బయల్దేరాం."

"మరేంఫర్లేదులెండి! మీరు మా ఆడిటర్ గారు కదా! ఆ మాత్రం మర్యాద చేయకపోతే ఎలా?" నవ్వుతూ అన్నాడతను.

హబీబ్ మరికాసేపట్లో 'టీ'లు తీసుకొచ్చి ఇచ్చేడు.

తాగాక శ్రీధర్, ప్రసాద్ కలసి వెళ్లిపోయేరు.

"సాయంత్రం మళ్ళీ వస్తాను..." వెళ్ళే ముందు చెప్పి వెళ్ళిపోయాడు ప్రసాద్.

"ఇప్పుడు నువ్వు చేయాల్సిందేమిటంటే మన ఏజెంట్లకు పంపించే బండిల్స్‌లో పుస్తకాలు లిస్టు ప్రకారం కరెక్ట్‌గా ఉన్నాయాలేదా సరి చూడాలి. నాతో రా!" అంటూ ఆ గదిలో నుంచి బయటకు నడిచాడు రాజయ్య. అతనితో పాటు బయటికొచ్చాడు కృష్ణ.

సరాసరి టైప్ చేస్తున్న అమ్మాయి దగ్గర కెళ్ళి ఆమెను కృష్ణకు పరిచయం చేశాడతను.

"ఈమె మన టైపిస్టోయ్. పేరు ఉష!

చూడమ్మా! ఇతను ఇవాళే మనాఫీసులో చేరాడు. నీ దగ్గరున్న ఏజన్సీల లిస్ట్ ఇతనికిస్తే కాపీలు చెక్ చేస్తాడు..." అన్నాడతను.

"అలాగేనండీ! ఇప్పుడే ఇస్తాను..." అందామె.

"నేను ప్రెస్ కెళ్తున్నానోయ్ — మళ్ళీ మధ్యాహ్నం వస్తాను..." అనేసి వెళ్ళిపోయాడతను.

"కూర్చోండి!" అందామె కృష్ణవంక చూసి.

అతను ఆమెకెదురుగ్గా ఉన్న కుర్చీలో కూర్చున్నాడు.

అతని రూపం ఆమెలో సంచలనం కలిగించింది. మరోసారి అతని వంక చూస్తే బావుండు ననిపించిందిగానీ అలాంటి ఆలోచన కలిగినందుకు తనమీద తనకే చిరాకు వేసింది.

టైప్ చేయడం ముగిశాక లేచి వెనుక అల్మారలో ఉన్న లిస్ట్ తీసి అతనికిచ్చింది.

"మీరిదివరకు ఏ పత్రికాఫీసులో అయినా పనిచేశారా?" అడిగిందామె.

"ఊహుఁ! అసలెక్కడా పనిచేయలేదు."

"ఓహో — మరేంలేదు. ఇందులో ఊళ్ళ పేర్లున్నాయ్ చూడండి! ఏ ఊరికి ఎన్ని కాపీలు పంపాలో సంఖ్య వేసి ఉంది. ఆ ఊరి అడ్రస్ ఉన్న బంగీలలో సరిగ్గా అన్నే కాపీలు ఉన్నాయో లేదో చెక్ చేయండి — అంతే!" అతనికి వివరించిందామె.

"ఓకే— థ్యాంక్యూ" అన్నాడతను.

తను లేచి వెళ్ళి హబీబ్ బంగీలు కడుతున్న చోట కూర్చుని ఒక్కొక్కటి అందుకుని లెక్క పెట్టసాగాడు.

ఆ పనిలో మునిగిపోతే టైమెలా గడిచిపోతోంది అతనికే తెలీటంలేదు. కొద్దిసేపు పనిచేసి టైము చూసేసరికి మధ్యాహ్నం ఒంటిగంటయి పోయింది. ఎకౌంట్స్ చూస్తున్న ఆచారి సీట్లోంచి లేచి కృష్ణ దగ్గర కొచ్చాడు.

"నీకు లంచ్ టైమ్ కూడా అక్కర్లేదేంటి బాబూ!" అన్నాడు నవ్వుతూ.

కృష్ణ నవ్వాడు.

"ఏదీ ఇంకా పని పూర్తవలేదుగా?"

"బాగుంది— ఇలా చేస్తే రాజయ్య రాత్రుళ్ళు కూడా విన్ను ఇంటికి వెళ్ళనీడు—"

"నాకు ఇల్లే లేదుకదండీ! ఫరవాలేదు—"

ఆచారి నవ్వేశాడు.

"భలే ఘటికుడులే రాజయ్య! నీలాంటి వాళ్ళనే ఏరికోరి పట్టుకొస్తాడు— పద! టీ తాగి వద్దాం!"

కాదనలేక వాళ్ళతో ఆ పక్కనే ఉన్న హోటల్ కెళ్ళాడతను.

"నీకు ఇల్లు లేదంటావేమిటి? మీ వాళ్ళెవరూ లేరా ఇక్కడ?" అడిగాడు ఆచారి.

"ఎవ్వరూ లేరండీ!"

"మరెక్కడున్నారు?"

"అనకాపల్లి—"

"మరి నీ బస ఎక్కడ?"

"ఎక్కడయినా ఓ గది దొరుకుతుందేమో వెతకాలండీ!"

"చాలా కష్టం ఈ చుట్టు పక్కల దొరకడం—"

"ఎక్కడయినా ఫరవాలేదులెండి—అందులో ఉండేది తక్కువ టైమేగా!"

"అయితే అన్నిటికీ రడీ అయే వచ్చావన్న మాట!"

కృష్ణ నవ్వాడు.

**(ఇంకా వుంది)**






## భారతీయుని ప్రతిభ !

పిట్స్‌బర్గ్ యు. ఎస్. ఎ. లో రోబటిక్ ఇన్‌స్టిట్యూట్‌లో డైరెక్టరుగా పనిచేస్తున్న భారతీయుడు డాక్టర్ రాజారెడ్డిని ఫ్రాన్స్ దేశపు ప్రెసిడెంట్ "సివిలియన్ లీజియన్ ఆఫ్ ఆనర్" అనే అత్యధికమైన బిరుదును ప్రదానం చేశారట ఆయన ఆ శాఖకు చేసిన సేవలకు బదులుగా. ఆహా... ఆంధ్రుడా !

## భరణం రద్దు !

డచ్‌లో వో 53 ఏళ్ళ అమ్మాయిని ఆమె భర్త ఏదో కారణంగా డయివోర్స్ చేశాడట. కోర్టు ఆమెకు నెలకి అయిదువేల రూపాయలు (మన లెక్క) భరణం యిప్పించిందట. కానీ ఆ 53 ఏళ్ళ బాలా కుమారి వో 27 ఏళ్ళ అమ్మాయిని వుంచుకుని ఆమెతో స్వజాతి సంపర్కం పెట్టుకున్నదట. ఈ విషయం తెలిసిన ఆమె భర్త తను భరణం యివ్వ పని లేదని, ఆ వుంచుకున్న ఆమె తన ఒహనాటి భార్యను పోషించాలని వాదించి గెలిచాడట.

## రథం క్రిందపడి భక్తుల మరణం !

తమిళగానికి చెందిన వెళ్ళాళగుండు అనే వూరులోని వో కోవెల వుత్సవంలో రథం రోడ్డులో తిరుగుతూండగా వెనక చక్రాల్లో ఒకటి ఓ చిన్న గోతిలో పడిందట. భక్తులు హూప్ అని రథాన్ని వుగ్గంపట్టి లాగేసరికి ఆ వెనుక చక్రాలు రెండూ పుట్టున వూడిపోయి రథం ఠాప్పున వెనక్కి పడిపోయిందట. దాని కింద పడ్డ వో నలుగురు నలిగి చనిపోయారట. చాలా మంది గాయపడ్డారట — భగవంతునికేమీ దెబ్బలు తగలలేదు కదా !






## పగచే హతమయిన అభాగ్యులు !

హైదరాబాద్ నాంపల్లి ప్రాంతంలోని డన్‌లప్ కంపెని వద్ద ఏప్రియల్ 21వ తేదీన మధ్యాహ్నం మూడు గంటల ప్రాంతంలో డిటెక్టివ్ సినిమాలలోలా వో కారూ, వో వెస్పా స్కూటరూ ఆగి, తృటిలో రవి, కబీర్‌దాస్ అనే యిద్దరు యువకులను ఛట్టున లాగి కార్లో పడేసుకుని వూరొదిలి జిల్లేపల్లి అనే వో గ్రామం చేరాయట. కబీర్‌దాస్ అన్న తన తమ్ముణ్ణి అతని స్నేహితుణ్ణి పట్టపగలు ఎవరో ఎత్తుకు పోయారని అబిడ్స్ పోలీస్టేషనులో రిపోర్టివ్వబోతే అది నాంపల్లి స్టేషనులో యివ్వాలన్నారట వారు. అక్కడకువెళ్తే ఎబ్బే! ఆ స్పాటు ఎబిడ్స్‌కు చెందుతుందే అన్నారట. ఆ రోజు రాత్రిదాకా కేసు నమోద్ చేయలేదట. మర్నాడు పహడే షరీఫ్ ప్రాంతంలోని జిల్లేపల్లి కొండమీద వో రెండు శవాలున్నాయని వో గొర్రెల కాపరి చెప్పిన వార్త ఆ వూరువాళ్ళు పోలీసులకు మోసుకు వెళ్తే, వీరిద్దరే వారిద్దరని పోలీసు తేల్చిందట. జబ్బార్ అనే వో యువకుడు ఆడవాళ్ళని ఏడిపిస్తూంటే యీ యిద్దరూ అతన్నివారించి, అప్పటికే ఆ జబ్బార్ ఆ పని మానకపోయేసరికి చితుకతన్నారట. ఆ విరోధ పగవల్లనే వీరిద్దర్నీ ఆ జబ్బారు, అతని అనుచరులూ చంపివేశారట.

## ఆదర్శ వివాహానికి సంఘ సేవకుని చొరవ !

కొలంబోకు చెందిన 22 ఏళ్ళ బిహారీలాల్ అనే వో రోడ్డుమీద బండి పెట్టుకుని వస్తువుల నమ్మే కుర్రాడు సరదాపుట్టి వో వేశ్యాగృహానికి వెళ్ళి అక్కడ గీత అనే వో రతీదేవిని చూసి పరవశించి, ఆమెను పెళ్ళాడ నిశ్చయించుకుని అడిగితే మూడువేలిచ్చి ఆ గుంటను తోలుకుపో అందట. అతను శ్రమపడి ఆ డబ్బు సంపాదించి చెల్లించి, తన మనోహరిని తీసుకెళ్తుండగా రౌడీలతన్ని చితకతన్ని, మళ్ళీ వస్తే చావే శరణ్యమని హెచ్చరించి, ఆ గీతను పట్టుకుపోతే యీ విషయం విన్న పోలీసులు పోరా పన్లేనోడా అన్నారట. వినోద్‌గుప్త అనే వో సోషియల్ వర్కర్ యీతనికి సహాయంచేసి, ఆ పిల్లను విడిపించడమేగాక, ఆ మూడు వేలూ కూడా వూడలాక్కొని, వారిద్దరికి తాను దగ్గరుండి వివాహం జరిపించాడట — వినోద్‌గుప్త జిందాబాద్ !

## నగ్న ప్రదర్శనకు శిక్ష !

యు. యస్. ఎ. ఇల్లినాయిస్ కోర్టు వో నేరస్థునికి శిక్ష విధిస్తూ అతన్ని మనస్తత్వ వేత్తవద్దకు పంపమని తీర్పునిచ్చిందట. ఇంతకి నిందితుడు చేసిన నేరమేటయ్యా అంటే ఎంచక్కా బట్టలు విప్పుకుని తను వొంటికి పట్టివుండే లాగు తొడుక్కున్నట్టు భ్రమకలిగేలా ఆ ప్రాంతంలో వొంటికి రంగు చారలు వేసుకుని బీచ్ వొడ్డున గెంతులేస్తున్నాట్ట. దగ్గరసా చూస్తే దిసమొలట. వాటీజ్దిస్ అంటే ... దటీజ్... అన్నాట్ట ! వోరి పిడుగా ?

## హృద్రోగ నివారణకి బీరు !

రోజుకు వో మూడు బీరు సీసాలు స్వాహా చేసేవారు కొంచెం వ్యాయామం చేస్తే వారికి ఏ విధమైన హృద్రోగమూ రాదట. రోజుకు మూడు బీరుసీసాలు, వో అరగంట వ్యాయామమూ దేహానికి లిపొప్రొటిన్ హైడెన్సిటీని అభివృద్ధి చేస్తాయని హుస్టన్ బేలర్ కాలేజి ఆఫ్ మెడిసన్‌కు చెందిన వైద్య నిపుణులు ప్రకటించారట !




## అభిమానంతో ఆత్మహత్య !

రాశిపురం [తమిళగం] కు చెందిన సుబ్బు అనే అతని భార్య వయ్యంతిమాల తమతో తన భర్త సుబ్బు చెల్లెలు విజయలక్ష్మి ఉండవీల్లేదని తన భర్తతో పోట్లాడి, జయించలేకపోయిందట. దాంతో అస్తమానూ ఆమెకు, విజయలక్ష్మికి పోట్లాటలౌస్తూండేవట. సుబ్బు తన భార్యని మందలిస్తూండేవాడట. దానివల్ల ఆ వైయ్యంతి మాలకి అభిమానం దెబ్బతిని తన ఆరేళ్ళ కూతురు గాయత్రిమీదా, తనమీదా కిరసనాయిలు పోసుకు అంటించుకు చనిపోయిందట. ★

# సవాల్



ఆఫీసు నుండి యింటికి వస్తూ దారిలో ఓ మాసపత్రిక కొన్నాడు రమణారావ్. ఇంటి నిండా పేరుకు పోయిన పుస్తకాల్లో ఈ మాస పత్రిక రేపు చేరిపోతుంది. ఈ పుస్తకాలను చూస్తే రమణారావ్ శ్రీమతికి ఒళ్ళుమంట. సర్దలేక ఛస్తూ వుంటుంది. రోజూ ఆమె సర్దడమూ, రమణారావ్ ఏదో పాతపత్రికను— తన అభిమాన రచయిత రాసిన కథను మళ్ళీ చదవాలనిపించడంతో పుస్తకాల్ని బైటికి లాగడమూ—ఆయనగారి శ్రీమతి గొణుక్కుంటూ అన్నీ సర్దడమూ వారంలో కనీసం రెండురోజులు యిలా జరుగుతూ వుంటుంది. ఒక్కసారి పక్కింటి పంకజమో, ఎదురింటి వెంకుమాంబో పత్రికలు పట్టుకెళ్ళడం — తనకు కావలసిన పుస్తకం యింట్లో కన్పించకపోతే యిద్దరి మధ్య వాగ్యుద్ధం బైలుదేరుతుంది—ఒకరికి పుస్తకాలు ఎందుకు యివ్వడమంటూ చర్రున లేస్తాడతను— నిజానికి పుస్తకాల బెడద, గొడవ ఎప్పుడూ వుండనే వుంటుంది.

భోజనం ముగించుకుని, భుక్తాయాసం తీర్చుకునేందుకు కుర్చీలో కూర్చుని రమణారావ్ పుస్తకం తెరిచాడు. తెరిచిన ఓ నిముషంలోనే ఉలిక్కిపడ్డాడు. అలా ఉలిక్కిపడటానికి కారణం అందులో తేలో, పామో కన్పడిందని అర్థంకాదు. 'మొదటి బహుమతి' పొందిన ఓ కథను ఓ పేరా చదివాక ఉలిక్కిపడ్డాడు. ఆ కథను అతను రాసిందే! ఎన్నో కథలు చదువగా ఓ రోజు చేతులకు దురదపుట్టి, ఆ దురదను తీర్చుకునేందుకు రాశాడు. అయితే అతను పంపింది మరో వార పత్రికకు. కథ బాలేదనో, మరెందు వల్లనో ఆ కథను సదరు పత్రికవారు త్రిప్పి పంపారు. అలాంటిది మరో పత్రికలో—మరో రచయిత పేరుతో మొదటి బహుమతిని ప్రకటింమతూ, ప్రచురింపపడటం అతనికి ఆశ్చర్యమూ, కోపమూ మిళితమై ఉలికిపాటును కల్గించాయి.

కథను నిదానంగా సాంతం చదివాడు. ఎక్కడా పొరబాటు లేదు. ప్రతి అక్షరమూ, ప్రతి పొల్లు, కామ — మక్కికి మక్కి. కార్బన్ కాపి డిటో—

''డామిట్! ఏమిటీ మోసం. ఎలా జరిగిందిది. అసలు ఎవరీ రచయిత?'' గొణుక్కుంటూ పేరు మరోసారి చూశాడు. తనెప్పుడూ ఏ పత్రికలోనూ చూడని పేరది. ప్రతి రచయిత పేరు దాదాపు యింటి పేరుతో సహా తెల్సు ఆయనకు. ఈ కొత్త రచయిత ఎవరనే మీమాంస నుండి తేరుకుని కథ చివర రచయిత వివరాలు ప్రకటించారేమోనని వెదికాడు. లేవు.

పత్రిక పేజీలన్నీ ఒక్కటొక్కటే తిప్పగా చివరగా తేలిందేమిటంటే సదరు రచయిత తాలూకు ఫోటో, వివరాలు సకాలానికి

'ఉత్తరాలు' శీర్షికకి
రాసేవారు

తమపేరు, పూర్తి చిరునామా తెలుగు లిపిలో రాయాలని మనవి చేస్తున్నాము.

—సంపాదకుడు.

కార్టూన్ లు
పంపేవారికి మనవి

కార్టూన్‌లతోపాటు స్వంత చిరునామాగల స్టాంపులు అతికించిన కవరు పెట్టి సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వార పత్రిక, గాంధీనగరం, విజయవాడ—3. అన్న చిరునామాకి టపాలో పంపాలి. వీటి పరిశీలనకు కనీసం 6 నుంచి 8 వారాలు పట్టవచ్చును. ఈలోగా, నేరుగా కాని, టపాలోగాని వీటిపై ఉత్తర ప్రత్యుత్తరాలకు తావు ఉండదు. కార్టూన్‌లు 'టపా'లో పోయినా, దారి తప్పిపోయినా సంపాదకుని బాధ్యత వుండదు. ప్రత్యేక సంచికలకు కార్టూన్‌లు పంపేవారు కవరుమీద ఆ సంచిక పేరు ఉదహరించాలి. ఈ కార్టూన్‌లకి కూడా పై నిబంధనలు వర్తిస్తాయి.

—సం.

# సవరణ

అందని కారణంగా వచ్చేనెలలో వివరాలతో సహా ప్రచురించగలమని బాక్సుకట్టి, మరీ రాసివుంది.

కథను తిప్పి పంపిన పత్రికవారు తన కథను కాపీచేసి ఈ పత్రికకు పంపించి వుంటారేమోనని అనుమానమేసిందతనికి. అంతటి నీచస్థితికి నిజానికి ఏ పత్రికా దిగజారదు.

రమణారావ్ ఆరేళ్ళ కొడుకు గోడమీదకు విసిరిన టెన్నిస్‌బాల్ అతని ముఖం మీద గుద్దుకోడంతో అసలే కోపంలో వున్న రమణారావ్ మరింత రెచ్చిపోయి, వాడి వీపు విమానం మోత మ్రోగించాడు. వాడి ఏడుపుకు వంటయింటి నుండి రమణారావ్ శ్రీమతి బైటికి వచ్చి "అబ్బబ్బ? ఏమిటి మీరాద్ధాంతమూ. మీరింట్లో వుంటే క్షణం ప్రశాంతం వుండదు. ఎప్పుడూ కొట్టడమూ, తిట్టడమూ — యిదే పని మీకు. మీ పుస్తకాలన్నీ సంచిలో వేసుకుని మెడకేసుకోండి !"

చేతిలోని మాసపత్రికను చూస్తూ, అక్కసునంతా కక్కేసిందామె. రమణారావ్ అవేమీ పట్టించుకోలేదు.

కొడుకు వీపు నిమురుతూ, వాణ్ని బుజ్జగిస్తూ, వాడు ఆపకుండా ఏడుస్తూంటే కొంగున ముడేసుకున్న పదిపైసల బిళ్ళ వాడి చేతికిచ్చి వంటింట్లోకి పట్టుకుపోయింది వాడిని.

రమణారావ్ అన్నీ వెదికి తిరిగి వచ్చిన తన కథను బైటకు లాగి అచ్చయిన ఆ కథ ముందు పెట్టుకుని కూర్చున్నాడు. బహుమతి పొందిన ఆ రచయిత కనీసం ముగింపు కూడ మార్చలేదు. మారుస్తే కథ దెబ్బ తింటుందేమోనన్న కారణంగా —

కథను ముగింపులో కూడ మార్పు చేయకుండ, తన కథను పంపి, బహుమతి పొందిన ఆ రచయిత ఏ దేవతలాగో చటుక్కున ప్రత్యక్షమై 'ఆ కథను రాసింది నేనే బిడ్డా !' అంటే గొంతునులిమి చంపేంత కసిలో వున్నాడు రమణారావ్.

కాస్సేపు ఆలోచించి తన కథను తిప్పిపంపిన పత్రిక తాలూకు ఎడ్రస్‌లోని ఫోను నంబరు కనుక్కుని, మూడిళ్లావల వున్న రామిశెట్టి యింటికెళ్ళి ఎక్కడో సుదూర ప్రాంతంలో వున్న ఓ వూరికి ట్రంకాల్ బుక్ చేశాడు.

ఓ గంట తర్వాత అవతలి వైపు రిసీవర్ తీశారు.

"హలో ! 'మనలో మనం' వారపత్రిక ఆఫీసేనా ?" అడిగాడు రమణారావ్.

"అవునండి ! ఏమిటి విశేషం. ఏజన్సీ కావాలా ?" బిజినెస్‌లోకి దిగుతూ అన్నాడు అవతలి వ్యక్తి.

"అవసరం లేదు. కొన్ని వివరాలు కావాలి. నేను ఒక కథను మీకు పంపించాను. దాన్ని త్రిప్పి పంపించారు ?"

"అఫ్‌కోర్స్ మా అభిరుచిని బట్టి కథను ఎన్నుకోడం జరుగుతుంది. తిప్పి పంపించాము. దీనికోసం మీరు ఫోన్ చేసి మాట్లాడవలసిన అవసరం లేదు ?"

"అయామ్ సారీ ! మీ అభిరుచులు, అలవాట్లు ఏమిటని కాదు నేనడిగేది. అదే నా కథ వేరే పత్రికలో మొదటి బహుమతిని గెల్చుకుంది !"

"దీన్ని తెల్పడానికి మాకు ఫోన్ చేయాలా? వుయ్ హేటిట్. ఎవరి యిష్టం వారిది. కథకు బహుమతి వచ్చిందని మీరా కథను ఎందుకు తిప్పి పంపారనే విషయం మీద డిస్కషన్ అనవసరం !"

"ప్లీజ్ వెయిట్ ! మీరు తొందరపడుతున్నారు. బహుమతి లభించింది నా కథకే అయినా అది నాకు కాదు. నా కథను ఎవరో దొంగిలించి మరో పత్రికకు పంపించారు. మీ ఆఫీసులో 'జగన్‌మోహన్' అని ఎవరైనా వున్నారా ?"

"జగన్‌మోహన్‌లు, జనగణమణలు ఎవరూ లేరు మా ఆఫీసులో. మీరు అనవసరంగా మా టైమ్‌ను వేస్ట్ చేస్తున్నారు. దట్స్ టూ బాడ్ !" అంటూ ఆయన ఠపీమని రిసీవర్‌ని క్రెడిల్ చేశాడు.

రమణారావ్ ఆశ్చర్యంలో మునిగిపోయాడు. అలాటి పేరుగల వ్యక్తులు ఆ ఆఫీసులో లేరని నిర్ధారణ అయింది. అయితే జగన్‌మోహన్ అనే వ్యక్తి ఎవరు ? అదే ఆఫీసులో పన్జేస్తూ కలం పేరుతో అడ్రసుమార్చి కథను పంపించి వుంటే 'మనలోమనం'పత్రికవారికి తెలిసే అవకాశంలేదు.

వెంటనే ఓ నిశ్చయానికి వచ్చిన రమణారావ్ బహుమతి నిచ్చిన ఆ మాస పత్రిక నుండి వివరాలు సేకరించాలని నిర్ణయించుకున్నాడు. అయితే అప్పటి ట్రంకాల్ ఖర్చుకు పదిరూపాయలైతే, మరో రూపాయి అదనంగా జోడించి శెట్టి డబ్బులు రాబట్టుకోడంతో ట్రంకాల్‌కు స్వస్తి చెప్పి, వుత్తరం ద్వారా తెలుసుకోవాలనుకున్నాడు.

రిప్లైకార్డు తీసుకుని బహుమతి యిచ్చిన పత్రికకు ఉత్తరం రాశాడు. అందులో ఎక్కువ వివరాలు రాయదల్చుకోలేదు ఆయన. తనకు కావలసిన ముఖ్యమైన వివరాలు మాత్రమే —

"మొదటి బహుమతి పొందిన ఆ జగన్‌మోహన్‌ది ఏవూరు ? చిరునామా తెల్పండి !" అని రిక్వెస్ట్ చేస్తూ రాశాడు. నాలుగు రోజుల తర్వాత వుత్తరం అందింది రమణారావ్‌కు— అందులో —

"ఇలా వుత్తరం రాసింది మీరేకాదు. ఆ కథ అచ్చయి మార్కెట్టుకు విడుదలైన వెంటనే వేలాది టెలిగ్రాములు మాకు అందాయి. కథ చాలా బావుందని, సమాజానికి యిలాంటి కథలు ఎంతో అవసరమని తెల్పారు. కొందరు మీలాగే అడ్రసూ అడిగారు. మా పత్రికసా యి

మరింత ఎదిగిపోయినందులకు మేము ఎంతో సంతోషిస్తున్నాము. అయినా తొందరపడి యిలా వుత్తరాలు, టెలిగ్రాములు పంపిన మూలాన మాకు ఆనందంగా వున్నప్పటికీ, అలసటగా వుంది. ఎలాగూ వచ్చే నెలలో ఫోటోతోసహా రచయిత పరిచయ ముంటుందిగా. వివరాలను వచ్చే సంచికలో ప్రకటించబోతున్నాము. మీకు వివరాలు అందించడంలో మేము సుముఖంగా లేమని మీరు భావించవద్దు. మీలో ఎవరా రచయిత? ఎలా వుంటాడు? అన్న థ్రిల్‌ను కల్గించాలనే కారణంగా వివరాలు తెల్పలేక పోతున్నాము --

మీ ఎడిటర్.

ఉత్తరం చదువుతూనే మండిపడ్డాడు రమణారావ్. అడ్రస్ అడిగితే తను పొగిడినట్లు ఆ ఎడిటర్‌గారు భావించుకున్నందులకు 'అగ్నిమీద ఆజ్యం' పోసినట్లు అయింది ఆయనకు. అయినా చేసేది ఏమీలేక వచ్చే సంచిక కోసం ఎదురు చూడసాగాడు.

* * *

మరుసటి నెల సంచిక కొన్ని కారణాలవల్ల ఆలశ్యంగా మార్కెట్టుకు వచ్చింది. ఆ ఆలశ్యానికి సంజాయిషీ యిచ్చుకుంటూ పాఠకులు మన్నించాలని ఎడిటర్‌గారు విన్నవించుకున్నారు మొదటి పేజీలోనే.

రమణారావ్ అందులోని కథలూ, ఏవీ చదువదల్చుకోలేదు. గబ, గబా పేజీలు తిప్పి మొదటి బహుమతి పొందిన రచయిత వివరాల కోసం వెదికాడు. వివరాలు లభించాయి ఫోటోతోసహా —

రచయిత జగన్‌మోహన్ గ్రాడ్యుయేటు. అతనిలో ఈ కథను రాసేందుకు ప్రేరణ — కొన్ని సామాజిక పరిస్థితులట — తనకు మరెన్నో కథలు రాయాలని వుందట — కలం పట్టిన మొదటి రచనకే ప్రథమ బహుమతి రావడం — భగవంతునిమీద నమ్మకం వుండటంవల్లనేయట—

రచయిత ఎడ్రసునుబట్టి స్థానిక రచయితే అని అర్థమైంది రమణారావ్‌కు. వెంటనే ఆ కథను జగన్‌మోహన్ ఎలా దొంగిలించాడో తెల్సుకోవాలనే క్యూరియాసిటీ బైలుదేరింది.

అతనికున్న దుర్గుణాల్లో మొదటి దేమిటంటే — ఈ కాలంలో కూడ అనుకున్న పనిని వెంటనే చేసేయడం — పర్సనల్ మేటర్స్ లోనే కాదు — ఆఫీసు వర్కులోకూడ.

రమణారావ్ చేతికి ఆ మాస పత్రిక ఉదయం ఆరుగంటలకే వచ్చేసింది. ఆ అడ్రస్సును బట్టి తను జగన్ మోహన్‌ను కలుసుకునేందుకు ఎక్కువ సమయం తీసుకుంటుందని అర్థమైంది.

రమణారావ్ రాష్ట్రప్రభుత్వంలో, నాన్ వెకేషనల్ డిపార్ట్‌మెంట్ ఉద్యోగి. కనుక అతనికి ఆర్జిత్ లీవ్ సదుపాయం వుంది. అంటే సంవత్సరానికి దాదాపు ముప్పయిరెండు రోజులు. ఈ శెలవు దినాల్లో అతను సంవత్సరాంతమున పదిహేను రోజులు ఎన్‌క్యాష్ చేసుకునే అవకాశ ముంది. కాని అలా ఎన్‌క్యాష్ చేసుకోకుండా ఆరుసంవత్సరములు ఎక్యూమిలేట్ చేసుకుంటూ తన యిరవైఏళ్ల సర్వీసును నెట్టుకొస్తున్నాడు.

క్యాజువల్ లీవ్స్‌ను ఈ సంవత్సరంలో కొన్ని కారణాల వల్ల వాడేసుకున్నాడు. ఈ వెధవ ఎంక్వయిరీకి ఆర్జిత్ లీవ్‌తో ఓ దినాన్ని అనవసరంగా దుర్వినియోగం చేసుకోవడం బాధాకరంగా వుంది.

ఆఫీసుకి శెలవు చీటీ పంపాడు.

బాకీ వున్న మనిషి దొరకాలన్నా, అవసరమైన ఆఫీసర్ దొరకాలన్నా అనువైన సమయం అర్లీ మార్నింగ్ అని రమణారావ్ నమ్మకం. ఆ పద్ధతిలోనే సదరు అడ్రసు పట్టుకుని వెళ్లగా అది ఓ సినిమా థియేటర్ ఎదురుగా నున్న రోడ్డులోకి జొరబడి, ఓ నాల్గు రోడ్ల కూడలిలో చీలిపోయి, కుడివైపుకు మలుపు తిరిగి, చెడిపోయిన బోరింగు వద్ద చిన్న మెలికి తిరిగి, సగం పగిలిన చెత్త కుండీకి పదిగజాలు దూరాన నున్న ఓ పెంకుటిల్లు దగ్గర ఆగిపోయింది.

రమణారావ్ కూడ అక్కడే ఆగిపోయాడు. ఆ ఇంటి ముందు ఓ నులక మంచం మీద ఓ ముసలాయన కూర్చుని బీడి కాలుస్తూ మధ్య మధ్యలో తెరలు తెరలుగా వస్తున్న దగ్గుతో బాధపడుతున్నాడు. అతన్ని బాగా దగ్గనిచ్చి, నింపాదిగా ఆయన వైపుకు కదిలాడు.

ఆ ముసలాయన బీడీ ముక్కను మంచం కోడు మీద అదిమి, ఆర్పేసి రమణారావ్ కేసి చూశాను.

''జగన్‌మోహన్ మీ అబ్బాయేనండీ!'' మళ్లీ దగ్గుతాడేమోనని భయపడుతూనే అడిగాడు.

''అవును...ఎందుకడుగుతున్నారు?''

''ఊరకే! ఉన్నాడా?''

''లేడండీ! ఇవాళ ఉదయమే గండికోట కెళ్లాడు. సాయంకాలానికి గాని తిరిగి రాడు!''

''గండికోటకా? ఎందుకు?''

''వాడేదో కథ రాశాట్ట. దానికి బహుమతి వచ్చిందట. స్నేహితులందరూ వాడ్ని పార్టీ యివ్వమని గొడవ పెడుతూంటే యివాళ పొద్దునే గండికోటకు నాన్‌స్టాప్ బస్‌కు వెళ్ళేడు. ఏమి కావాలి మీకు!

'వాడి వీపు!' అందామన్న ఆవేశం వచ్చింది రమణారావ్‌కు.

''మరేమీ లేదు. వాడు చిన్నప్పుడు చదువుకుంది నా దగ్గరే. కథలు రాసేంతటి వాడయ్యాడుగా. అభినందించి వెళ్దామని వచ్చాను'' అబద్ధమాడేడు.

''అయ్యయ్యో... మీరు టీచరా?'' నొచ్చుకుంటూ — అభిమానపడి 'కూర్చోండంటూ' మంచం పైనుండి లేచాడు ముసలాయన.

''ఫరవాలేదు లెండి! అర్జంటుగా వెళ్ళిపోవాలి!'' అని సిగరెట్ అంటించి అక్కడే పూర్తిగా కాల్చి, ప్రక్కనే వున్న సైడుకాల్వలోకి విసిరేశాడు.

తన లీవ్ వృధా కాకుండా — యివాళే ఆ కథ తాలూకు విషయమేమిటో తేల్చేసుకోవాలని అక్కడి నుండి కదిలాడు.

బస్టాండును గబ గబా పదిహేను నిముషాల్లో చేరుకున్నాడు. జమ్మలమడుగుకు వెళ్లే ఆర్టీసీ బస్సు రడీగా వుంది రద్దీతో. ఆ రద్దీలోనే సర్దుకుని జమ్మలమడుగులో బస్సు దిగేడు.

అక్కడ నుండి గండికోట దాదాపు ఆరు కిలోమీటర్లుంది. ఒకే బస్సు ఎనిమిదిసార్లు తిరుగుతుందట. ఆ బస్సు మరో గంటకు గాని రాదని అక్కడున్న ఓ బుక్‌స్టాల్ ఓనర్ను అడిగి తెల్సుకున్నాడు. గంటసేపంటే ఎంతబోరో? అనుకుంటూ ఓ పత్రిక కొన్నాడు. అదేదో కొత్త పత్రిక. ప్రైజ్‌పాస్ కోసం ఓ కథను చదివాడు. రెండు పేరాలు చదివేసరికి రెండు మైళ్ళు



## సవరణ

పరుగెత్తినంత ఆయాసం వచ్చింది. 'వెధవకథ' విసుక్కుంటూ పుస్తకం మూసేశాడు. అప్పటికి ఎండ బాగా ముదిరి, చెమటలు కారుతున్నాయి. చదువేందుకు బదులు, విసనకర్రలా వుపయోగించాడు ఆ పుస్తకాన్ని బస్సు వచ్చేవరకూ.

బస్సు వచ్చిన వెంటనే ప్రక్క డోర్‌లో నుండి పుస్తకాన్ని సీటులోకి జారవిడిచి, సీ రిజర్వు చేసుకున్నాడు. తర్వాత ఎంట్రన్సు దగ్గరికి వచ్చేసి జనాన్ని త్రోసుకుంటూ వెళ్ళి, బస్సులో తను పుస్తకం జారవిడిచిన చోట కూర్చున్నాడు.

బస్సు డ్రైవర్ హోటల్లో భోంచేసి – జర్దాకిళ్ళీ నములుతూ నింపాదిగా డ్రైవింగ్ సీట్లో కూర్చునేసరికి ఒంటిగంట దాటింది. అప్పటికి బస్సు పూర్తిగా నిండిపోయి, బస్సులో సెగలు పుట్టుతున్నాయి ప్యాసింజర్ల ఉచ్ఛ్వాస, నిచ్ఛ్వాసలతో. పల్లెలు, కొండలు, వాగులు, వంకలూ దిగి, ఎక్కి అక్కడక్కడ ప్యాసింజర్లతో త్రోయించుకుని రెండుగంటలకు గండికోటలో ఆగిపోయింది బస్సు 'గుడుంగ్...గుడుంగ్' మనే శబ్దంతో –

బస్సు దిగిన రమణారావ్‌కు ఆ కొండల్లో జగన్ మోహన్ ఏ బండరాళ్ళలో పార్టీ చేసుకుంటున్నాడో కష్టమైనప్పటికీ వారో అరగంటకు వారి ఆచూకీని తెల్సుకున్నాడు.

రమణారావ్ అక్కడికెళ్ళేసరికి అందరూ భోజనాలు పూర్తిచేసి, కిళ్ళీలు నములూత్తు యిష్టాగోష్ఠిలో వున్నారు. కొన్ని బీర్‌బాటిల్లు ఓ మూలాన పేర్చబడి వున్నాయి. మరికొన్ని నాటుసారా తాగినవాడిలా క్రింద దొర్లుతున్నాయి. అతన్ని చూస్తూనే వాళ్ళు మాట్లాడుకోడం మానేసి ఆయన వైపుకు చూశారు.

రమణారావ్ అక్కడున్న వారిలో జగన్ మోహన్ ఎవరో పోల్చుకున్నాడు. ఆ తర్వాత తను కూడ హిస్టారికల్ ప్లేస్ అయిన ఆ గండికోటను విజిట్ చేయవచ్చినట్లుగా పరిచయం చేసుకున్నాడు.

"మిమ్మల్నెక్కడో చూసినట్లుంది!" జగన్‌మోహన్నుద్దేశించి అన్నాడు.

మిగతా వాళ్ళు ఫక్కున నవ్వారు.

కొందరు ఇంగ్లీషులో ఏదో కామెంటు చేశారు.

'త్రాగిన వెధవలకు ఇంగ్లీషు మాట్లాడ్డం తేలిక! అలా ఇంగ్లీషులో మాట్లాడితే బాగా తాగినవాడి కింద లెఖ్ఖ?'

ఇది రమణారావ్‌కు అనుభవరీత్యా అర్థమైన విషయం. తమ పార్టీల్లో ఎప్పుడైన పాల్గొంటే అతని కొలీగ్ రంగనాథం యింగ్లీషులో ఫ్లూయెంట్‌గా మాట్లాడేస్తాడు–అది తప్పుగాని, వొప్పుగాని--తాగిన వారికి పర భాషోచ్ఛరణ జబ్బేమిటో అతనికి కొరుకుడు పడని సమస్య.

''మీకు పత్రికలు చదువడం అల్వాటుందని అర్థమవుతూంది మాకు. లేకుంటే మిమ్మల్ని ఎక్కడో చూసినట్లుందని అడగరు. ఈ నెల పత్రిక మీరు చూశారా?'' వారిలో ఒకడన్నాడు రమణారావ్ చేతిలోని పుస్తకాన్ని చూస్తూ.

''యస్ ... యస్ ... ఐ హావ్ సీనిట్... మీరు...?''

అనుమానంగాని అనుమానంలో ఆర్థోక్తిలో అనవసరంగా అవుజేశాడు ఆ సెంటెన్స్‌ను జగన్‌మోహన్‌కేసి చూస్తూ.

''నేను జగన్‌మోహన్‌ను. పోయిన నెలలో మొదటి బహుమతి పొందిన కథ నాదే. ఈ నెలలో నా ఫోటో, వివరాలు పత్రికలో వచ్చాయి !''

''యు ఆర్ కరెక్ట్ ! అందుకే మిమ్మల్నెక్కడో చూసినట్లు అనుకున్నాను. గ్లాడ్ టు మీట్ యు !'' అనవసరపు కరచాలనం అందించాడు.

''మీ కథ చదివాను. సుపర్బ్. అలాంటి కథలు రావడం చాలా అరుదు. మీరా కథను ఎలా రాశారు ?''

''పెన్‌తో !''

చెత్త జోకును ఒకరు వెయ్యడంతో డోకు వచ్చినట్లయింది రమణారావ్‌కు.

''ఐ మీన్-- వాట్స్‌ద యిన్స్పిరేషన్ ఈజ్ !''

ఓ పోజు పెట్టాడు జగన్‌మోహన్. ఉపన్యాసమేదో యివ్వబోతున్నాడని గ్రహించాడు.

''మనం సమాజంలోనున్న మనుష్యులం. రోజూ మనం విభిన్న, మనస్తత్వాలు గల మనుషుల నెందరినో చూస్తుంటాము. వీరిని మనం బాగా స్టడీ చేస్తూ వుంటే కథలు వాటంతటవే పుట్టుకొస్తాయి. అత్తా, కోడళ్ళకు సరిపోదు. ఈ ఇతివృత్తం మీద మంచి కథలు రాయొచ్చు. లంచాలివ్వనిదే ఆఫీసులోని ఫైలుకు దుమ్ము రాలిపోదు. ఈ రాపిడిలో సామాన్యుడు నలిగి ఎలా బాధలు అనుభవిస్తున్నాడో మనకు తెల్సు. దీనిమీద చక్కటి కథలు రాయొచ్చు. ప్రతి విషయాన్ని నేను కీన్ అబ్జర్‌వేషన్ చేస్తుంటాను. దీన్నే 'అబ్జర్వ్ పాకల్టీ' అంటారు. సృజనాత్మక శక్తి వుంటే చావులేని చేవవున్న కథలెన్నో రాయవచ్చు, నేచెప్పుడూ సమాజంలో జరిగే ఘోరాలను, నేరాలను గమనిస్తూ వుంటాను !'' అతను ఆగాడు.

'హోర్నిన్ను పెట్రోలుపోసి తగలెయ్య. ఏమి అఘాయిత్యంరా నీది ?' అని మనస్సులో తిట్టుకున్నాడు రమణారావ్.

''ఇంకా చెప్పండి !''

''మూడ్ బాగాలేదు. మనం మరోసారి కల్సుకున్నప్పుడు మాట్లాడుకుందాము.''

అక్కడున్న వాతావరణాన్నిబట్టి రమణారావ్‌కు ఓ విషయం అర్థమైంది. జగన్‌మోహన్ ఆ కథను తస్కరించి పత్రికకు పంపించినట్లు తన మిత్రులకుకూడ చెప్పలేదనేది దానివల్ల అతడిపట్ల ఓ ప్రత్యేకమైన గౌరవ స్థానాన్ని వారిముందు పొందగలిగాడు.

అయితే, 'ఆ కథ వాడికెలా వచ్చింది?' అనే అనుమానం అతని మెదడులోని కొంత భాగాన్ని యిప్పటికే నమిలేసింది. ఇక పూర్తిగావున్న మెదడును ఆ అనుమానం నమిలేస్తే పిచ్చి పట్టేలా వుందతనికి. ఆ విషయమేదో తేల్చుకోవాలనే ప్రయత్నంలోకి సూటిగా దిగాడు రమణారావ్.

''మిస్టర్ జగన్‌మోహన్ ! మీరు నిజం చెప్పడంలేదు. మీరు పంపిన ఆ కథ ఓ కథః కార్బన్ కాపి. ఈ విషయాన్ని మీరు దాస్తున్నారు. ఆ కథ మీ చేతికెలా వచ్చిందో చెప్పండి. నేను సంతోషిస్తాను. అంతే తప్ప నేను మిమ్మల్ని చేసేది ఏమీలేదు. ఆ విషయ సేకరణకే నేను యింతదూరం వచ్చాను !''

'కాపీ కథ' అనగానే అక్కడుండే జగన్‌మోహన్ మిత్రుల కళ్లల్లో ఓ విధమైన నిరుత్సాహము జగన్‌మోహన్‌పై ఏర్పడ్డమేగాక— వారిముందు తన బ్యాటరీ డౌన్ చేశాడనే భావం జగన్‌మోహన్ కళ్లలో గోచరించాయి.

''వాడ్యూయూ మీన్...! నేనా కథను కాపీ చేశానా ? మర్యాదగా మాట్లాడండి !''

''ఇంతవరకూ మర్యాదనిచ్చాను. ఇక నేనాగలేను. డబ్బుపోయినా బాధపడడు మనిషి. తిరిగి సంపాదించుకోగలడు. కాని తన భావాలను మరో మనిషి దొంగిలిస్తే — ఏ రచయితా తట్టుకోలేడు. క్యారీయాన్... ఐ వాంట్ ది రియల్ కాజ్! ఆ కథ నీ చేతికి ఎలా దక్కింది!'' కోపంతో అరిచాడు రమణారావ్.

అతని కోపానికి జగన్‌మోహన్ కాస్త జంకాడు. మిగిలిన అతని మిత్రులెవ్వరూ ఆ విషయంలో జోక్యం చేసుకోలేదు. కాపీ కథ అనగానే భవిష్యత్తులో వాడు మంచి కథలు రాసి, మళ్ళీ పార్టీలిస్తాడనే నమ్మకం లేదని తెల్సిపోయింది వారికి.

జగన్‌మోహన్ కాస్సేపున్నాక అన్నాడు.

''మీరు నన్ను అపార్థం చేసుకోవద్దు. నిజం చెప్తున్నాను. ఆ కథ కాపీనే. కాని దాన్నెక్కడా నేను దొంగిలించలేదు. మాకు ఓ కిరాణా కొట్టు వుంది. కస్టమర్స్ కొన్న వస్తువులు ప్యాక్ చేసి యిచ్చేందుకు మాకు పేపర్లు అవసరం. కొందరు ఇల్లిల్లు తిరిగి పాత మ్యాగజైన్లు, న్యూస్‌పేపర్లు కొని, మాకు అమ్ముతూంటారు. ఓసారి ఓ మ్యాగజైనులో ఆ కథకు సంబంధించిన స్క్రిప్ట్ వచ్చింది. నాకు కథలు చదివే పిచ్చేగాక, కథలు రాయాలని కోరిక. ఆ కథను చదివాను. నాకెందుకో బాగా నచ్చింది. ఆ కథను ఫేర్‌చేసి పత్రికకు పంపించాను. కన్సొలేషన్ రావచ్చని అనుకున్నాను. ప్రథమ బహుమతి లభించింది. అంతేగాని - ఇందులో నా మోసం ఏమీలేదు !''

అప్పుడు జ్ఞాపకం వచ్చింది రమణారావ్‌కు. తను మొదట తన భావాలకు ఓ చిత్తు ప్రతిని తయారుచేసుకొని, దాన్నే ఫేర్‌చేసి పంపించాడు. అది తిరిగివచ్చింది. ఎంతవరకూ తను తిరిగి వచ్చిన ఆ వ్రాత ప్రతినే దృష్టిలో వుంచుకున్నాడుగాని — వాని చిత్తుప్రతిని జ్ఞాపకం చేసుకోలేదు. ఫేర్ చేశాక ఆ చిత్తుప్రతిని ఏదో మ్యాగజైన్లో పెట్టి మర్చిపోయాడు ఇంటి నిండా పుస్తకాలు పేరుకునిపోడంతో మూడ్నెళ్ళ క్రితం తనే ఇంటికి వచ్చిన ఓ అతనికి తూకానికి మ్యాగజైన్లు, న్యూస్ పేపర్లు అమ్మేశాడు. అమ్మే ముందు తను ఓసారి అన్నీ తిరగేసివుంటే ఈ ప్రమాదమూ, ఇంత రిస్కూ, వుండేదికాదు.

ఎందుకో తలనెప్పిగా అన్పించింది రమణారావ్‌కు. చుట్టూ చూశాడు. మిగిలిన ఒకే ఒక బీర్ బాటిల్ కన్పించింది.

''ఇఫ్ యు డోంట్ మైండ్.. !'' అంటూ బీర్‌బాటిల్ అందుకొని ఓపనర్‌తో కార్కును తీసేసి సీసా పైకెత్తి గొంతులో పోసుకున్నాడు.

''నా కథ అచ్చయింది. పేరు ఎవరిదైతే నేమి. అప్పుడప్పుడు మనం పత్రికల్లో 'సవరణ'లు చూస్తుంటాము. ఫలానా కథకు పేరు పొరబాటున ఈ విధంగా అచ్చయిందని, దాన్ని ఈ విధంగా సవరించుకోమని పత్రికలవాళ్ళు సూచిస్తూవుంటారు. అలాగే అనుకుంటాను. నౌ... ఐయామ్ హ్యాపీ !'' అంటూ రిలాక్సయ్యాడు రమణారావ్. 



## హైదరాబాదు నోట్‌బుక్

### వాగ్గేయకార అభియంత కుంటిమద్ది భక్తవత్సలం :

సంగీత విద్వాంసులైన న్యాయవాదులున్నారు; వైద్యులున్నారు; విజ్ఞాన శాస్త్రజ్ఞులున్నారు. రాజకీయ నాయకుల సంగతి చెప్పనక్కర్లేదు. ప్రజావర్తనానికి సంగీతం కూడ సాధనం గనుక వారిలోను సంగీత విద్వాసులున్నారు. కాని అభియంతలలో (ఇంజనీర్లలో) అరుదు: శ్రీ భక్తవత్సలం దీనికి అపవాదం. ఆయన సంగీత విద్వాంసులు మాత్రమే కాదు. ఎన్నో నూతన రాగాలు కనుగొని వేల కొలది కృతుల రచించిన సుకృతులు. శ్రీ భక్తవత్సలం నిరాడంబరులు, నిర్మల చరితులు గనుక ఎలాటి ప్రచారమూ ఆశించక కుంభాగత ప్రదీప కళికగా నిశ్చలంగా వెలుగులు వెలార్చుతుంటారు. సన్నిహితులకు సంగీత సుధను పంచి పెడుతుంటారు. ఇంత వరకు ఆయన తెలుగు, సంస్కృత, కన్నడ భాషలలో 72 మేళ కర్తలు, జన్య రాగాలూ కలిసి దాదాపు 700 రాగాలలో, 35 తాళాలలో కీర్తనలు,వర్ణాలు 4200 రచించారు. ఒక రోజు 35 కీర్తనలు వచ్చాయట. రావడమంటే, నా ప్రమేయం లేకుండా భగవదనుగ్రహంతో నా నుంచి వెలువడుతున్నవి. వాటిని భగవత్ప్రసాదంగా స్వీకరించి స్వరపరచడం నా వంతు. నా యోజనగాని, ఆలోచనగాని లేదు. డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డిగారు ఇందులో మీ భాగమెంత అనడిగారు. ఇదే సమాధానం చెప్పాను-అన్నారు ఆయన. ప్రతి కృతికి, వర్ణానికి ఏదో సంఘటన - తన కష్టమో, పై అధికారుల ఒత్తిడో, మరొకటో పూర్వరంగముందట. సాధారణంగా మనం వినని పూర్ణ పంచమ, కనక కుసుమావళి, వేదండ గమన, రతి పతిప్రియ, శేషనాద, సుధాతరంగిణి, విలాసిని, శరభధ్వజ, రాజ తిలకం, రామావతి, ఘోషణి, దిలీపక, స్తుతి ప్రియ, సీమంతినీ ప్రియ, విశారద, స్కంద మనోరమ, వందనధారిణి, భవాభరణం, హ్లాదిని, మోహనవారిధి, భ్రమరధ్వని అంధాళి, ఐరావతి, యమి, అన్నవృద్ధి, జ్ఞానమూర్తి, ముక్తిదాయిని, వీరనాయకి, సురభి ప్రియ, అగ్నికోపం, అలంకారి, గీతమూర్తి, చందనగంధి మొదలయిన నూట పది రాగాలు వినియోగించటమే కాక భక్తప్రియ, భక్త మనోహరి, భక్తానుకూల, కేశవ ప్రియ, మొదలయిన కొత్త రాగాలు కూడా సృష్టించారు. మొదటి పని ఆఫీసు డ్యూటీ. తర్వాత భగవద్ధ్యానం. అప్పుడు ఏ రీతిగా వస్తే ఆ రీతిగా కృతి వ్రాసి, టైం నోట్ చేస్తాను. సవరణలు చేయను. స్వరాలు వ్రాస్తాను. ప్రతి కృతికీ పూర్వ రంగ వుంది. అవన్నీ ఇప్పుడెందుకులెండి. ప్రతి వారి జీవితంలోను ఏవో ఇబ్బందులుంటాయి. ఘర్షణలుంటాయి. వారి పేర్లూ ఊర్లూ ఎందుకు?నాకు ఎలాటి లోటూ కలుగలేదు. అలాంటప్పుడు నా మనస్సును చిక్కబట్టి ఆలపించాను-అంటూ ఎన్నో సంఘటనలు చెప్పారు. వాటిలో ఒకటి పోచెంపాడు కాలువది. 83 తవ్వేప్పుడు మల్లాపురంలో ఆంజనేయ విగ్రహం కనిపించింది. దానిని తీయడానికి అందరూ భయపడ్డారు. భక్తవత్సలం ధ్యానమగ్నులై "వాయ కుమార భయగనవయ్యా, నీ యునికిని మార్చుచు మమ్మేలరా", అని కృతి పాడి మరొక చోటికి తరలించి గుడి కట్టించారట. మరొక మారు ప్రమోషను సమస్య వచ్చింది. అర్హమైన వారినీ అడుక్కోటం ఇష్టం లేదు. అప్పుడొక కృతి మధ్యమావతి రాగంలో వెలువడిందట.

మానధనమె చాలు, నీ, అభి
మాన ధనమె చాలు- పల్ల.
హీనమైన ఈ ఇహజాలములో
కానలేను ఇసుమంతైనను- అ. ప.
తాన తందాన యనుచు భువిలో
మానవాధముల వెంట బోదునా
జానకీ రమణ నీ వుండగనే
పోను పోను అన్యుల దరికెపుడు.
దీన రక్షకుడు భక్తవత్సలుడు
దానవారి నాయండ నుండగా
ఈ సరాధముల ప్రస్తుతింతునా
గానలోలుడే కూర్చు సుఖింబుల.

ప్రతి కృతిలోను భక్తవత్సల అనే ముద్ర వుంటుంది. శ్రీ భక్తవత్సలం వెళ్ళిన చోటల్లా అక్కడి దైవాన్ని కృతితో స్తుతించారు. అహోబల క్షేత్రాన్ని దర్శించినప్పుడు



శ్రీలక్ష్మి నరసింహా
పాలయమాం కరుణామయ-ప.
ఇహ పర సుఖదాయక
అహోబల క్షేత్రాధిప-అ. ప.
కనక కశిపు సుత వరదా
మునిజన మానస చోరా
జనమోహన, తీత భక్తం
అనునయ మాం భక్త వరద.

అని సంస్కృతంలో కృతిచెప్పారు. అన్నట్టు చెప్పడం మరచాను. శ్రీ భక్తవత్సలం అనంతపురం జిల్లా చెన్నే కొత్తపల్లిలో జన్మించారు. పితామహులు సాహిత్య చక్రవర్తి శ్రీ కుంటిమద్ది శ్రీనివాసాచార్యులు. జనకులు శ్రీ రాజ గోపాలాచార్యులు ప్రాచ్య పాశ్చాత్య విద్యా కోవిదులు. భక్తవత్సలం ఫిజిక్స్ మెయిన్‌గా 1945లో బి. ఎ.లోను, మద్రాసు గిండీ కాలేజీలో 1949లో బి. ఇ. లోను ప్రథములుగా ఉత్తీర్ణులయారు. చదివింది సివిల్ ఇంజనీరింగే అయినా తుంగభద్రా ప్రాజెక్టులో మెకానికల్ స్ట్రక్చరల్ ఇంజనీరింగులో తొలి వర్క్స్ మేనేజరుగా పని చేశారు. హీరాకుడ్, జవాయి, మాడదిల్లా, యమునా హైడ్రో ఎలెక్ట్రిక్, గఢ్, గంగాపూర్, షోలియార్, పణ్ణియార్, అరిసికెరె, శరావతి, సిక్కిం రాంగ్నిచు ప్రాజెక్టు, మెట్టూరు టన్నల్ లైనింగ్, హంపీ పవర్ హౌస, ఎగువ సీలేరు, మిడ్ పెన్నార్ ప్రాజెక్టు, పోచంపాడు, లోయర్ మానేరు డాంలలో సూపరింటిండెంటు ఇంజనీరుగా పని చేసి సెక్రటేరియట్‌లో ప్రాజెక్టు శాఖలో డిప్యూటీ సెక్రటరీగా నాలుగు సంవత్సరాలుండి 1983 ఫిబ్రవరిలో పదవీ విరమణ చేశారు. పాత ప్రాజెక్టుల ఆధునీకరణ, కాలువలు సరి చేయడం, తక్కువ నీటితో ఎక్కువ పంట మొదలయిన పనులలో 33 సంవత్సరాల అనుభవం వుంది. దేశంలో తుంగభద్ర గేట్ల వెల్డింగుతో గేట్లు వెల్డింగు తొలిసారిగా జరిగింది. దేశీ వస్తువులతో, కార్మికులతో ఈ పని జరిగింది. విదేశీయులు పరిశీలించి సెభాష్ అన్నారు. మీరింత మేధావులు విదేశాలకు పోరాదా? - అని ఎవరో అడిగారట. దానికి ఆయన మా దేశంలో కావలసినంత పని వుంది. నాకు నా వృత్తిలో సంతృప్తి వుంది. ప్రాజెక్టులోని ప్రతి మంటికణమూ, ప్రతి నీటి బొట్టూ నా పనిని ప్రశంసిస్తుంది. నేను ప్రశంసలకోసం చేయలేదు. ప్రలోభాలకు లోబడలేదు. తుంగభద్రా ప్రాజెక్టులో ప్రతిదీ మేమే చేసుకున్నాము - అని సమాధానమిచ్చి, ఒక కీర్తన ఆలపించారట అఠాణా రాగంలో.

నాకేమి లోటు నీరజ నయనుడు
సాంకేత రాము డండగ నుండగ - ప.
జనకజతో గూడిన రఘు రాముడు
నెనరుగ నా భారమును వహింపగా-అను.ప.
ఇనకుల సోముని భక్తవత్సలుని
మనమున దలచుచు ముదమున పొంగుచు
ఘన శ్యాముని కృపతో సాయుజ్యమ్ము
ననువుగ గొన నోచిన భాగ్యము గల-
నాకేమిలోటు ---------

భక్తవత్సలం పెక్కుచోట్ల సన్మానం పొందారు-చిత్తూరులో, పోచెంపాడులో ధవళేశ్వరంలో, అహోబిలంలో, మరి కొన్ని చోట్ల. 1976లో త్యాగరాజోత్సవాలకు అధ్యక్షత వహించారు. పురందర దాసు పుణ్య దినం నాడు అధ్యక్షత వహించారు. ఆయన ముఖం దివ్య తేజస్సుతో, భగవత్కృతి రచనా గానానందంతో వెలుగుపోతూంటుంది. ఏ పని చేసినా భగవంతుని నమ్మి, జీవితాన్ని అసిధారావ్రతంగా గడిపిన భక్తవత్సలం ప్రస్తుతం అనంతపురంలో, కమలా నగర్‌లో వున్నారు. ఆయన వయస్సు మొన్నటి ఫిబ్రవరి 8వ తేదీకి 58. ఇంకా 50 ఏళ్ళుండి మరికొన్ని వేల కృతులు రచించి, వాటిని పాడే శిష్యులను కూడ తయారు చేయాలని కోరుతున్నాను.

### ఉపశ్రుతి :

ప్రతినిధులంటే ఎవర్రా? - అనడిగారు పంతులుగారు. ప్రతి నిధినీ మింగే వారు సార్ -అన్నాడు శిష్యుడు. కొత్త నిర్వచనం ఎవరు చెప్పార్రా? - అడిగారు పంతులుగారు. శ్రీ నల్లాచక్రవర్తుల శేషాచార్యులనే కవి ఒక వ్యంగ్య కావ్యంలో చెప్పారు సార్ - అన్నాడు శిష్యుడు.

-తిరుమల రామచంద్ర

Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao at the

# మీ పళ్ల మీద చిగుళ్ల పట్టు సడలనివ్వకండి!

## కేవలం ఫోర్‌హాన్స్ మాత్రమే చిగుళ్లను గట్టి పర్చగల ప్రత్యేక అస్ట్రింజంట్ కల్గివున్నది. చిగుళ్లు గట్టిగా వుంటే పళ్లు ఎక్కువ కాలం నిలుస్తాయి.




అమెరికాదేశపు ప్రఖ్యాత దంత వైద్యుడు డా. ఆర్.జె. ఫోర్ హాన్ తాను తయారుచేసిన టూత్ పేస్టులో ఒక ప్రత్యేక అస్ట్రింజంట్ చేర్చాడు.

1. ఇది నేరుగా చిగుళ్ల మీద పనిచేసి, వాటిని బిగుతు చేసే ఒక విశిష్ట పదార్థము.
2. చిగుళ్లను బలపర్చి, పళ్ల మీద వాటికి మంచి పట్టునిస్తుంది.
3. ఇలా మీ పళ్లకు దృఢమైన ఆధారం, దీర్ఘ ఆయుస్సు ఇస్తుంది.







**ఫోర్‌హాన్స్ - ఇది పళ్ల డాక్టరు సృష్టించిన టూత్ పేస్టు.**

339F 234

# అమృతాంజన్ లిమిటెడ్

## 90 సంవత్సరాల పైగా గృహౌషధాలు తయారుచేస్తున్నవారు!

- అమృతాంజనం బాధానివారిణి
  తలనొప్పి, ఒళ్ళునొప్పులు, బెణుకులు, జలుబు, దగ్గు, కండరాల నొప్పులకు.
- అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్
  పసిబిడ్డల అజీర్ణానికి, పళ్ళు వచ్చేటప్పుడు కలిగే బాధలకు.
- అమృతాంజన్ డెర్మల్ ఆయింట్‌మెంట్
  తామర, తీట, గజ్జి వగైరాలకు.
- అమృతాంజన్ సిటోమిక్స్
  దగ్గు మంచి వెంటనే ఉపశమనమునకు కాఫ్ మిక్చర్.
- క్వాన్ మింట్ బిళ్లలు
  నోటిని గొంతుకుని శుభ్రంగా ఉంచేందుకు

- అమృతాంజన్ ఇన్‌హేలర్
  జలుబుచేసి ముక్కుదిబ్బడ, తుమ్ములు వగైరాలకు.
- అనోలియమ్—కోల్డ్ రబ్
  దగ్గు జలుబులను పారద్రోలే అమోఘమైన ఒక కొత్త శక్తి.
- కాలోఫెన్—బాధానివారిణి మాత్రలు
  తలనొప్పి, ఫ్లూ, ఒళ్ళు నొప్పులకు.
- అమృతాంజన్ కాస్టర్ ఆయిల్
  శుద్ధిచేసిన, వాసనలేని స్వచ్ఛమైన ఆముదం.

అమృతాంజన్ లిమి
మద్రా

....ఇండియాలోను,
ఇతర దేశాలలోను
పేరుపొందినది.

